# సర్వసిద్ధాంత సౌరభము

దర్శన ఖండము

ద్వితీయ భాగము

వైశేషిక - న్యాయదర్శనములు

కర్త

శ్రీ అనుభవానంద స్వాములవారు

# సర్వ సిద్ధాంత సౌరభము

కర్త

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీ అనుభవానంద స్వాములవారు**

## దర్శన ఖండము

ద్వితీయ భాగము

వైశేషిక – న్యాయదర్శనములు



ప్రకాశకులు

**శ్రీ అనుభవానంద గ్రంథమాల**

భీమునిపట్టణము

బాపట్ల–బాంచి

Restricting the body of knowledge to a small group deadens the philosophical spirit of a people and leads to spiritual poverty.

జ్ఞానసముదాయమును పరిమిత సంఘమున బంధించుట ప్రజానీకముయొక్క తాత్త్వికాసక్తిని నశింపజేసి, ఆధ్యాత్మికదారిద్ర్యమునకు గొంపోవును.

డాక్టరు. ఆల్బర్టు ఐన్‌స్టీన్

ఓం

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

**ఉద్దేశము :-** ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానందస్వాముల వారిచేతను, యితరులచేతను రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

**విధానము :-** సంవత్సరమునకు కనీసము రెండువందల పుటలు గల గ్రంథములు వెలువడుచుండును.

**విరాళములు :-** 1) రు 500/- లు మించు విరాళ మొసంగు వారు మహారాజ పోషకులు. ఒక ముఖ్య గ్రంథమున వీరి ఫొటో ప్రకటింపబడును. వీరి నామములు ప్రతి కుసుమమున ముద్రింపబడుచుండును. గ్రంథమాల ప్రచురణములన్నియు నుచితముగ వీరి కొసంగబడును.

2) రు 100/- లు మించు విరాళ మొసంగువారు రాజ పోషకులు. ప్రతి గ్రంథమున వీరి నామములు ముద్రింపబడుచుండును. మరియు గ్రంథమాల ప్రచురణము లన్నియు వీరుగూడ నుచితముగ బడయుదురు.

3) రు 50/- లు మించు విరాళ మొసంగువారు పోషకులు. వీరి నామములు అన్ని ప్రచురణముల బ్రకటింపబడును. ప్రచురణముల వీరు సగము ధరలకు బడయుదురు.

4) రు 25/- లు మించు విరాళ మొసంగువారు అభిమానులు. వీరు ప్రచురణముల 3/4 ధరలకు బొందుదురు.

5) రు 10/- లు మించు విరాళ మొసంగువారు సభ్యులు. ప్రచురణముల వీరు 1/8 తగ్గింపు ధరలకు బొందుదురు.

# విరాళకర్తలు



| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీ మెంటా ఈశ్వరయ్యగారు | నెల్లూరు | రు 300/- |
| 2 | శ్రీ కలిగొట్ల సూర్యనారాయణనాయుడుగారు | భీమునిపట్టణము | రు 100/- |
| 3 | శ్రీ నుదురుపాటి వీరరాజుగారు | శ్లోనిపాలెము | రు 100/- |
| 4 | శ్రీ బొలిశెట్టి సీతారామయ్యగారు అడ్వొకేట్ | బాపట్ల | రు 2[illegible]2/- |
| 5 | శ్రీ నందగిరి వేంకటరామదాసుపంతులుగారు | శ్లోనిపాలెము | రు 100/- |
| 6 | శ్రీ పులవర్తి సుబ్రహ్మణ్యం శెట్టిగారు | భీమునిపట్టణము | రు 100/- |
| 7 | శ్రీ బలభద్రుని చెన్నయ్యశెట్టిగారు & సన్స్ | భీమునిపట్టణము | రు 100/- |
| 8 | శ్రీ దుర్గా దానయ్యశెట్టిగారు & సన్ | భీమునిపట్టణము | రు 100/- |
| 9 | శ్రీ కాళ్లకూరి సూర్యనారాయణగారు | విశాఖపట్టణము | రు 100/- |
| 10 | శ్రీ బూదరాజు వేంకట నరసింహారావుగారు | స్వర్ణ | రు 100/- |
| 11 | శ్రీ పసుమర్తి శేషాచలంగారు | నెల్లూరు | రు 100/- |
| 12 | శ్రీ ఏడిద సూర్యనారాయణమూర్తిగారు | భీమునిపట్టణము | రు 50/- |
| 13 | శ్రీ కట్టా సత్యనారాయణ గుప్తగారు | విజయవాడ | రు 50/- |
| 14 | శ్రీ పెనుబోలు బ్రదర్స్ | నెల్లూరు | రు 100/- |
| 15 | శ్రీ ఎలిసెట్టి సుబ్బారాయుడు శెట్టిగారు | నెల్లూరు | రు 58/- |
| 16 | శ్రీ రాయపురెడ్డి అప్పారావు నాయుడుగారు | భీమునిపట్టణము | రు 100/- |
| 17 | శ్రీ కొత్త రమణాజీరావుగారు | బొబ్బిలి | రు 100/- |
| 18 | శ్రీ ఆదవికొల్లు వేంకట కృష్ణ రామచంద్రరావుగారు | శ్రీకాకుళం | రు 100/- |
| 19 | శ్రీ నిట్ట భీమశంకరంగారు రిస్క్ పబ్లిషర్స్ ఇన్స్పెక్టరు | విశాఖపట్టణము | రు 100/- |
| 20 | శ్రీ బండి వీరరాఘవమ్మగారు | చింతలపూడి | రు 100/- |
| 21 | శ్రీ బండి రామారావుగారు | చింతలపూడి | రు 100/- |

| | | | |
|---|---|---|---|
| 22 | శ్రీ గైనేడి వేంకట అప్పారావుగారు | విజయవాడ | రు 100/- |
| 23 | శ్రీ ఉప్పగిరి శ్రీరామమూర్తిగారు | అనకాపల్లి | రు 100/- |
| 24 | శ్రీ బొమ్మదేవర హేమలతాదేవి బహదూర్ గారు | ఏలూరు | రు 100/- |
| 25 | శ్రీ చుండూరు రామానుజంగారు | నెల్లూరు | రు 100/- |
| 26 | శ్రీ వెలగపూడి సుందరరామశెట్టిగారు | నెల్లూరు | రు 100/- |
| 27 | శ్రీ నూనె శేషాచలం శెట్టిగారు | నెల్లూరు | రు 100/- |
| 28 | శ్రీ నూనె జగ్గయ్య శెట్టిగారు | నెల్లూరు | రు 100/- |
| 29 | శ్రీ చిత్తూరు మునుస్వామి మొదలియార్ గారు | నెల్లూరు | రు 116/- |
| 30 | శ్రీ యడ్లపల్లి గోవిందు శెట్టిగారు | నెల్లూరు | రు 116/- |
| 31 | శ్రీ పోలిశెట్టి వేంకట రమణయ్యగారు | సాండ్రింగి | రు 116/- |
| 32 | శ్రీ పూసల్ల జగన్నాథ అప్పలనరసయ్యగారు & సన్సు | విజయనగరము | రు 58/- |
| 33 | శ్రీ శారదా గ్రంథాలయము | శిగ్లాలెము | రు 116/- |
| 34 | శ్రీ పొట్టా వీరరాజుగారు | భీమునిపట్టణము | రు 116/- |
| 35 | శ్రీ నుదురుపాటి సత్యనారాయణ శెట్టిగారు | భీమునిపట్టణము | రు 58/- |
| 36 | శ్రీ కులుమూరు సన్యాసి శెట్టిగారు | విశాఖపట్టణము | రు 100/- |
| 37 | శ్రీ నంగునూరు మహబూబు రెడ్డిగారు దేశిముఖ్ | వరంగల్లు | రు 100/- |
| 38 | శ్రీ మేఘాద్రి మహాలక్ష్మమ్మగారు | గజపతినగరము | రు 116/- |
| 39 | శ్రీ మంతెన వేంకట రామరాజుగారు | బుద్దాము | రు 116/- |
| 40 | శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానము | మచిలీపట్టణము | 116/- |
| 41 | శ్రీ వల్లూరి వేంకట సూర్యనారాయణగారు ప్లీడరు | మచిలీపట్టణము | రు 100/- |
| 42 | శ్రీ యద్దనపూడి రామచంద్రరావుగారు | మచిలీపట్టణము | రు 100/- |
| 43 | శ్రీ తాడంకి వేంకట కృష్ణారావుగారు - అడ్వొకేట్ | మచిలీపట్టణము | రు 100/- |
| 44 | శ్రీ కోటమర్తి రఘునిధిగారు | మచిలీపట్టణము | రు 100/- |

**45** శ్రీ తాడికొండ నాగేంద్రరావు గుప్తగారు మచిలీపట్టణము రు 100/-
**46** శ్రీ చిత్రపు అచ్యుతరామయ్యగారు మచిలీపట్టణము రు 100/-
**47** శ్రీ దీవి సేతు మాధవాచార్యులుగారు మచిలీపట్టణము రు 100/-
**48** శ్రీ పసుపర్తి సుబ్బరాజుగారు ఆడిటర్ మచిలీపట్టణము రు 100/-
**49** శ్రీ అడ్డేపల్లి వేంకటరామయ్యగారు మచిలీపట్టణము రు 100/-



ఓం

# సర్వసిద్ధాంతసారభవము

## ప్రథమ భాగము - అభిప్రాయములు

**1.** ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రచారమునకు యాగ్రంథరచయిత చేయుచున్న కృషి ప్రశంసనీయమైనది. పుస్తకములద్వారా యీ జ్ఞానప్రచారమునకు శ్రీ అనుభవానంద గ్రంథమాల అవిరళకృషి గావిస్తున్నది.

దర్శన, అద్వైత, వైష్ణవ, శైవ, బౌద్ధ, సమన్వయ ఖండములలో శ్రీ కపిల మహర్షిప్రోక్త సాంఖ్య సిద్ధాంతము, శ్రీ పతంజలిప్రోక్త యోగ దర్శనము ప్రథమభాగమున పొందుపరచబడినవి. ముఖప్రబంధము, సాంఖ్య దర్శనము, యోగదర్శనము అను శీర్షికలతో యీ విషయములన్నియు విపులీకరించబడినవి. అనేక ఆంగ్ల గ్రంథములనుండి అవసరమగుచోట్ల కొటేషన్లు యివ్వబడినవి. శైలిగ్రాహ్యముగ నున్నది. ఇది తత్త్వజ్ఞానాన్వేషకులకు, సాధకులకు మిక్కిలి ఉపయోగకరముగా నుండును.

గోలకొండపత్రిక

**2.** వీరు రెండు దర్శనాలను గురించి ప్రత్యేకంగా వేర్వేరధ్యాయాలలో వివరించారు. ప్రత్యేకంగా ఆయా ప్రకరణాలలో ఆయా సిద్ధాంతాలు దొరికినంతవరకు తత్కర్తల చరిత్రలు, సిద్ధాంతాలలోగల వాదోపవాదాలు మొదలైనవన్నీ విపులంగా వివరించారు.

సాంఖ్యానికి సంబంధించిన అధ్యాయంలో ప్రత్యేకంగా సంస్కృత సాంఖ్య కారికలుకూడ చేర్చారు. అలాగే యోగదర్శనానికి సంబంధించిన ప్రకరణంలో పతంజలి యోగసూత్రాలు కూడా చేర్చారు.

మూల గ్రంథాలను గురించి వీరు వ్రాసినదంతా సంస్కృత వ్యాఖ్యానాల వివరణ శైలిలో ఉదాత్తంగాను నిగ్గుదంగానూ సాగిపోయింది.

ప్రత్యేకంగాను తెలుగులో యీ దర్శనాలను గురించి యింత విపులంగా వ్రాసిన పుస్తకాలు చాలా అరుదుగా ఉన్నాయి. అందుచేత తెలుగులో యీ దర్శనాలను గురించి తెలుసుకోదలచినవారి కిది అవశ్యం చదువవలసిన పుస్తకం.

ఆంధ్రపత్రిక

3. శ్రీ స్వాములవారీ మహాగ్రంథమును ఆరు ఖండములుగా వెలయింపదలచినారు. అందు మొదటిదైన దర్శనఖండంలో మొదటిభాగము మాత్రమే యిది. ఎంతవిస్తృత ఎల్లలలో యీ గ్రంథరచనకు శ్రీ స్వాములవారు సంకల్పించారో దీనివలన స్పష్టం.

శ్రీ స్వాములవారు అనుభవానందులే కాదు. సకలశాస్త్ర పారంగతులుకూడా. అన్ని శాస్త్రాలు వారికి కొట్టిన పిండివలె అయిపోయినవంటే అతిశయోక్తి కాదు. వివిధ సిద్ధాంతాలనుగూర్చి ప్రాచ్య పాశ్చాత్య పండిత అభిప్రాయములన్నీ వారికి హస్తగతాలే. మంచినీళ్ళప్రాయంగా వాటిని ఉదహరించుకొంటూ పోగలరు.

తాత్త్విక దృష్ట్యా సాంఖ్య యోగ దర్శనములు ఒక జంట. సాంఖ్యానికి ఈశ్వరకృష్ణుని కారికలనూ, యోగానికి పతంజలి సూత్రాలనూ పరిపూర్ణంగా ప్రకటించి, వానితోపాటు యింకా అనేక యితర గ్రంథస్థ విషయాలను క్రోడీకరిస్తూ స్వాములవారు వ్రాసిన వ్యాసాలు జిజ్ఞాసువులెల్లరూ చదువదగినవి.

ఈ ఆరు ఖండముల ప్రకటనమూగూడా పూర్తి అయ్యేపక్షంలో యిది తెలుగులో ఒక మహాగ్రంథమై వెలయగలదనుటకు సందేహము లేదు. గ్రంథానికి కొలికిపూస ఆరవ ఖండమైన సమన్వయ ఖండమని ఊహించవచ్చు. ఆసమన్వయం చేయడానికి శ్రీరామకృష్ణ పరమహంస సంప్రదాయానికి చెందిన స్వాములవారే ఉత్తమాధికారులు.

కృష్ణాపత్రిక

4. సాంఖ్య యోగదర్శనముల విపుల విమర్శన మీగ్రంథము. ఇది శ్రీ స్వాములవారు సంకల్పించిన 'సర్వ సిద్ధాంత సౌరభము'న నొక తరంగము. హైందవ సాంప్రదాయిక సిద్ధాంతము లన్నింటి సారమును స్వాములవారీ గ్రంథమునందు వెలువరింప సంకల్పించి యీ ప్రథమభాగమున సాంఖ్య యోగ దర్శనముల బరామర్శించియున్నారు.

శ్రీ అనుభవానంద స్వాములవా రాంధ్రదేశమున సుప్రసిద్ధ వ్యక్తి. బాల్యమున విరాగము వారికి లబ్ధమగుట పితృపైతామహ ప్రసాదమని వారే చెప్పియున్నారు. శ్రీరామకృష్ణ పరమహంసనే గురుదేవునిగ గొని, బ్రహ్మచర్యము నుండియే సన్న్యసించి, తమ సాధనానుభవముల నెల్లరకు పంచి

ఋచ్చులు కుపన్యాసముల, గ్రంథముల నాధారముగ గొని వారు చేయుచున్న అనుగ్రహ ప్రసరణము యెల్లరకు సువిదితమే. కాని శ్రీవారింత పండితులని, పాశ్చాత్య ప్రాచ్య దర్శనములందు వారి పాండితి తలస్పర్శమని, వారి శోధన మద్భుత మని, వారి విచక్షణా మేధా విమర్శన శక్తు లనుపమములని, విషయ నివేదన కౌశల్య మప్రతిహాసమని యీ గ్రంథమును జూచిన దనుక చిరపరిచయులగు వారికిని తెలిసి యుండదు. ఈ గ్రంథమున ప్రాచ్య పాశ్చాత్య విమర్శ కాగ్రణుల యభిప్రాయములతోగూడ దర్శనకర్తలు, వ్యాఖ్యాతలు, వారి జీవిత విశేషములు, విషయ ప్రమాణములగు గ్రంథ ములు, ఆయా దర్శనసారము తత్త్వమర్శనలు వేయేల సర్వవిషయము లిందు సంగ్రహింపబడి యున్నవి. కాన నీ గ్రంథము ఆయా దర్శన విషయముల నెరుంగగోరువారికి రసగుళిక యని చెప్పవచ్చును.

శ్రీ అనుభవానంద స్వాములవా రీ గ్రంథ పరంపరను బ్రకటించి ముముక్షు జనోపకారము నిట్లే ఒనర్చుచుందురుగాక యని మా నమస్కార పూర్వకాభ్యర్థనము.

ఆరాధన

5. సర్వ సిద్ధాంత సౌరభమును చిత్రించటంలో తమరు అనుసరించిన మార్గం ఎంతో బాగా ఉన్నది. మనవారు యిట్టి ఉత్తమగ్రంథాల్ని చదివిన గాని మన సంస్కృతి చక్కగా గ్రహించటానికి వీలుండదు. ప్రతి కళా శాలలో ఉన్నత విద్యాలయంలో యిట్టిగ్రంథం ఉండితీరాలి. విద్యార్థులు యీగ్రంథాన్ని చదవటానికి ప్రారంభించారా, వారిని యీకాలంలో ఎదు ర్కొనుచున్న సమస్యలన్నింటిని సునాయాసంగా పరిష్కరించుకోనవచ్చు. విద్యార్థులకన్నా యీగ్రంథాన్ని చదువవలసినవారు ఉపాధ్యాయులు. అప్పుడే ఉపాధ్యాయులు తమ విద్యుక్తధర్మాన్ని సొంతంగా నెరవేర్చినవారవుతారు. తద్వారా విద్యార్థులకు ఆదర్శపురుషులు కాగలరు. సంస్కృతి చాలా పురాతనమైనదని, దానితో సరిసమానమైనది ప్రపంచంలో ఎక్కడా లేదని చెప్పుతుంటే లాభంలేదు. ప్రపథమాన దాని రహస్యాన్ని అర్థంచేసు కోవాలి. అంతేగాదు దానిని తమ జీవితాల్లో కార్యరూపాన పెట్టాలి. తమ గ్రంథము లిట్టి కార్యకలాపానికి ఎంతోసహాయపడగలవు. అందుచేత తాము ప్రారంభించిన పని అంతేవాసులందరికి వారి జీవిత వికాసా నికి ఎంతో సహాయపడగలదు.

డాక్టరు వి. యస్. శర్మ

6. శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ అనుభవానంద స్వాములవారు రచించిన సర్వ సిద్ధాంత సౌరభము అను గ్రంథమును ఆమూలచూడము పరికించి విస్మయానంద ముగ్ధుడ నయితిని. వారి గ్రంథము అంధకూప నిపతితమైన మహారత్నములను ఉద్ధరించినట్లు ప్రమోదమును గూర్చినది. పాశ్చాత్యవాత్యాభిఘాతచే ప్రాచ్య విజ్ఞానలక్ష్మి నేడు సమ్మూర్ఛితయైనది. ఈసౌరభము నాఘ్రాణించిన నవనవ చైతన్యము తిరిగి తేజరిల్లును.

శబ్దప్రామాణ్యము ననుసంధించి ప్రతిభావిశేషముచే తత్త్వశోధన జేసిన ప్రాచ్యమహాశయుల వాఙ్మయములో వాసిగాంచినవి షడ్దర్శనములు. పరమ శాంతి చరమసీమయగు వేదాంత దర్శనమునకు సాంఖ్య యోగ దర్శనములు దక్షిణవామపక్షములు. అట్టి పక్షముల ప్రచారము విశేషించి మన దేశమున క్షీణక్షీణమైనది. ఈ దురవస్థను గమనించి శ్రీ స్వాములవారు తమ సౌరభములో సాంఖ్య యోగములకు అగ్రతాంబూలము నొసంగిరి. వారి పరిశ్రమ వాచామగోచరము ఊహాతీతము. వారి హృదయసీమను ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞానలక్ష్ములు గంగా యమునలవలె సరససంగతిని పొంది లోకమును తరింప జేయ సమకట్టినవి ఈసౌరభము నాఘ్రాణించిన నాస్తికత పటాపంచల గును, ఆస్తికత తిరిగి తేజరిల్లును.

ఆ బాలగోప సులభశైలిలో మహత్తర విషయములను ప్రకటించిన శ్రీవారి యద్భుతశక్తి మిగుల శ్లాఘాపాత్రము. ఇట్టి భగవదంశాంశ సంభూతులు సనాతన ధర్మోద్ధరణకై అరుదుగా నావిర్భవింతురు. వారి సంకల్ప సిద్ధికి నస్మదాదులు పరమేశుని ప్రార్థించుట కృతజ్ఞతాప్రదర్శనమే యగును,

ఆమూలాగ్రము శ్రద్ధతో శ్రీవారి గ్రంథములను పఠింపవలసినదిగా పాఠకమహాశయులను ప్రార్థింతును.

శ్రీవారి చరణ సరోజములకు నావందన పరంపరలు.

శ్లో॥ జీయాదాచంద్రతారార్కం సర్వ సిద్ధాంత సౌరభం।
మూర్ఛితాధ్యాత్మచైతన్య సంజీవన మహౌషధిః॥

శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రి

# సమర్పణము

శ్రీరామాది దశావతారములకుఁ, శ్రీలక్ష్మి వాణీ ఉమా
తారాశక్తులకున్, త్రిమూర్తులకు స్వస్థానంబుగా నొప్పు నా
పారావారము, రామకృష్ణగురు, సర్వాధ్యాత్మికస్థానముఁ
ఆరాధించుచు గ్రంథ మిచ్చెదను సర్వాధ్యాత్మికాన్వేషినై

శ్రీవిద్యా ప్రతిభాస్వరూపులు, మహోత్కృష్టానుభూత స్థితుల్
భావాతీతులు, తత్త్వసిద్ధులును, సర్వాధ్యాత్మికాచార్యులై
భావిన్ భూతము వర్తమానములలో భాసిల్లు తత్త్వజ్ఞులఁ
భావిం చే నిడువాడ గ్రంథమును సర్వాధ్యాత్మికాన్వేషినై

శుభమై, సుందరమై, సుఖప్రదమునై శోభిల్లు తత్త్వార్థ సు
ప్రభ కన్వేషకులౌ ముముక్షులకు సర్వాధ్యాత్మికోత్కృష్ట తా
విభవార్థంబు ననుగ్రహింపగల దేవిఁ 'సర్వ సిద్ధాంత సా
రభముఁ' నేను సమర్పణం బిడుదు సర్వాధ్యాత్మికాన్వేషినై

సర్వ ధర్మ స్థాపస్త్వం
సర్వ ధర్మ స్వరూపకః।
ఆచార్యాణాం మహాచార్యో
రామకృష్ణాయ తే నమః॥

శ్రీ అభేదానందస్వామి.

# విషయసూచిక

# న్యాయ దర్శనము

# సర్వ సిద్ధాంత సౌరభము.

## ముఖప్రబంధము - ద్వితీయభాగము.

### ప్రథమభాగము - దేశవ్యాప్త ఆదరణము.

'..................సర్వాధ్యాత్మికోత్కృష్టతా
విధవార్థంబు ననుగ్రహింపగల దేవిన్ సర్వ సిద్ధాంత సౌ
రభమున్'...............................

అనునటుల సర్వతాత్త్విక సిద్ధాంత ప్రతిపాదనము నిష్పక్షపాత దృష్టి గాలించుచు నందందుగల విశిష్టతను మాత్రమే యేర్చి స్తుతించు నీగ్రంథపుష్పరాజమును

'............రామకృష్ణగురు సర్వాధ్యాత్మికస్థానమున్
ఆరాధించుచు గ్రంథమిచ్చెదను సర్వాధ్యాత్మికాన్వేషినై'

అని సర్వసాధనానుభవ విభూషితుడై యానందించి వాని మాధుర్యరుచుల విరివిగ బ్రపంచమునకు బ్రసాదించిన శ్రీరామ కృష్ణ పరమహంసదేవునికి సమర్పించి, తన అద్వయానందమును ఆంధ్రమున నల్గడల కందజేయ బంపబడిన మన 'సర్వ సిద్ధాంత సౌరభ' ప్రథమభాగము అతిప్రాచీనతముడై ఆదివిద్వాంసుడై తాత్త్వికదృష్టిని బ్రథమతః ప్రతిపాదించిన కపిలాచార్యుని సాంఖ్యసిద్ధాంతమును; ఏతత్సిద్ధాంత ప్రతిపాదిత కైవల్యప్రాప్తి నపేక్షించు ముముక్షువుల ననుకంప దిలకించి, సాధక మనో వాక్కాయగత మలిననిర్మూలనమునకై ఆయుర్వేదవార్తిక, పాణి

నీయ వ్యాకరణ మహాభాష్య, యోగశాస్త్రముల బ్రసాదించి యున్న పతంజలి మునిపుంగవుని యోగదర్శనమును, ఆయా దర్శన విశిష్టతను, తత్తత్కర్తల అమానుష ఆధ్యాత్మికశక్తుల సూపించుచు దేశపర్యటనము గావించి, పండిత పామర సంస్తుతులచే విభూషితులై యలరారియుండుట కెంతయో యానందము గల్గెడిని. సంకల్పించిన విధాన, భారతీయ సంస్కృతీ వైభవలక్ష్మిని ఆంధ్రమహాజనుల దృక్పథమున కందించి అది కృతకృత్యులైరి. సందులకు హిందూసంస్కృతీ విజ్ఞానవేత్తలందరు ఆనందింపక నుండగలరా!

'తత్త్వజ్ఞానాన్వేషకులకు సాధకులకు మిక్కిలి ఉపయోగకరముగ నున్న'దనియు, 'ప్రత్యేకంగా తెలుగులో యీదర్శనాలను గురించి యింతవిపులంగా వ్రాసిన పుస్తకాలు చాల అరుదుగా ఉన్నాయి... అవశ్యం చదువవలసిన పుస్తకం'అనియు 'ఈ ఆరు ఖండముల ప్రకటనముకూడ పూర్తి అయ్యేపక్షంలో, ఇది తెలుగులో ఒక మహాగ్రంథమై వెలయగల దనుటకు సందేహము లే'దనియు 'సర్వసిద్ధాంత సౌరభమును చిత్రించటంలో...అనుసరించిన మార్గం ఎంతో బాగాఉన్నది. మనవారు యిట్టి ఉత్తమ గ్రంథాల్ని చదివినగాని మన సంస్కృతిని చక్కగా గ్రహించటానికి వీలుండ'దనియు 'ఈసౌరభము నాఘ్రాణించిన నవనవ చైతన్యము తిరిగి తేజరిల్లును,.....వాస్తికత పటాపంచలగును. ఆస్తికత తేజరిల్లు'ననియు, 'ఈగ్రంథమున నన్నుచో ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసుల గ్రంథముల యభిప్రాయములతోగూడ దర్శనకర్తలు,వ్యాఖ్యాతలు,వారి జీవితవిశేషములు విషయప్రమాణములగు గ్రంథములు ఆయాదర్శనసారము తద్విమర్శనము,

వేయేల సర్వవిషయము లిందు సంగ్రహింపబడియున్నవి. కాన నీగ్రంథము.....పనగునిక యని చెప్పవచ్చు'ననియు మొదలగు ననేక సంస్తుతుల నార్జించి సౌరభ ప్రథమభాగము నాకత్యంత ఉత్సాహప్రోత్సాహముల గల్గించుటచే, నతి బాధ్యతాయుతమైన సంపూర్ణగ్రంథ ప్రచురణభారమును నే బూనుకొంటిని. ఆరుఖండములలో శోభిల్లు సమగ్రగ్రంథము నాదృక్పథమున నిల్చుచోడ నానందోత్సాహములతో బాటు ఒకవిధమైన భయము గూడ నాకు లేకపోలేదు. గ్రంథరచనమున నెంతగ శ్రమించుచుంటినో యంతకు ననేకరెట్లుగ కృషిసల్పిన గాని ప్రకటించు నవకాశము ప్రస్తుత దేశపరిస్థితులలో గానబడదు. ఆపిమ్మట నాగ్రంథము నెల్లర కరముల కందించి సద్వినియోగపరుప దగు ప్రచారయంత్రముగూడ గడుంగడు గష్టసాధ్యమై మిగుల శ్రమను గలుగజేయుచున్నది. ఈవిషయమును గ్రహించిన కొందరు మిత్రులు, గ్రంథము ఆంగ్లముననున్నచో బ్రచురణమున కెక్కువ అవకాశములుండునని వాదించినను, మన సనాతన హైందవ సాంప్రదాయిక విజ్ఞానవిభూతిని బ్రకటించు గ్రంథరాజములు ఆంధ్రమున స్వల్పమగుటచే గ్రంథమాంధ్రమున మాత్రమే యుండవలెనని షట్ఖండములలో కృషిసేయ సంకల్పించితిని. కాన, నీగ్రంథప్రచురణ ప్రచారభారము నాయదిగాక, ఆంధ్రభాషాభిమానులును, భారతీయాధ్యాత్మికవిద్యా సంపన్నులైన ఆంధ్రమహాజనులదే యనియు, నందులకు వారు వెనుకంజ వేయరనియు విశ్వసించుచున్నాను.

## ద్వితీయ భాగము.

పైవిషయముల ననగాహన మొనరించికొనిన మచిలీపట్టణ వాస్తులైన నా మిత్రులు కొందరిచే బ్రోత్సహింపబడి ప్రస్తుతము వైశేషిక న్యాయదర్శనములతో గూడిన సర్వ సిద్ధాంత సౌరభ ద్వితీయభాగమును బ్రకటింప నుద్యుక్తుడనైతిని. ఈ ప్రచురణముతో వెంట వెంట మిగిలినభాగములన్నియు వెలువడు ననియు, నందులకై బందరు మిత్రులవలె నితరపట్టణ గ్రామ పౌరులేమి, సంఘములేమి, సంస్థలేమి, భారతీయవిజ్ఞానాభిమానులగు వ్యక్తులేమి ముందు కేతెంచి, త్వరలోనే సర్వ సిద్ధాంత సౌరభ గ్రంథమును సంపూర్ణముగ సర్వాంగసుందరముగ బ్రకటింపజేసి, ఆంధ్రమాతృ యంకతలమున నర్పించుకొను మహదవకాశము నాకు సంప్రాప్తింపజేయుదురుగాక అని నా గాఢ విశ్వాసము.

## వైశేషిక - న్యాయములు

దర్శనప్రాధాన్యత ననుసరించి గాని, కాలక్రమ ప్రకారముగాని, తాత్వికవిషయ ప్రాముఖ్యతను బట్టిగాని, కాక సాంప్రదాయికముగ న్యాయ వైశేషిక, సాంఖ్య యోగ, పూర్వోత్తరమీమాంసావిధముగ దర్శన శాస్త్రక్రమ మొందు గలదు. కాని ఆపద్ధతిలోగల లోపాలోపము లెట్లున్నను, ఆదివిద్వాంసుడైన కపిలాచార్యప్రతిపాదిత సాంఖ్యతత్త్వమును బ్రథమస్థానముననను, దాని దత్త్వతః ననుసరించి అపవర్గసిద్ధికై వలయు సాధనసామగ్రిని బోధించు పతంజలికృత యోగమును

ద్వితీయస్థానమునను అధిష్ఠింపజేసి ప్రథమభాగమును బ్రక టించియున్నారము. అటులే విషయ ప్రాధాన్యతనుబట్టి, తాత్త్వికముగ వైశేషికముపై న్యాయ మాధారపడియుండు టచే, వైశేషికదర్శనము ప్రథమతః వివరింపబడి, తత్తత్త్వనిరూ పణమునకై వలయు దర్క పద్ధతిబోధించు న్యాయము ద్వితీ యతః బ్రస్తావింపబడి యీద్వితీయభాగమున విపులీకరింపబడి యున్నవి. ఈవిధానమే సమంజసమని తోచెడిని. కాన నీభాగము కపోతవృత్తి జాతరూపధరుడై ఆత్మానుసంధానమున గుర్విమ్మరుచుండియు ననుగ్రహమున గణాదమునీంద్రునిచే బ్రసాదింపబడిన వైశేషికదర్శనముతోడను, ఆమహామహుని సహాధ్యాయుడై యసమాన శేముషీదురంధరత్వమున సంతత సర్వవిషయవిచార నిమగ్నచిత్తమున వర్తించు గౌతమ ఋషి సత్తమ ప్రోక్త న్యాయదర్శనముతోడను చెలువొందుచున్నది. సమానతంత్రము లనబరగు నీవైశేషికన్యాయదర్శన వివరణ ముతో గూడిన నీద్వితీయభాగమునుగూడ ఆంధ్రమహాశయులు ఆదరాభిమానమున స్వీకరించి, గ్రహించి, ఆనందించి ప్రోత్స హించెదరుగాక అని నమ్ముచున్నాను.

## దేశకాలవిచారణము

ప్రథమభాగమున, ముఖప్రబంధసందర్భములో 'భారత దేశము-భౌతికవిజ్ఞానము' అనెడి శీర్షికలో గొంతవరకు వివ రింపబడినట్లు భారతీయ ప్రాచీనమహర్షి కోటి భౌతికవిజ్ఞానమున నితరులకు దీసిపోక నంముగల యనేకప్రకృతిరహస్యముల గ్రహించి, యుపయోగించి, బోధించియుండిరని యనేకప్రమా

ణములతో వివరించియున్నాము. ఆవిషయమే సందర్భాను సారముగ గ్రంథముసగూడ ననేకస్థానముల వ్రాయబడి యున్నది. ఈభాగమునగూడ వైశేషికమునగల (Atomic theory పరమాణుసిద్ధాంతము, (Gravitation theory) గురుత్వసిద్ధాంతము మొదలగు వైజ్ఞానికవిషయములు ప్రస్తావింపబడియున్నవి. కాని ఆధునికప్రపంచమున దేశకాలతత్త్వముల గురించి Space Time Continum దేశకాలప్రవాహము Four Dimensional World నాలుగు కొలతలుగల ప్రపంచము అను భావముల విజ్ఞానవేత్తలు ప్రకటించియున్నారు. ఈభావములు మనప్రాచీన ఋషి పరంపరలలో బూర్వపక్ష సిద్ధాంతములలో నేదేనిరూపమున గలవో లేదో విజ్ఞులు పరిశీలించి చూచుట అవసరమగుట నిర్వివాదము. ఇంక గ్రంథసూక్ష్మముగ గొన్ని భావముల మాత్రము పోల్చి చూప యత్నించెదను. వివరములకు తజ్ఞులు యత్నించెదరుగాక. అందుచే ప్రథమతః ఆధునిక భావముల గుప్తముగ సమీక్షించి, పిమ్మట వైశేషికప్రతిపాదిత కాలదిగ్భావముల గ్రహించెదముగాక.

## ఐన్‌స్టీన్ వాదసమీక్ష

I cannot believe that God plays dice with the world భగవంతుడు ప్రపంచముతో జూదమాడుచున్నాడని నే విశ్వసింపనని డాక్టరు ఆల్బర్టు ఐన్‌స్టీన్ Dr. Albert Einsteen తెలుపుచు, విశ్వము నియమబద్ధమనియు, దాని రహస్యముల నన్వేషణాబుద్ధిగల మానవుడు గాంచగలడనియు వ్రాసెను. అందుకొరకు బరమాణుతత్త్వ పరిశీలనముగాక

బాహ్యాంతరాళమున గోచరించు నక్షత్రాదులను, వాని కతీత ముగ నున్న యగాధ దేశకాలముల గవేషణావిధానమే యుప యుక్తమనియు నాతని వాదము. వాదప్రతివాదనలతో దృప్తి గాంచక నాతడు వేధశాలలలో (Laboratories) గష్టించి కృషి సల్పి ప్రపంచమున గురుత్వ దేశకాలములగూర్చి గల సర్వభావ జాలముల దలక్రిందులు గావించి వినూత్న సిద్ధాంతముల బ్రక టించినట్లు ప్రశస్తి నార్జించెను. అతని భావములలో బర్యవసా నమునొందిన దేశకాలభావముల నొకించుక జూచెదముగాక!

గగనము నాబడు గ్రహాంతరాళ ప్రదేశమంతయు తేజోప్రసారమున కుపయుక్తమగు Ether ఈథర్ అను సుసూ క్ష్మపదార్థముతో సంపూర్ణమనియు, దాని యవకాశముననే తేజోకిరణము సెకనునకు 186284 మైళ్ల వేగమున బ్రసరించు ననియు గాని యీ సుసూక్ష్మపదార్థము విజ్ఞానార్జనోపకరణముల కందరాని అజ్ఞాతపదమనియు Newton న్యూటన్ మొదలగు వేత్తల సిద్ధాంతము. అందే అసంఖ్యాక నక్షత్రగోళములలో భూమియు దనచుట్టు గంటకు 1000 మైళ్లవంతున దిరుగుచు, సూర్యుని సెకనునకు 20 మైళ్ల చొప్పున చుట్టుచున్నది. భూ చంద్రులు ఒకరిచుట్టు నొకరు పరస్పరము తిరుగుచున్నారు. సూర్యుడు తనగ్రహసంతతితో సహా Milky-Way నక్షత్రవీధి గోచరించుచు Vega బ్రహ్మనక్షత్రముచుట్టు సెకనునకు 13 మైళ్ల వేగమున చుట్టుచుండ నాబ్రహ్మనక్షత్రకూటము నక్షత్రవీధిని సెకనునకు 200 మైళ్ల వేగమున పరిభ్రమించుచున్నది. మరల నీ నక్షత్రవీధి మరియొక అతిదూర నక్షత్రకూటముచుట్టు సెకనునకు 100మైళ్ల చొప్పున దిరుగుచున్నట్లు తెలియుచున్నది. వీనికన్నింటికి

మధ్యభాగమున ఏవిధమైన మానవ దృష్టికి గోచరింపని మూల కేంద్ర మొండుండియుండుననియు, న్యూటను మహాశయుడు భావించెను. కాన నీఅసంఖ్యాకగోళముల కాధారభూతమైన Space దేశము భౌతిక సద్వస్తువనియు, అది అతినిశ్చలమై అచంచలమై యున్నదనియు, నది ప్రకృతిలో నీశ్వర సర్వవ్యాపకత్వముల నిరూపించు పదార్థమనియు నతడు విశ్వసించెను.

కాని, తేజోప్రసరణమునకై గలదను ఈథరువాదము అసంగతమనియు, నెందులకన, నాపదార్థములో భ్రమణము గావించుచున్న భూమండలమునుండి అనుకూల వ్యతిరేక దిక్కులకు బ్రసరింపజేసిన కాంతికిరణవేగముల వ్యత్యాసము గోచరము. కాన ఈథరుపదార్థ మభావమని కొందరు శాస్త్రజ్ఞులు దానిద్రోసిపుచ్చిరి. ఈభావమును గ్రహించి, భూభ్రమణమువలన మాత్రమేగాక సూర్యాది యితరగ్రహభ్రమణవిశేషమువలన కూడ గాంతిగతి కెట్టి యంతరాయ మేర్పడదని ఐన్‌స్టీన్‌పండితుడు తీర్మానించెను. ఈసిద్ధాంత ఫలితముగ, సర్వత్రగల దేశమున దిక్కులుగాని మరే అవధులుగాని లేవనియు, దేశకాలములు ఇంద్రధనువున గల రంగులవలె గల్పితములనియు, సర్వవస్తువుల యునికి కవకాశమొసంగునదియే దేశమనియు, నీదేశమున గలుగు కార్యపరంపరను సూచించునదియే కాలమనియు నిర్ణయము లేర్పడెను. క్షణ, నిముస, గంట రూపమునగల కార్యక్రమసూచన తంత్రమే లేకున్న గాలమే యభావముగాన, వస్తువుల యునికిని సూచించు దేశమువలె, వస్తువు కార్యసంఘటనాక్రమమును మాత్రమే కాలమును సూచించును. పరాపరములు, ముందు వెనుకలరూపమున దేశకాలములు ప్రవర్తిం

చును. ఈపరాపరములు దేశసంబంధమున నొకవిధమైన గొలతలతోడను, కాలవిషయమున మరియొకవిధమైన గొలతలతోడను నిర్ణయింపబడుచున్నవి. అనగా ననిర్వచనీయమును, సర్వవ్యాప్తమును అయిన నీదేశకాలస్వరూపము కృత్రిమమైన కొలతలచే స్థూలము చేయబడినట్లాయెను. ఈకాలమానములైనను సర్వే సర్వత్ర యొకేరూపమున స్థిరములు గావు. మన ముపయోగించు మానవిధానము సూర్యగ్రహకూటమునకు, సంబంధించినవేగాని అన్యస్థానముల నిరుపయుక్తములు. ఎట్లన, గగనసీమ సూర్యుడు 15° గమనించినచో గంటయునయు, సూర్యుని భూమండలమొక పర్యాయము చుట్టివచ్చినచో సంవత్సరమును నందును. కాని Mercury బుధగ్రహమున చూచినచో ననిసూర్యునకు భూమికంటె దగ్గరయుండుటచే 88 దినములలో సూర్యుని చుట్టి సంవత్సర పరిమాణమును గ్రహించినది. దినచుట్టు తాను దిరుగుటకు 88 దినములకుటచే దాని దిన సంవత్సరమానమున వ్యత్యాసము లేదు. Venus శుక్రుడే విధముగ 225 దినములు పరిమాణముగల సంవత్సరమును, కొన్ని వారములు గల దినమును గలిగియున్నాడు. Mars అంగారకగ్రహము భూమికంటె సూర్యునకు దూరమై 687 మన దినముల సంవత్సరమును, 24 గంటల 37 నిముసముల దినమును గలిగియున్నాడు. Jupiter బృహస్పతికి 9 గంటల 55 నిముసములగల దినము గలిగినది. Saturn శనిలో దినము 10 గంటల 14 నిముసములు గలవు. ఇటులే పరిశీలించుచో నొక్కొక్క గ్రహమున నొక్కొక్క కాలమానము గోచరించుచున్నది. మనభూగోళముననే భారతదేశమున సూర్యోదయమగుచుండ, నమెరికాఖండమున సూర్యాస్తమాన కాలముగదా ! అందుచే దేశకాలపరి

స్థితుల ననుసరించి, వాని మానవిధానముగూడ మారుచున్నది. కాన నీకాలమానము కల్పితమగుచున్నది. ఈకల్పిత మాన విధానమును దోసిపుచ్చుచో, దేశకాలములు సువిశాలములు, నిర్వికారములు,నిరవధికములుగా నగుచున్నవనియు నదియే వాని సహజస్వరూపమనియు నర్థము. ఇచట బాహ్యాభ్యంతరములుగాని, ఊర్ధ్వాధములు గాని లేవు. మానవుడు తన జీవనసౌలభ్యము కొరకు వాని గల్పించి, వాని ననుభవించుచున్న కాలము వర్తమానమనియు, నతఃపూర్వము భూతకాలముగను, నతఃపరము భవిష్యత్తుగను, అఖండకాలమున ఖండత్వమును గల్పించి జీవించుచున్నాడు. అటులే అభిన్నదేశమున బాహ్యాభ్యంతరములనియు, దూరాంతికములనియు గల్పించుకొని మనుచున్నాడని ఐన్‌స్టీన్ సిద్ధాంత తాత్పర్యము.

పైవిషయముల నింకను గవేషించి, దేశకాలముల మధ్య వ్యత్యాసమును దగ్గించి Space - Time Continuum దేశకాల ప్రవాహమనియు, సర్వము దేశకాలబద్ధమనియు, సూక్ష్మపరిశీలనమున కీద్వయ మభిన్నమనియు, ననగా కాలమానములు యథార్థమునకు దేశమానములేయనియు, నవి పరస్పరాపేక్షికములనియు ఐన్‌స్టీన్ నిర్ణయించెను. అనగా బ్రకృతిలో నీరెండును ఒక్కటియేననియు, గోచరించు విభిన్నత్వము కల్పితమనియు నాతని భావము. ఆతని సిద్ధాంతముప్రకారము పాంచభౌతిక వస్తుజాత మంతయు దేశకాలబద్ధములై నాలుగు కాలమానముల గలిగియున్నవి. అందు మూడు దేశమున కన్వయములు, ఒకటి మాత్రము కాలగతము. అనగా పొడవు వెడల్పు ఎత్తులు మూడు దేశమునకును, ఎప్పుడు? అను ప్రశ్నమునకు సమాధానము కాలమునకును జెందును. అట్లే వ్యక్తి

సంబంధమున దైహికపరిమాణము దేశమునకు వయస్సు కాలము నకు నన్వయము. అట్లైనను దేశకాలము లభిన్నములని ఆతని వాదము. ఎట్లన? ఎంత దూరము? అను ప్రశ్నకు ఆధునిక యాన వ్యవహారమున రైలులో 6గంటల దూరమనియు, విమాన మున గంటదూరమనియు, వ్యవహారముగలదుగదా యని ఐన్‌స్టీన్ సమర్థనము. దేశమానమున అంగుళాదికము మూడు కొలతల కుచితముకాగా, నాలుగవదియగు కాలమానమున క్షణాదిక మన్వయమగుచున్నది. దేశమానముల సంకోచ వికాసములు మానవాధీనములు. అనగా కొలతల దగ్గించుట హెచ్చించుట మానవాధీనములు. కాని కాలమానమును త్వరితము జేయుటగాని, మందగింపజేయుటగాని, వెనుకకు ద్రిప్పుటగాని యతని కసాధ్యములు. సర్వచరాచరములు పరా ధీనములై భూతమునుండి వర్తమానమునకును, నటనుండి భవి ష్యత్తునకును సాగిపోవలయునేగాని మార్గాంతరము లేదు. అటుల దేశకాలముల గొంచెము వ్యత్యాసము గోచరమైనను, నవి కల్పితములే యను భావమున, రెంటి నేకమొనర్చి కాలము నాల్గవమానముగ జేర్చి సమన్వయపరచి, విజ్ఞానలోకమునకు వినూత్న భావధారను ఐన్‌స్టీన్ గల్పించెను. పైభావజాలములు కణాదీయ వైశేషికమున నెంతవరకు గాననగునో గ్రహింప యత్నించెదముగాక !

## వైశేషికవాద పరిశీలనము

'అపరస్మిన్నపరం యుగపత్ చిరం క్షిప్రమితి కాల లింగాని' (2.2.6) పరాపరములు, సమకాలికత్వము, మంద శీఘ్రములు కాల లక్షణములు. అనగా నొకడు ముందు

జనించుటచే బెద్దయనియు, దర్వాతవాడు చిన్నయనియు నటులనే యుభయులు సమవయస్కులనియు; మందగమన శీఘ్రగమన సమగమనములనియు వ్యవహారములు కాలలక్షణ జన్యములు. నిత్యములైన నాకాశాదికమున నీకాల మభావమై పరాపరజన్మలనియు, రాత్రింబవళ్ళు మొదలగు వ్యవహారమును బొందియున్న (2.2.9) ఉత్పాద్యద్రవ్యము లన్నింటికిని గాలము నిమిత్తకారణమై యున్నది. అది ఉపాదానమువలె గార్యాంతర్గతము గాకుండుటయు, నాకాశాదికమువలె సర్వవ్యాప్తమై యనంతమై (7.1.25) యుండుటచే, గార్య నాశమున నెట్టి వికారమునైన నొందని దగుటచే నిత్యమగుచున్నది (2.2.7). అందుచే నీకాలము నిరవయవియై యుపగ సమూర్తమై, కాన నిష్క్రియమై (5.2.21) యొప్పుచున్నది.

కాని పరాపరత్వవ్యవహారమున వయోన్యూనాధిక సందర్భము దృష్టిగోచరమైనట్లు దోచును. కాని యివి భావప్రధాన నిర్దేశ్యములు. సమకాలికములైన వానికే జ్యేష్ఠ కనిష్ఠ వ్యవహార ముపపన్నముగాని, కాలాంతరజన్ములకట్టి పోలిక యసందర్భము. ఈపెద్ద చిన్న సంబంధమున గాలమే నిమిత్తకారణమై రాజిల్లుచున్నది (7.2.21,22). కాని అది అభిన్నము. అటులే నిమిష గంట దిన పక్ష మాస ఋతు అయన సంవత్సరాది రూపమున విభిన్నమైనటుల గాలము కానబడును (2.2.8). కాని ఆ విభాగము కల్పిత సంఘటనము. స్ఫటికాదికమున రక్తపుష్పవర్ణ భ్రాంతి చందము,సూర్య చంద్ర భూరాది గ్రహసంచార విశేషమున నాకాలవిభాగము కల్పితము, భ్రాంతిమేగాని సత్యము గాదు. ఈదేవిధాన భూత భవిష్యద్వర్తమానరూప కాలత్రయ వ్యవహారముగూడ గల్పితము. ఈకాలత్రయవిభాగము ప్రాగ్వ

ధ్వంసాభావములపైనను, వర్తమానాస్తిత్వముమీద నాధారపడి యున్నది. అనగా వస్తువుయొక్క ప్రస్తుతాస్తిత్వము వర్తమానమనియు, నితఃపూర్వకాలము భూతకాలమనియు, నతఃపరము భవిష్యత్కాలమనియు వ్యవహారమైయున్నది (2.2.8). అట్టి విభాగము ఒక సంఘటనము నాశ్రయించి, మానవబుద్ధికల్పితమని వైశేషికతాత్పర్యము. ఇక దేశవివరణమును బరిశీలించెదముగాక!

కాలమునకువలె దిక్కు అనగా దేశమునకుగూడ పరత్వాపరత్వాదికము, దూరత్వాంతికత్వములు (7.2.21) లక్షణములుగా గోచరము. దేశము ననుసరించియే వస్తువుల స్థాననిర్దేశము గావింపగల్గుచు, బరస్పర దూరములను, ముందు వెనుకలను హ్రస్వ దీర్ఘత్వములును అధోర్ధ్వత్వములును మొదలగు ననేక వ్యవహారముల మన మాచరించుచున్నాము (2.2.10). ఈవ్యవహారములవలన దేశాస్తికత నిరూపితమై దేశము కాలమువలె నిమిత్తకారణముగ నున్నది. సూర్యోదయాస్తమాన సందర్భము ననుసరించి ప్రాచ్యాదిక దిక్కుల కల్పన మేర్పడుచున్నది (7. 1. 24, 2. 2. 14-16). అనగా సూర్యుడుదయించు ఆకాశభాగము తూర్పు అనియు, నస్తమించుదిశ పడమరయనియు, నటులే దక్షిణోత్తర (2. 2. 15) ఈశాన్యాది యుపదిక్కుల వ్యవహారము (2. 2. 16) ఏర్పడుచున్నది. కాని యీదిక్కులు కల్పితములు (2.2.13). నైజమునకు దేశము ఏకము (2. 2. 12). నిత్యము (2.2.11). అస్థూలము వ్యాప్తము (7. 1. 24). గాన నిష్క్రియము (5.2.21). అమూర్తముగ (5. 2. 22) నున్నదని వైశేషికసిద్ధాంత తాత్పర్యము.

## పర్యవసానము

Modern theorists are aware, that they stand on the shoulders of giants and that their particular perspective may appear as distorted to posterity as that of their predecessors seemed to them. తమ పూర్వుల భావములు తమకు దోచినట్లు, తమ ప్రత్యేక దృక్పథములుగూడ దర్వాత తరముల వారికి గృతిృమములుగా దోచవచ్చుననియు, దాము ప్రజ్ఞాధురీణుల భుజస్కంధములపై నాధారపడి నిలచియున్నా మనియు, నాధునిక విజ్ఞానవేత్తలు గ్రహించియున్నారని Lincon Barnett లింకన్ బార్నెట్ వచించునటుల బ్రస్తుత భౌతిక విజ్ఞానవేత్తలకు దమవాద పటుత్వము తెలియకపోలేదు. అందుచేతనే Our notions of space and time although much more subtle and flexible than they were before the appearance of Relativity Theory, are very likely not yet subtle enough. పరస్పరాపేక్షవాదము పొడసూపక పూర్వముకంటె దేశకాలములగూర్చి మన భావములు మిగుల సూక్ష్మతరములైయున్నను, పూర్తిగ సూక్ష్మాతిసూక్ష్మములు మాత్రముగావని The Limitations of Science భౌతిక విజ్ఞాన పరిమితులు అనుగ్రంథమున J. W. N. Sullivan సల్లివాన్ తెలిపి యున్నాడు. ఆదృష్టితో Newton, Eddington, Einstien న్యూటన్, ఎడ్డింగ్టన్, ఐన్‌స్టీన్ మొదలగు విజ్ఞానవేత్తల భావములతో గణాద గౌతమ సిద్ధాంతముల బోల్చి చూచినచో, నాధునికుల భావములలో గ్రొత్తందన మెద్దియు గానరాదు గదా లోపములుగూడ వ్యక్తము. దేశకాలముల ఏకత్వ సర్వవ్యాపకత్వములును, త్రికాలములు దిగాదికము కల్పితము లని కణాదునివలెనే ప్రతిపాదించియున్నారు. పరిమితములైన

గ్రహాదికము వాని సంచారమంతరించినను దేశకాలములు నిత్యములనియు, నిర్వికారములనియు నపరిమితములనియు వైశేషిక మువోలె వీరును దీర్మానించిరి. కాని ఐన్‌స్టీన్ చే బ్రతిపాదింప బడియున్న Space-Time Continuum దేశకాలప్రవాహైకత్వ మింకను పరిపూర్ణత నొందలేదు. అందనేక పూర్వపక్షములు, సంశయములు విజ్ఞలోకమున గలవనుటకు పూర్వోక్త సల్లివానుని వాక్యమే తార్కాణము. అందుచే విజ్ఞానలోకమున The Principle of Uncertainity అనిశ్చయత్వ సిద్ధాంతము (Lincon Barnett లింకన్ బార్నెట్) the Principle of Indeterminacy అనిర్ధారణత్వ సిద్ధాంతము(Sullivan సల్లివాన్) లను గ్రహించి, ఈశ్వరసృష్టిలో సర్వప్రకృతి రహస్యగ్రహణము అనిశ్చయ, అనిర్ధారణస్థితిలో మాత్రమే యుండి మానవబుద్ధి కతీతమైయున్నదనియు నొకవిధమైన నమ్మకము ప్రసరించి, It is doubtful whether in these matters, we have advanced much beyond the Greeks and the Romans, or whether we know more in these matters that was known to the great civilizations of India and China ఈవిషయములలో గ్రీకు రోమనులకంటె మన మధిగమించినట్లుగాని, అత్యున్నత నాగరిక దేశములైన భారత చీనాదేశములకంటె నీవిషయముల నెక్కువ గ్రహించినారమనుటగాని సందేహాస్పదమనియు విస్పష్టముగ సల్లివాన్ తన గ్రంథమున వచించియున్నాడు. కావున మన ప్రాచీన ఋషిప్రోక్త ప్రకృతిరహస్యములకు మించిన రహస్యముల నాధునికులు గ్రహింపలేదనుట సమంజసమని తోచెడిని.

అదియునుగాక My religion consists of a humble admiration of the illimitable superior Spirit who reveals Himself in the slight details we are able to perceieve with our frail and feeble minds. మన పరిమిత దుర్బల చిత్తముద్వార గ్రహించిన అతిపరిమిత వివరణములలో స్వయముగ నిరువుంతిగ తొంగిచూచిన యసంతోత్కృష్టస్వ కికి వినమ్ర శ్లాఘనముమాత్రమే నామత తత్త్వము. That deeply emotional conviction of the presence of a superior reasoning power, which is revealed in the incomprehensible universe, forms my idea of God. బుద్ధి కగోచరమైన విశ్వమున వెలువడిన యుత్కృష్ట ప్రజ్ఞాశక్తినిగూర్చి హృదయపూర్వక గాఢవిశ్వాసమే ఈశ్వరభావమును నాకు గలుగజేయున్నదని ఐన్‌స్టీన్ వచించినట్లు మన ఋషిసత్తములు కార్యరూప ప్రపంచమును వినియోగించుకొనుటయేగాక, అద్దాని సర్వకారణమైన అమానుష ప్రజ్ఞాశక్తిరూప సర్వజ్ఞతత్త్వమగు పరమేశ్వరునే విశ్వసించి, విశ్వజీవ నిర్మాణ మెట్లు జరిగెనను విషయమునుమాత్రమేగాక సృష్టిప్రయోజన సమస్యాధ్యానతత్పరులై ఈశ్వర సంకల్ప రహస్యముల గ్రహింప యత్నించి, సాధించి ఆ యద్వితీయాలౌకిక మహత్తత్త్వమును బొంది, ఆనందించియుండుటచే, అభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధికై (1.1.2) ప్రపంచపరిశీలన వినియోగముల గావించి యుండుట గమనార్హము. అదియే భారతీయవిజ్ఞాన తత్త్వవైభవము. అద్దాని గ్రహించి, మన సంస్కృతీమాహాత్మ్యమును తత్సంపదను సద్వినియోగ మొనర్చుకొందురుగాక అని విశ్వసించుచున్నాను.

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

# సర్వ సిద్ధాంత సౌరభము

## దర్శనఖండము

## వైశేషిక దర్శనము

# వైశేషిక దర్శనము

## ఉపోద్ఘాతము

### భారత విజ్ఞాన వైభవము

A civilized nation which has no metaphysics is like a temple decked with every kind of ornament, but possessing no holy of holies. తత్త్వశాస్త్రములేని నాగరిక దేశము సర్వాభరణాలంకృతియయ్యు బరమపావనమూర్తిలేని దేవాలయమువలె నుండును, అని పాశ్చాత్యతత్త్వవిదులలో నగ్రగణ్యుడై యొప్పారిన హెగెల్ మహాశయుడు వచించియున్నాడు. తదనుగుణముగ, In the study of the history of the human mind, in the study of ourselves of our true selves, India occupies a second place to no other country.1 మానవ మనోవిజ్ఞానచారిత్రములో, యథార్థమగు ఆత్మతత్త్వగ్రహణములో, భారతదేశము యే యితర దేశమునకు ద్వితీయస్థానము నలంకరింపదు, అనగా దీసిపోదని భారతీయ విజ్ఞాన రసాస్వాదనాసక్తుడగు Max Muller మాక్సుముల్లరు మహాశయుడు పల్కియున్నాడు. ఆ విధముగ భరతవర్షము

1. Prof. F. Max Muller: India, What it can teach us

ప్రపంచమున సర్వవిధముల నగ్రగణ్యమై The land of philosophers2 తత్త్వవిశారదుల కాకరమై, The Mother of Saints 2 సిద్ధ పురుషుల మాతృదేవియై India whose soil has been trodden by the feet of the greatest sages that ever lived 3 సర్వోత్తమ మహాత్ముల పాదస్పర్శనొందిన భారతదేశము, The religions were given to the world by India 4 ప్రపంచమునకు భారతదేశము మతముల బ్రసాదించెనని నానుతీర్థుడిత్యాదుల, సర్వప్రపంచమున కాధ్యాత్మిక గురుపీఠము నలంకరించి పాశ్చాత్యవిజ్ఞలోకమున కారాధ్యదేవతయై ప్రఖ్యాతిగాంచినది.

భారతీయ తత్త్వజ్ఞాన పాదపమగు వేదమాతయందు తత్త్వశాస్త్రమంతయు సమగ్రముగ వ్యక్తమైయున్నను, బృహద్గ్రంథమగు ఆ విజ్ఞానసర్వస్వమునుండి శేముషీదురంధరులును, బ్రహ్మజ్ఞానస్వరూపులును, విరాగులును అగు తత్త్వవిదులు 'కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి' (ముండక-1.1.3) దేనిని గ్రహించుకొనుటచేత నీ సర్వము దెలియబడునో అనియు, 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం భవతి' ఏ యొక విజ్ఞానజ్ఞానముచే సర్వవిజ్ఞానగ్రహణము గలుగునో యని శ్రుతి యన్నటుల, సంతత బ్రహ్మానందసాగరవిహారులై, సర్వాధిష్ఠాన జ్ఞానతత్పరులై యీ కల్పిత ప్రపంచరహస్యముల సంపూర్ణముగ నవగాహన మొనరించుకొని దాని నిగూఢ రహస్యముల గ్రహించి, అజ్ఞజనోద్ధరణకార్యదీక్షాదక్షులై

2 Prof F. Max Muller

3. Swami Vivekananda: The Complete Works. Vol 3 285

4. Swami Rama Tirtha: The Complete Works Vol 7 120

బ్రహ్మాజీవప్రకృతి రహస్యముల గోడీకరించి యనేక గ్రంథ రాజముల విరచించి ప్రసాదించిరి.

కణాదవిషయము

అందు Science sorts up, while philosophy sums up.5 విజ్ఞానశాస్త్రము విభజింప, తత్త్వశాస్త్రము సంకలనమొనర్చు నన్నరీతి Its standpoint is more scientific than speculative, more analytic than synthetic 5 వైశేషికముయొక్క దృక్పథము యూహాసంబంధముగాక నెక్కున శాస్త్రీయమును, సంకలనరూపముగాక విన్యాస్యావిధానముగ నుండె Mainly a system of physics and metaphysics 5 ముఖ్యముగా భౌతికా భౌతిక విజ్ఞానవిధానముగా బ్రశస్తిగనిన వైశేషికదర్శనమును బూర్వము రచింపబడిన మహాపురుష శ్రేణిలో నగ్రస్థానము నలంకరించియున్న (శ్రీ) కణాదమహర్షి సత్తముడు నిర్మించెననుట కెంతయు గర్వించుచున్నాను. ఈ మునివర్యుడు కౌలుత కాశ్యపుడని ప్రఖ్యాతుడై, ఉలూకమహర్షి పుత్రుడనబడుటచే జౌలుక్యుడనియు బిలువబడుచుండెను. 'సప్తవింశతిమే ప్రాప్తే పరివర్తే క్రమాగతే। జాతుకర్ణ్యో యదా వ్యాసో భవిష్యతి తపోధనః॥ తదాహం సంభవిష్యామి సోమశర్మా ద్విజోత్తమః। ప్రభాసతీర్థ మాసాద్య యోగాత్మా లోకవిశ్రుతః॥ తత్రాపి మమ తే పుత్రా భవిష్యంతి తపోధనాః। అక్షపాదః కణాదశ్చ ఉలూకో వత్స ఏవ చ' (1.237). జాతుకర్ణ్యవ్యాసుని కాలమున, ప్రభాసతీర్థమున శివావతారమని ప్రఖ్యాతుడై తపోధనుడని

5. Prof. S, Radhakrishnan: Indian Philosophy Vol 2 176

ప్రశస్తిగనిన సోమశర్మయను గార్గ్యగోత్రజుడుండెను. అతనికి అక్షపాద ఉలూక కణాదులను పుత్రులుండిరి, అను వాయుపురాణవాక్యము ననుసరించి, కణాదుడు న్యాయదర్శన కర్తయగు గౌతమునకు సహాధ్యాయియై ప్రభాసతీర్థమున సోమశర్మ అను ప్రశస్త గురుసన్నిధానమున సర్వవిద్యల నభ్యసించెనని తెలియుచున్నది ఈ విషయమునే తన సర్వ దర్శన సంగ్రహానువాదమున E. B. Cowell ఇ. బి. కౌవెల్ దృఢపరచియున్నాడు (1-15 పు). కణాదుడు ఉలూకమహర్షి సుతుడనుటచే వైశేషికులు ఔలూక్యులనబడినట్లు హేమచంద్రుని అభిధానచింతామణి తెలిపియున్నట్లును Cowell కౌవెల్ లిఖించెను. విద్యాభ్యాసానంతరమీ మహాత్ముడు అంతర్ముఖ వృత్తినున్న సంయమీంద్రుడై, కేవల మనఘాత్మస్థితిలో బాహ్యాభ్యంతరముల మరచి విహంగన్యాయమున అనికేతనుడై చరించుచు, భిక్షాస్వీకరణమునైన గావింపక కపోతవృత్తి నవలంబించియుండి, వీథులలో నేలబడియుండు ధాన్యపుగింజల నేరుకొని భుజించుచుండువా డగుటచే కణాదుడనియు, 'కణభుక్, కణభక్షక, కణభుజ,' [6] అనియు వ్యవహరింపబడెను. ఈ నామము కల్పిత మగుటచేతనే Kanada, the alleged author of the Vaiseshika Sutra, is a mere nick - name [7] వైశేషికసూత్రకర్తయగు కణాదనామము కేవలము మారుపేరు అని A. A. Macdonell మాక్డొనెల్ వ్రాసెను. కశ్యప వంశజుడగుటచే కాశ్యపుడనియు, ఉలూకుని పుత్రుడగుట ఔలూక్యుడనియు, కణభుక్ అగుట కణాదుడనియు నన్నియు

6. Prof. F. Max Muller· The Six Systems of Indian Philosophy 83

7. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature 483

గల్పిత నామములుగల నీ మహాత్ముని బ్రథమనామం బెద్దియో! ఏదెట్లున్నను అన్నిటికంటె గణాదశబ్దమే ఎక్కువగ వ్యవహారమున నున్నదనుచుండుటకు కేవలము కపోతవృత్తియే కారణము గాక అన్యముండఁబోదు. కణాదుడన గణముల భుజించువాడని యన్వయమగుటచే, నాతనిచే బ్రతిపాదింపబడిన వైశేషిక సిద్ధాంత దృక్పథమున విచారించిచూచినచో, సృష్టి కధిష్ఠానముగ ముఖ్యముగ నుపాదానార్థము, యితర సిద్ధాంతములకంటె మిగుల విశిష్టముగ బరమాణువుల బ్రతిపాదించి, వాని రహస్యముల విపరించి యుండుటచే, గణములన్నను, బరమాణువులన్నను బర్యాయపదంబులై యొప్పారుట గణసిద్ధాంతనిరూపకుడు గాన గణాదు డనబడెనని యనుట ఎంతయు సముచితము. అటులేగదా వ్యాస, అక్షపాద పదము లేర్పడియుండుట!

పైవిధాన నీ మహాపురుషుడు కపోతవృత్తినున్నను, తన తీవ్ర సాధనాజనిత సుజ్ఞానసంపదను, కాలమున మసుగుపరుపక శ్రోత్రియత్వ బ్రహ్మనిష్ఠత్వములుగల మహామహుఁడగుటచే, 'సమ్యక్ ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ' (1.1.1. వై.సూ.) అను శంకరమిశ్రుని వాక్యరీతి నుత్తమ ప్రశాంతచిత్తులును, శమాన్వితులును క్రమవేదాధ్యయనశీలురును అగు శిష్యవరుల కొరకు తపనోపాయార్థము 'పరమకారుణికః మునిః' అని వృత్తికారులు వచించినట్లు సంపూర్ణదయార్ద్రహృదయుడై, 'కణాదేన తు యత్ప్రోక్తం శాస్త్రం వైశేషికం మహత్' అను పద్మపురాణవాక్యోచితముగ నీయోగికులసార్వభౌముడు, మహాచ్ఛాస్త్రమైన దశాధ్యాయాత్మక మనబరగు నీవైశేషికదర్శనమును సూత్రరూపమున బోధించెను.

Dates are the weak points in the Literary History of India.8 భారతీయ సాహిత్యచారిత్రమున కాలనిర్ణయమే యొక లోపమున్నట్లుండుటయు, అందుచే All this is discouraging to the students accustomed to chronological accuracy 9 కాలనిర్ణయ కష్టతరము, కాలనిర్ణయమును కలవడిన విద్యార్థులకు నాశాభంగము కల్గించుచున్నను. కొంతవరకు గల కాలనిర్ణయ విచారము పండితాభిప్రాయములద్వారా తోచించి చూచుదముగాక.

వైశేషికసూత్ర రచనము - కాలము

యథార్థముగ The basic Sutras, which form the starting point of a system, in reality, represent the end of a long and exclusive literary development that has been lost 10 అంతకుమున్న సుదీర్ఘమును ప్రత్యేకమును అయి కాలమున మరుగుపడిపోయిన సిద్ధాంతపరిణామ సాహిత్యము యొక్క పర్యవసానమును మాత్రమే సిద్ధాంతమున కాధారమగు మూలసూత్రములు సూచించును అని A. A. Macdonell మాక్డొనెల్ అన్నట్లు, దర్శనముల సిద్ధాంతము సూత్రరచనము నను అతిప్రాచీనమై యుండవలయును. ఎందుకన They are not the work of one thinker or of one age but a succession of thinkers spread over a number of generations 11 ఒకవ్యక్తికిని, ఒక కాలమునకును మాత్రము చెందక, బహుళముగ ననేక తరములకు సంబంధించి యొక తత్త్వవేత్తల

---

8. Prof.F Max Muller: The Six Systems of Indian Philosophy 364
9. Prof.F. Max Muller: The Six Systems of Indian Philosophy 120
10 Dr. A A Macdonell: India's Past

పరంపరవరకు సిద్ధాంతపరిణామము ప్రసరించియుండవలయునని రాధాకృష్ణపండితుని అభిప్రాయము కాబట్టి Even if we could determine the date of the Sutras, this would prove nothing regarding the time when the philosophical systems and schools came into being. 12 సూత్రకాలనిర్ణయము సాధింపగలిగియున్నను, సిద్ధాంతము లెప్పు డుద్భవించెనో తెలియుట దుర్లభముగు మున్నది. కాన సిద్ధాంత కాలనిర్ణయము సంబంధపడమగుటచే సూత్రకాలనిర్ణయము చేసి తృప్తిజెంద యత్నింతము.

అయినను, గవేషణపరులకు సూత్రకాలనిర్ణయముగూడ చాల ప్రయాసకారము నగుచున్నది. The Dates of none of these fundamental texts can be traced with certainity, nor is anything known about the authors, who are nothing but names.12 మూలగ్రంథముల కాలముల గనుగొను టయు కష్టసాధ్యమే. మరియు కేవలము నామమాత్రావశిష్టులగు కర్తలగురించి యెరుంగుటయు దుర్లభమే యగును. కాని అతులని పరంపరనుద్ధరించుట యుచితము గాకుండుటచే పండితులు కొంత శ్రమించి కొంత కాలనిర్ణయము గావించిరి. కేవలము నిరాధారముగ నిర్ణయించుటయు జరిగియుండుటచే నందు అనేక దోషములు పొడగట్టును. వైశేషిక జైనసిద్ధాంతములకు మిగుల సన్నిహితత్వము గానుపించుచుండుటచే The former may have arisen before the Jain and the Buddhist canon, about the 2nd century. 12 వైశేషికము

11. Prof. S. Radhakrishnan · Indian Philosophy Vol 2 22
12 Dr. A. A. Macdonell · India's Past

జైన బౌద్ధములకు ముందు క్రీ. పూ. 2వ శతాబ్దమున బ్రబలి యుండవచ్చునని A. A. Macdonell మాక్డొనెల్ అభిప్రాయము. కాని వైశేషికసూత్రములుమాత్రము Is not certainly not so old in its extant shape.[12] ప్రస్తుతరూపమున నంత ప్రాచీనము గాదని అతని సిద్ధాంతము. అంతియగాక The rise of the Vaiseshika has been ascribed to the 2nd century B.C. on the score that it was attacked by Aswaghosha (81 A.D.)[13] అని అశ్వఘోషునిచే ఖండింపబడియుండుటచే వైశేషికప్రాచీన్యము క్రీ. పూ. 2వ శతాబ్దికి జెందినట్లు తీర్మానమును A. A. Macdonell మాక్డొనెల్ చేసియున్నాడు. These are not much later than the age of Buddha[14]. ఇవి బుద్ధ కాలమునకు తర్వాత నెక్కువ దూరముకాదని శ్రీనివాసఅయ్యంగారు వ్రాసెను. అతని భావముగూడ మాక్డొనెల్ భావము ననుసరించి యుండవచ్చును. Jacobe జకోబి ఉద్దేశ్యముప్రకారము న్యాయ వేదాంతములు క్రీ. శ. 200 నుండి 400 సంవత్సరముల మధ్యను, జైమినీయకాణాదములు కొంచెము వీనికంటె ప్రాచీనకాలమున నిర్మింపబడినట్లు గలదు[15]. తర్కసంగ్రహము ననువదించిన Bodas బోడసు తన యుపోద్ఘాతములో బ్రస్తుత వైశేషికసూత్రముల న్యాయభాష్యకర్తయగు వాత్స్యాయనుని కాలముతో జూచుచు, Cannot be anterior to 400 B. C. and posterior to 500 A.D.[16] క్రీ. పూ. 400 సంవత్సరములకు

---

13. Dr. A. A Macdonell: A History of Sanskrit Literature 488
14. V. T. Srinivasa Iyangar · Out lines of Hindu Philosophy. 194
15. Dr. A. A. Macdonell· A History of Sanskrit Literature. 472
16. Dr. Ganganath Jha: Gautama's Nyaya Sutras

బూర్వముగాని క్రీ. శ. 500 సంవత్సరములకు దర్వాతగాని యుండజాలదని తీర్మానించెను.

Still more absurd is the attempt to make the school to be pre-Buddhistic 17. వైశేషికము బౌద్ధమునకు బూర్వమని నిర్ణయింప జూచుట అసంబద్ధమని Macdonell మాక్డొనెల్ ఘోషించినను, It is urged that the Vaiseshika precededBuddhism and Jainism 18. బౌద్ధ జైనములకంటె వైశేషికము పూర్వమనియు అందుచేతనే The Buddhist theory of Nirvana is traced to the అసత్కార్యవాద of the Vaiseshika 18. బౌద్ధమునకు జెందిన నిర్వాణసిద్ధాంతము వైశేషిక అసత్కార్యవాదమునకు జెందుననియు, నంతియగాక The అస్తికాయ of the Jains as well as their atomic theory are traced to the Vaiseshika 18. జైనుల అస్తికాయ, అణుసిద్ధాంతములు వైశేషికజన్యములనియు కొందరి వాదముగ రాధాకృష్ణుడు సూచించియున్నాడు. కావున The atomic theory, the classification of substances, and the acceptance of the two means of knowledge, strongly suggest that the Vaiseshika arose about the time of Buddha and Mahavira (6th B. C ) 18 పరమాణు సిద్ధాంతము, ద్రవ్యవిభాగము, ప్రమాణద్వయగ్రహణము, మొదలగు సిద్ధాంతములు, క్రీ. పూ. ఆరవ శతాబ్దమునకు జెందిన బుద్ధ మహావీరులకాలములో వైశేషికము రూపొందియున్నట్లు ప్రబలకారణమని రాధాకృష్ణ వచనము. కాని

17. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature 186

18. Prof. S. Radhkrishnan: Indian Philosophy Vol 2 177

అశ్వఘోషుడు మాత్రము తన సూత్రాలంకార గ్రంథమున వైశేషికము బుద్ధునికి బాహ్యముగనే నిశ్చయించినట్లు విదితము.

కాని వైశేషికము to be derived from the Purva Mimamsa19. పూర్వమీమాంసాజన్యమనియనుటయసంభవము. అంతియగాక One of the late Jain works ఆవశ్యక attributes the authorship of the Vaiseshika system to a Jain Rahagutta (A.D. 18) 20. ఆవశ్యక యను యిటీవలి జైన గ్రంథము, క్రీ. శ. 18వ సంవత్సరమునకు జెందిన రాహగుప్త యను జైనగురువు వైశేషికమును రచించినట్లును, అందుచే నది జైనముయొక్క శాఖయనియు వచించెను. కాని The claim that the Vaiseshika is an offshoot of Jainism is hardly warranted 20. వైశేషికము జైనముయొక్క శాఖయనుట అసందర్భముగా రాధాకృష్ణపండితుడు త్రోసిపుచ్చెను.

## కణాదకాలము

వీరి కాలనిర్ణయప్రకార మిట్లుండ వాయుపురాణాంతర్గత 'సప్తవింశతి మే ప్రాప్తే పరివర్తే క్రమాగతే। జాతుకర్ణ్యో యదా వ్యాసో భవిష్యతి తపోధనః॥' (1.23) అను శ్లోకము జాతుకర్ణ్య వ్యాసకాలమున ప్రభాసతీర్థమున సోమశర్మ అను ద్విజోత్తము జరణసన్నిధి కణాదగౌతములు విద్య నభ్యసించియున్నట్లు తెలుపుచున్నది. అందుచే జాతుకర్ణ్యవ్యాస కాలనిర్ణయముతో కణాద కాలనిర్ణయముగూడ గావింపనగును. జాతుకర్ణ్యని ప్రస్తావన శతపథబ్రాహ్మణము చేసియున్నది. 'జాతుకర్ణ్యా

---

19. Dr. A. A. Macdonell A History of Sanskrit Literature 486
20. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 178

జాతుకర్ణ్యో భారద్వాజాత్ భారద్వాజో, భారద్వాజాచ్చాసు రాయణాచ్చ గౌతమాచ్చ గౌతమో --- పారాశర్యాత్ పారాశర్యో జాతుకర్ణ్యాత్ జాతుకర్ణ్యో' (మాధ్యందినశాఖ. 14. 5.) ఈవాక్యము ఆసురాయణునితో గౌతముడు పఠించు చుండుటచే, గౌతముడు జాతుకర్ణ్యవ్యాసకాలమునకు జెందిన వాడనిగాని లేక యతనిశిష్యుడగు భారద్వాజుని కాలమువాడనిగాని తెలుపుచున్నది. మరల శతపథబ్రాహ్మణమధుకాండ, యాజ్ఞ వల్క్యకాండములందు ఆసురాయణ యాస్కులకు జాతుకర్ణ్యుడు శిష్యుడుగా చెప్పబడినాడు. వారియువురును క్రీ. పూ. 550 వారని దెల్పుచు గౌతముడు గూడ నాకాలమువాడని న్యాయ సూత్ర వ్యాఖ్యాతయగు విద్యాభూషణుడు తలంచెను 21. జాతుకర్ణ్యుని ప్రశంస భారతమునగూడ గలదు వ్యాస సన్ని ధానమున పైలమహర్షి గైకొనిన ఋగ్వేదమును వాత్స్య, మౌద్గల, శరీయ, గోముఖ, శశిరులనుండి యుపదేశింపబడినట్లు తెలియుచున్నది. (11.30) జాతుకర్ణ్యుని గురువగు ఆసురాయణ యాస్కులు, సాంఖ్యకర్తయగు శ్రీకపిలదేవుని శిష్యుడైన ఆసురియొక్క శిష్యులనియు, వారికి జాతుకర్ణ్యుడు శిష్యుడనియు శతపథబ్రాహ్మణమున మరియొక వాక్యము గలదు. అందుచే గపిలాచార్యుని తర్వాత మూడుతరములవాడు జాతుకర్ణ్యుడగు టచే నతని సమకాలికుడగు సోమశర్మశిష్యులగు గౌతమ కణాదులదేకాలమువా రనుటకు సందియములేదు. కాన గణాదుడతి ప్రాచీనమహర్షియని స్పష్టము. అందుచే వేద గతనామములు దర్శనకర్తలతో సంయుక్తముగ నుండుటచే

---

21. M. M, Satish Chandra Vidyabhushana.: The Sutras of Gotama

ఋగ్వేదాదులుగూడ క్రీ. పూ. 550 సంవత్సరములవరకు నీడ్చు టయో లేక దర్శనకాలములనే వేదకాలమునకు గొంపోవుటయో లేక నింకను గాలనిర్ణయము స్థిరము సేయుక బరిశీలనము గావించుటయో యుచితము. కపిలకాలానుగుణముగ కణాద కాలనిర్ణయముగావించినచో సత్యమను స్వాయంభువమనువు కాలమువాడగుటచే గపిలాచార్యునివలె ఇప్పటికి 164,91,65,056 సంవత్సరములకు బూర్వుడని దీర్మానింపనగును.

మరల గౌతమ కణాదులు సమకాలికులై యున్నట్లు విదితము. కాని వారి సూత్రరచనమున సూత్రము కాలవ్యవధి యున్నట్లు బండితాభిప్రాయము. రెండింటిలో న్యాయదర్శనము కంటె వైశేషికసూత్రగ్రంథము పూర్వకాలికమని రాధాకృష్ణ పండితుడు22, విద్యాభూషణుడు23, గార్బ 24, మాక్డొనెల్ 25, కీత్ 26, మొదలగు పండితవర్గము అభిప్రాయముల వెలిబుచ్చిరి. అదియు నింకను గవేషణీయాంశమే యగును.

## కణాదుడు నాస్తికుడా ?

కొందరు తత్త్వవేత్తలచే గణాదుడును, యితని వైశేషికదర్శనమును నాస్తికముగ వ్యవహరింపబడెను. కాని పూర్వోక్తవచనము గణాదుడు అవధూతవలె 'త్యాగేనైకే అమృతత్వమానశుః' (కైవల్యోపనిషత్తు) అన్నట్లు సంప్రాప్త త్యాగధనుడై, 'ఋషిః అతీంద్రియదర్శనే ఋషిః' అను వ్యుత్పత్తి

22. Prof. S. Radhakrishnan· Indian Philosophy Vol 2 179
23. Dr. Satish Chandra Vidyabhushana· History of Indian Logic.
24. Garbe : The Philosophy of Ancient India
25. Dr. A. A. Macdonell· A History of Sanskrit Literature 385
26. Dr. A. B. Keith

ననుసరించి అపరోక్షసాక్షాత్కారవిభూతి నార్జించి, మహర్షి చంద్రుడై, తద్రహస్యకోటిని 'శ్రోత్రియతే హీశ్వర నియోగ ప్రసాదావధిగమ్య కణాదో మహర్షిః శాస్త్రం ప్రణీతివానితి' (ఉపస్కార 1.1.4) ఈశ్వర కృపాపాత్రుడై, తదాదేశాను సారముగ కణాదమహర్షి యీశాస్త్రమును విరచించినట్లు సాంప్రదాయికముగు అనుశ్రుతి గోచరించుచున్నదని ఉపస్కార కర్తయగు శంకరానందులు వచించుచున్నారు

ఇట్లు సర్వసమర్థుడై అధికారంబై శ్రీకణాదమహర్షి పరేచ్ఛకు పామరలోకము ననుగ్రహింప నీతి తత్త్వసిద్ధాంతమును సర్జించి, భారతావనిలో నీతి తత్త్వవిచారణమునకు నాందినిబాడి తదనుగుణముగ విజృంభించిన అనంతవిజ్ఞానమునకు గపిలుని తర్వాత తత్తుల్యముగు దర్శనశాస్త్ర పితామహుడుగ ప్రసిద్ధిజెందె నని యనుట కెట్టి సందేహమును లేదు. అట్టి నిర్మల త్యాగ పురుషులనుండియే వైజ్ఞానికఘనులు లుద్భవించి విశ్వతోముఖ వ్యాప్తి గడించి సర్వోపయుక్తమై విరాజిల్లునుగదా!

ప్రశస్తపాదాది రచయితలు

ఇంత ప్రాచీన శాస్త్రమైయున్నను, మరదృష్టవశమున **No old commentary of the Vaiseshika Sutra has been preserved 27.** వైశేషిక సూత్రములకు ప్రాచీనమైన భాష్య మొక్కటియైనను జాగ్రత్తపరుపబడలేదు. కాని 'ఇతి రావణ ప్రణీతే భాష్యే దృశ్యత ఇతి' (2.2.11) అను బ్రహ్మసూత్ర శంకరభాష్యమునకు రత్నప్రభాఖ్య టీకాకారుడు రచించి యుండుటచే బహుశ్యము వైశేషికసూత్రములకు రావణభాష్య

27. Dr. A A Macdonell: India's Past

మొంకుండెనని స్పష్టము. అటులే యీదర్శనమునకు భారద్వాజవృత్తియుగూడ నున్నట్లుల వాడుక. కాని Ravana Bhashya and Bharadwaja Vritthi which are said to be commentaries on the Vaiseshika are not available 28. వైశేషికమునకు భాష్యములనబడు రావణభాష్యము భారద్వాజ వృత్తియు ప్రస్తుతము లభించవని రాధాకృష్ణుడు వచించెను. ఎట్టి గ్రంథాధారమున్నను లేక నీభాష్యకర్తయగు రావణనామకు డెవరో, భారద్వాజు డెవరో, నిర్ణయించుట బహుకష్టము. తర్వాత మనకు లభించు భాష్యములలో ప్రాచీనమగు ప్రశస్త పాదాచార్య విరచితమైన పదార్థధర్మసంగ్రహము ముఖ్యము. అదియయినను The Bhashya of Prasastapada called పదార్థధర్మసంగ్రహ is really an independent manual 29. పదార్థధర్మసంగ్రహ మనబడు ప్రశస్తపాద భాష్యము యథార్థము నకు స్వతంత్రగ్రంథము. అయినను in which the subject matter is systematically arranged 29. అందు విషయము సక్రమముగా నేర్పరుపబడినది అనియును, లేక a complete new exposition of the same subject matter with additions of importance|30. ఆవిషయముపై గొన్ని ముఖ్యవిషయముల గలిపిన సంపూర్ణ వినూత్నగ్రంథమనియు, A. A. Macdonell మాక్డొనెల్ వ్రాసెను. This Bhashya is not a commentary, but a systematic re-statement and amplification of the Vaiseshika system 31. ఈ భాష్యము వ్యాఖ్య కాక వైశేషిక

28. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 180
29. Dr. A A Macdonell: India's Past.
30. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature 485
31. V. T. Srinivasa Iyangar ; Out lines of Hindu Philosophy 195

దర్శనముయొక్క సక్రమ సంక్షిప్తమును పునఃప్రస్తవన. శ్రీ శ్రీనివాసఅయ్యంగారు, Prasastapada's పదార్థధర్మసంగ్రహ is not much a commentary on the Sutra as an important independent work on the subject32. ప్రశస్తపాదుని పదార్థధర్మసంగ్రహము సూత్రగ్రంథముపై భాష్యముకాక, ఆవిషయముపై ముఖ్యమైన స్వతంత్రగ్రంథముగా రాధాకృష్ణునను, అభిప్రాయముల వెలిబుచ్చిరి. ప్రశస్తపాదుడు was much influenced by the Nyaya Philosophy and was later than Vatsayana 32. న్యాయసిద్ధాంతముచేతను ముఖ్యముగ న్యాయభాష్యకర్తయగు వాత్స్యాయనుని భావముల గైకొనియుండుటచే క్రీ. త. 4వ శతాబ్దమునకు జెందినవాడై యుండునని రాధాకృష్ణుని భావము. కాని It is the Sutra of Kanada and the Padardha Dharma Sangraha of Prasastapada don't show so much the influence of the Nyaya System, while the Sutra of Gautama and the Bhashya of Vatsayana are considerably influenced by the Vaiseshika Views 32. న్యాయసిద్ధాంతప్రభావము కణాదసూత్రముల ప్రశస్తపాదుని పదార్థధర్మసంగ్రహమున లేదుకాని, వైశేషిక భావముల గౌతమ సూత్రములు, వాత్స్యాయనభాష్యము గైకొనెనని యనుటకు నాధారములుగలవు. అందుచే యిదమిత్థమని ప్రశస్తపాదుని నిర్ణయించుట అసంగతము. అట్లే The date of the author depends on his relation to Dignaga who seems to have influenced his logical views, so that he may be assigned

32. Prof S. Radhakrishnan: Indian Philosophy Vol 2 180

to the 5th century A. D. 33. తన తర్క-భాషముల దిఙ్నాగ నుండి యితడు గైకొనియుండుటచే నితని కాలనిర్ణయము యితని కిని దిఙ్నాగసంబంధముపై నాధారపడియుండును. అందుచే క్రీ. శ. 5వ శతాబ్దివాడై యుండునని యు A. A. Macdonell మాక్డొనెల్ వ్రాసెను. ప్రశస్తపాదుని భాషములు దిఙ్నాగయే గైకొనియుండవచ్చునని రూపించినచో నైభావ మసంగతమగును. ప్రశస్తపాదుని క్రీ. శ. 700 వరకుగూడ మాక్డొనెల్ లాగి యుండెను34. Who lived much later than 1st century A.D.35. క్రీ. శ. ఒకటవ శతాబ్దమునకు చాలతర్వాత యని మాత్రము శ్రీనివాసఅయ్యంగారు వ్రాసియున్నారు. ఎట్లైనను ప్రశస్తపాదుని కాలనిర్ణయమింకను అభేద్యముగనే నున్నదననగును.

## ఉపస్కార

ప్రశస్తపాదుని భాష్యము వైశేషిక సూత్ర భాష్యముగ పండితలోకము స్వీకరింపకపోయినను The first commentary in the strict sense on the Vaiseshika Sutras was the Upaskara of Sankara Misra 36. శంకరమిశ్ర విరచితమైన ఉపస్కార వైశేషిక సూత్రములకు సరియైన ప్రథమభాష్యమని A. A. Macdonell మాక్డొనెల్ సంతోషించెను. కాని It seems to have little value for it was written as late as about 1600 A. D; the tradition of the original interpretation had long died out 36. సాంప్రదాయిక నిర్వచన

33. Dr. A. A. Macdonell A History of Sanskrit Literature 485
34 Dr. A. A. Macdonell: India's Past.
35. V. T. Srinivasa Iyangar · Out lines of Hindu Philosophy 194
36 Dr. A A. Macdonell : India's Past.

మంతరించిపోయిన తర్వాత, చాలతర్వాత సుమారు క్రీ. త. 1600 వత్సరమున నిది వ్రాయబడి యుండుటచే దానికెక్కువ ప్రాధాన్యత లేకపోయెను.

## ముక్తావళి

పూర్వోక్త ప్రశస్తపాదభాష్యమునకు న్యాయాచార్యుడైన ఉదయనాచార్యుడు 'కిరణావళి' యను వృత్తిని, శ్రీధరాచార్యులు 'న్యాయకందలి' యను టీకను విరచించిరి. క్రీ. త. 1400 వత్సర ప్రాంతముల శివాదిత్యునిచే విరచింపబడిన 'సప్తపదార్థి'కి విశ్వనాథపంచాననభట్టాచార్యుడు 'భాషాపరిచ్ఛేద' అను కారికాగ్రంథమును దానికి ప్రశస్తమగు 'న్యాయసిద్ధాంత ముక్తావళీ' గ్రంథమును కూర్చి వైశేషికమును సుప్రసిద్ధ మొనర్చియుండెను.



# వైశేషిక సిద్ధాంత ప్రాశస్త్యము

## న్యాయ వైశేషికములు

'కణాదేన తు యత్ప్రోక్తం శాస్త్రం వైశేషికం మహత్'

కణాదమహర్షిచే నిర్మింపబడియున్న వైశేషికము మహత్ శాస్త్రము అని పద్మాది పురాణములచే బ్రస్తుతిగన్న యీ వైశేషికదర్శన ప్రాధాన్యతయు బ్రాచీనతయు బూర్వ మొకించుక వివరించియున్నాము. కణాదమహర్షికాలము ననుసరించి దర్శన నిర్మాణముగూడ నాకాలముననే జరిగియుండును. ఇతర దర్శనములతో బోల్చిచూచినచో ఎట్లున్నను, కాణాదము న్యాయదర్శనముకంటె బ్రాచీనమని పండితాభిప్రాయముగ నున్నట్లు చూచియున్నాము. ఇట్లు ప్రాచీనతయేగాక 'కాణాదం పాణినీయం చ సర్వశాస్త్రోపకారకం' అనురీతి శబ్దార్థనిర్ణయమునకు బాణినీయ వ్యాకరణశాస్త్ర మెంత యుపయుక్తమో, అటులే పదార్థస్వరూప నిశ్చయమునకు గాణాద మంత ప్రయోజనకరమను లోకోక్తివలన దీనికి బండితలోకమున నెంత ప్రముఖస్థానముగలదో విదిత మగుచున్నది. శబ్దార్థజ్ఞానవిహీను డెట్లు భాషావేత్తకాజాలడో, అట్లే పదార్థజ్ఞానములేక తత్త్వవేత్త కాకుండుటయేగాక లౌకికమునగూడ నిరుపయోగి కావలసి వచ్చును. ఎందుచేతనన గాపిలము ప్రధానతత్త్వమును, యోగము సాధనావిభాగమును, న్యాయము వాదవిధానమును, జైమిని కర్మపద్ధతిని, వేదాంతసూత్రములు బ్రహ్మమీమాంసను జేసి తృప్తిజెందుచుండగ, వైశేషికదర్శనము has its main ob-

jective the analysis of experience 37. నిత్యానుభవవిచారణమునే తన ముఖ్యాదర్శముగా నుంచుకొనెను. తద్విచారణమునుగూడ ఉద్దేశ్య, లక్షణ, పరీక్షారూప త్రివిధ సోపానముల గావించుచు, Its stand-point is more scientific than speculative, more analytic than synthetic 38. వైశేషికము యొక్క దృక్పథము యూహాబద్ధముకంటె శాస్త్రీయమనియు, సంకలనముకంటె విమర్శారూపమనియు నందుచే గొప్ప వైజ్ఞానికశాస్త్రమనియు బేరుగాంచియున్నది. శ్రీ కౌటిల్యుని వచనసరణి Philosophy is the lamp of all the sciences, the means of performing all the works and the support of the deties. సర్వధర్మములకాధారమై, సర్వకర్మానుష్ఠానమునకాలవాలమై యొప్పు దత్త్వశాస్త్రము సర్వవిజ్ఞానములకు వెలుగువంటిదనురీతి While the other systems of Indian thought are mainly speculative, in the sense that they deal with the universe as a whole, the Nyaya and the Vaiseshika represent the analytic type of philosophy and uphold the common sense and science 39. విశ్వమును మొత్తముగ దృష్టియందిడుకొని సర్వభారతీయ సిద్ధాంతములు ముఖ్యముగ యుక్తిబద్ధమగుచుండ న్యాయవైశేషికములు మాత్రము, విజ్ఞానశాస్త్రమును, సామాన్యజ్ఞానమును సమర్థించుచు, బరిశీలనాయుక్త తత్త్వశాస్త్రమును దెలుపుచున్నవను రాధాకృష్ణ వచనముల బ్రకారము వైశేషికము అత్యుత్తమ

---

37. Prof. S Radhakrishnan: Indian Philosophy Vol 2 30
38. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 176
39. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 29

తత్త్వశాస్త్రరాజమనియుగూడ వ్యక్తమగుచున్నది. మరల న్యాయవైశేషికములు accept in some measure the view of the other 40. కొంతవరకు ఒకదానిభావములనొకటి స్వీకరించి యున్నను If the Nyaya essentially gives us a logic, the Vaiseshika represents a materialistic view which finds in atoms the basis of the material world 40. న్యాయము సంపూర్తిగ దర్కముగాసంగ, ప్రాకృతిక ప్రపంచమున కాధార ముగబరమాణువులుగలవను భౌతికభావమును వైశేషికము తెలు పుచున్నది. మరల The Nyaya and the Vaiseshika take up respectively the world within and the world without 41. న్యాయవైశేషికములు, క్రమముగ అంతర బాహ్యప్రపంచముల గైకొని, న్యాయము వాదజ్ఞానముద్వారా సర్వభ్రాంతివాద మును ఖండించుచుండ, The Vaiseshika has for its main objective the analysis of experience 41. అనుభవజ్ఞానమీమాంసను వైశేషికము ద్రుక్పథముననుంచి, It formulates general conception which apply to things known, whether by the senses or by inferencc or by authority 41. ప్రత్యక్షానుమానాగమములద్వారా తెలియబడు విషయముల కన్వయింపనగు సామాన్య సూత్రముల నది నిర్మించెను. అంగుచే రాధాకృష్ణపండితు లన్నట్లు, The Vaiseshika warns us that all fruitful philosophy must take into account the constitution of physical Nature 42. ఫలప్రదమగు సర్వతత్త్వ శాస్త్రముగూడ భౌతికప్రపంచ నిర్మాణము నాలోచింపవలెనని

40. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature 483
41. Prof. S. Radhkrishnan: Indian Philosophy Vol 2 30
42. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2

వైశేషికము హెచ్చరించుచు, **The Vaiseshika is interested in the empirical variety and not in the ltvimate truth 43.** వైశేషికము పరమార్థమగు సత్యమునందుగాక నానాత్వమగు భౌతికమునందే శ్రద్ధ వహించియుండెను. కాన **The Vaiseshika develops the atomic constitution of things 44.** వైశేషికము వస్తువులయొక్క పరమాణు వస్తుత్వవిచారణము నభివృద్ధి గావించినది. ఈ విధముగ పదార్థ పరిశోధనారహస్యముల జాటు వైశేషికమునకు **Nyaya points out that no stable philosophy can be built except on the foundations of logic 44.** తర్కము నాబడు పునాదిపైగాక సుస్థిర తత్త్వశాస్త్రము అన్యముపై నిర్మింపబడజాలదని న్యాయదర్శనము తర్కమును బూరింపసి రెండుదర్శనములు పరస్పరాపేక్షికములై సమాన తంత్రము లనబడినవి 44. ఇంత సన్నిహితసంబంధముతో గౌతమ కాణాదములు వ్యవహరించుటచే గాలక్రమమున రెండు నేకమై న్యాయవైశేషికమనియు, లేక కేవలము న్యాయమనియు రూపొందినవి. అప్పుడు, గౌతమ కణాదులు సోదరులవలె సోమశర్మ పాదములకడ విద్య నభ్యసించియుండుట, వారి దర్శనములుగూడ అన్యోన్యతను మెలగి ఏకమై యొప్పారుటయం దాశ్చర్యమావంతయు లేదు. అంతియగాక నది సముచితము. ఈ సిద్ధాంతద్వయసమన్వయ వాక్యమో యన్నటుల 'వ్యావహారికం అనాశ్రిత్య నిర్వాణం నోపలభ్యతే' యని తంత్రశాస్త్రముగూడ నిర్ధారించుచున్నది. అంతియగాక దేని నెదుర్కొనవలయునో

---

43. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 180

44. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 30

దేనిని జయింపవలెనో దాని సమగ్రరీతి నెరింగి పోరాడినగాని జయశ్రీ లభింపదను రహస్యమునుగూడ 'యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి' (1.1.10) దేనిని తెలిసికొని శ్రద్ధాభక్తులతో జేయుదుమో ఆ కార్యము సంపూర్ణముగ ఫలప్రదమగుచున్నదని ఛాందోగ్యశ్రుతియు దెలుపుచున్నది.

పైవిధాన ప్రపంచతత్త్వమును విమర్శాదృష్టి బరిశీలించి నానాత్వ, వికార, విభేదనరూప ప్రపంచమునకు జంకనివాడె వైశేషికుడను సామెతననుసరించి 45 సాధకకోటికి ధీరత్వమును జ్ఞానమును బ్రసాదించి, There is not a topic with in the sphere of philosophy which does not find a clear or straight farward treatment in these short Sutras 46. తత్త్వశాస్త్రరంగములో బ్రస్ఫుటముగ నిరాటంకముగ జర్చింపబడనట్టి విషయమొక్కటియైన నీ సూత్రముల కానరాదని Max Muller మాక్సుముల్లరు వ్రాసియున్నట్లు సర్వదర్శన శాస్త్రములకు వైశేషికదర్శనము బహుళకీర్తి నార్జించియున్నది.

### వైశేషికసూత్రము - ఈశ్వరుడు

కాణాదసిద్ధాంతమున నీశ్వర స్థానవిషయమున ననేక అభిప్రాయభేదములు గోచరించును. Kanada's Sutras does not openly refer to God 47. ఈశ్వరునిగూర్చి కాణాదసూత్రములు ప్రస్ఫుటముగ బేర్కొనలేదనియు, he seemed to have been satisfied with the explanation of the universe by the

45. Dr. E, B Cowell · Sarva Darsana Sangraha 145
46. Prof F. Max Muller: The Six Systems of Indian Philosophy 3
47 Prof. S Radhakrishnan: Indian Philosophy Vol 2 225

principle of Adristha 47. అతడు విశ్వసమస్యాపరిష్కారమునకై అదృష్టసిద్ధాంతమునకు దృష్టిపొందినట్లు కనుపించుననియు రాధాకృష్ణుని అభిప్రాయము. కాని Some times Vaiseshika Sutras 2.1.18,19 are said to contain the proofs for the existence of God, though it is difficult to accept this view 47. 2.1.18,19 వైశేషికసూత్రముల ఈశ్వరాస్తిక్యతా నిరూపణము గలదని కొన్నిచోట్ల వాదించగలముగాని అది సమ్మతిదూరమనియు వారు వ్రాసిరి. అదే అభిప్రాయమును Kanada does not mention a God, or Supreme Creator among his ultimate substances 48. తన ద్రవ్యములలో ఈశ్వరునిగాని పరమసృష్టికర్తనుగాని కణాదుడు సూచించియుండలేదని శ్రీనివాస అయ్యంగారు వ్యక్తపరచెను. ఇట్లు ఈశ్వరప్రస్తావనమును ప్రత్యక్షముగ గావింప పోయినను సృష్టికారణమును అధిష్ఠానమును అగు పరమాణుస్పందనమునకును జీవసంచలనమునకును అదృష్టము కారణముగ వైశేషికము భావించెను. కాని His followers felt that the principle of Adristha was nebulous and unspiritual 49. అతని అనుచరులు అదృష్టసిద్ధాంతము మిగుల అవిస్పష్టమును అనాధ్యాత్మికమనియు దలంచి made it dependant on God's will 49. ఈశ్వరసంకల్పమునకధీనముగ గావించిరి. అందుచే దర్వాతి వైశేషికముననుసరించి God is the efficient cause of the world while the atoms are the material cause 49. ఈశ్వరుడు విశ్వమునకు నిమిత్త

47. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 225
48. V. T. Srinivasa Iyangar : Out lines of Hindu Philosophy 205
49. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 225

కారణమును పరమాణువులు ఉపాదానకారణమును అగు చున్నవి.

అయినను Kanada and Gautama might have at first purposely excluded God from their systems not as being totally non-existent, but as beyond and above the phinomenal world with which their systems were chiefly concerned 50. భౌతిక ప్రపంచమునకు ముఖ్యముగ దమ సిద్ధాంతములు సంబంధించియుండుటచే, దాని కతీతముగ నన్యముగ నీశ్వరుడుండుటను భావమున నీతడు సంపూర్తిగ నభావము కాదనియే కణాదగౌతములు తమసిద్ధాంతముల ప్రథమతః నీశ్వరుని ప్రస్తావింపకనుండవచ్చును. మరియు Possibly the aphorisists confined themselves to a classification and discussion of sub-luminary things only, without minding the super-natural agency 50. బహుశః అభౌతిక కర్తృత్వముల నపేక్షింపక, సూత్రకర్తలు, భౌతికవిషయ పరిశీలనమునందే నిమగ్నత నొంది యుండవచ్చుననియు, కాని భాష్యకర్తలు దీనినొక లోపముగ భావించి Supplied the ommission by inserting God under the category where it was possible to do so 50. అవకాశమున్న ప్రదేశముల నీశ్వరు నొక ద్రవ్యముగ జొప్పించి లోపమును బూరించిరని Athalye అథేలి అభిప్రాయము. అనగా నితనిభావమున కణాదుడు నాస్తికుడు కాడనియు దన సృష్టిసిద్ధాంతమునకు నీశ్వరుడవసరము లేకుండుటచే నతని ప్రతిపాదింపలేదనియు సద్ధము. కావున త్యాజ్యముగు నీసృష్టి నధిగమించుటకు యీ

50. Dr. Athalye: Tarka Sangraha 136

ప్రకృతివిధానమును గ్రహించుటయే తొలుత ముఖ్యావసరమై యుండుటచే, సాంఖ్యముగూడ నీశ్వరువిషయమున మౌనము ధరింప యోగవైశేషికములు పరమాత్మను సమ్మతించుచు, నత నికి విశ్వకర్తృత్వమునుమాత్రము నొసంగవయ్యెను. అంతియు గాక దర్శనక్రమము నొకింత యోచించుచో Nyaya and Vaiseshika stress on practical side, Sankhya and Yoga emphasize the mental aspect, while the Mimamsa systems stress on the spiritual aspect 51. న్యాయవైశేషిక ములు స్థూలమును, సాంఖ్యయోగములు మానసికమును, మీమాంసాద్వయము అధ్యాత్మవిషయముల నొక్కిచెక్కాణించు ననుచందము వైశేషిక ప్రతిపాదనాంశము, స్థూలమగు విశ్వ విషయమగుట యని నిర్ణయము. ఇట్టి సిద్ధాంత మూలరహస్య మును బాటింపకయేమొ యుండనోపు, శ్రీశంకరులు సూత్ర భాష్యమున, వైశేషికమునకు బ్రధానమగు పరమాణు సృష్టి కర్తృత్వమును ఖండించుచు బర్యవసానమున 'తదేవ మసారతర తర్క సందృబ్ధత్వా దీశ్వరకారణ శ్రుతివిరుద్ధత్వా చ్ఛ్రుతిప్రవణై శ్శిష్టైర్మన్వాదిభి రపరిగృహీతత్వా దత్యంత మేవానపేక్షాస్మిన్ పరమాణుకారణవాదే కార్యార్యైః శ్రేయోఽర్థిభిరితి (బ్ర.సూ. భా.2.2.17)కాబట్టి యిట్లు నిస్సారములగుయుక్తులతో గూడినది గావుననీశ్వరుడు జగత్కారణమని చెప్పు శ్రుతులకు విరుద్ధమగుట వలనను వేదమం దాదరముగల మన్వాది శిష్టులచే గ్రహింప బడలేదు గావునను బరమాణు కారణవాదమునందు శ్రేయము గోరు నార్యులచే ననపేక్ష చేయంబడదగినదని వివరించియున్నారు.

---

5 Kalyana Kalpa Taru 1936

పైవిధాన శిష్యులచే ప్రత్యక్షముగ స్వీకరింపబడకపోయినను తన ప్రతిష్ఠకు ప్రాబల్యమునకు లోపమువాటిల్లు అవకాశమున్నను, What I admire in Indian philosophy is that they never try to deceive us to their principles and consequences of their theories 52. తమ సిద్ధాంతములను వాని ప్రతిఫలమును దత్త్వవిదులు మరుగుపరుప యత్నింపకుండుటయె భారత తత్త్వశాస్త్రమున నేనెక్కువ మెచ్చుకొను యంశమని Max Muller మాక్సుముల్లరు అనినరీతి వైశేషికము యితరులచే నాస్తికముగను అవైదికముగను పరిగణింపబడుచు, గౌరవ మర్యాదల నొందకున్నను లక్ష్యముసేయక తనవిధానమునే అవలంబించి యున్నది.

## వైశేషికము - శ్రుతి

Nyaya and Vaiseshika are altogether absent. (in the classical Upanishads). The names of Patanjali and Kanada are absent altogether 53. ప్రశస్తమగు ఉపనిషత్తులలో న్యాయవైశేషికములు అగోచరములు. పతంజలి కణాద నామములును అందు అలభ్యము. అయినను 'It is easy to see that the philosophers to whom our Sutras are ascribed, cannot be considered as the first originators of Indian Philosophy 53. సూత్రకర్తలుగ సన్మానింపబడు తత్త్వవిదులు భారతతత్త్వశాస్త్రమునకు ఆదిపురుషులుగ బరిగణింపబడుటకు అవకాశములేదని గ్రహించుట సులభమని

52 Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy X

53. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy 84

Max Muller మాక్సుముల్లరు వచించురీతి నీసూత్రకర్తలకు ఆధారముగ నొక భావభాండ ముండవలెను. దానిగురించి ప్రస్తావించుచు All these Darsanas that you have ever seen or heard of are based upon the Upanishadic authority 54. మీరు చూచిన వినిన దర్శనములన్నియు నుపనిషత్ప్రమాణములపై నాధారపడియున్నవని వివేకానందులు వచించియున్నారు. దీనిననుసరించియే After the period of the Upanishads, dates the time when ideas of earlier thinkers were gradually taken up and made into a definite system, దర్శన taught in a philosophical school in the sense of a series of teachers who developed or atleast expounded one difinite body of doctrine 55. ఉపనిషత్కాలానంతరము ఒకొక్కసిద్ధాంతమునుగ్రహించితమతమతత్త్వవిజ్ఞాన పాఠశాలలో గురుపరంపరగా బోధింపబడుచు, నభివృద్ధిగావింపబడుచున్న సిద్ధాంతముల దర్శనరూపమున నొకప్రస్ఫుట స్వరూపమొసంగు కాలము ఏతెంచెను అని A. A. Macdonell మాక్డొనెల్ గూడ విశదపరచుచు, దర్శనాధారము ఉపనిషత్తులే అని ప్రస్ఫుటపరచి యున్నాడు.

అంతియగాక సూత్రకారుడు 'తద్వచనాదామ్నాయస్య ప్రామాణ్యం' (1.1.3) 'తస్మాదాగమికం' (2 1.17) 'వేదలింగాచ్చ' (4.2.11) 'వైదికం చ' (5.2.10) 'బుద్ధిపూర్వావాక్యకృతిర్వేదే' (6.1.1) మొదలగు సూత్రముల బ్రత్యక్షముగనే

54. Swami Vivekanand: The Complete Works Vol 3 327

55. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature 470

శ్రుతిని బ్రస్తావించి ప్రమాణముగ స్వీకరించి యుండుటచే వైశేషికము అవైదికమనుట అసమంజసము అసంబద్ధము అని విశదము. అందుచే సర్వదర్శనములకును వేదమే ప్రమాణమై ఆ యా దర్శనములు అందు తమ కుచితములును స్వీయసిద్ధాంత ప్రతిపాదనమున కుపయుక్తములును అగు విషయములమాత్రమే స్వీకరించి దర్శన నిర్మాణము గావించి, **The six systems in which the philosophical thought of India has found its full realisation 56.** భారతీయతత్త్వవిజ్ఞానము షడ్దర్శనము లలో సమగ్రత నొందియున్నదని **Max Muller** మాక్సు ముల్లరు అనురీతి భారతీయ తత్త్వశాస్త్ర భావసంపత్తును మిన్ను ముట్టునట్లు గావించి అసమాన యశస్సు ప్రసాదించి అమృతత్వము నార్జించియున్నవనుట మిగుల ఉత్తమము.

## షట్పదార్థి – సప్తపదార్థి

వైశేషికము బాహ్యప్రత్యక్షములగు స్థూలభూతసృష్టి మగు పదార్థముల స్వీకరించి, వాని ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయములను షట్పథముల మీమాంసించుచు వస్తుతత్త్వ నిరూపణము గావించియున్నది. అందుచే దీనికి షట్పదార్థియనియు నామాంతరము గలదు. కాని కాల క్రమమున గొందరు తత్త్వజ్ఞులు యీ యారింటిలో అభావమను విషయమును జేర్చి సప్తపదార్థి యనియు నామంబిడిరి. కాన ప్రస్తుతము యిది సప్తపదార్థియనియే ప్రఖ్యాతము. కావున

56. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy VI

సూత్రవ్యాఖ్యాతయగు విస్తృత్తికారుడు దీని పదార్థనిరూపణ తంత్రమని (1. 1. 1) వాకొనుటయు చాల సముచితము. తన్నిరూపణకార్యమునకు దగు న్యాయమును గణాదమునీంద్రు డొసంగియున్నను, గౌతమ న్యాయదర్శనము వైశేషికమునకు జాల యుపయుక్తమైయుండి కాలక్రమమున నందు లయించెను; లేక వైశేషికమును గ్రహించి ఒక్కటిగనయ్యెను. అందుచే న్యాయవైశేషికములు అన్యోన్యములై సర్వాంగభూయిష్టమైన నొక విశిష్ట సిద్ధాంత నిర్మాణము గావించియున్నవి.

## వైశేషిక సూత్రగ్రంథవిషయము

వైశేషిక గ్రంథరాజము భగవన్నిరూపణ సాధనార్థమేర్పడిన వేదాంతాది యితర శాస్త్రములవలెగాక ప్రారంభముననే 'అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః' (1.1.1) అట ప్రస్తుతము ధర్మమును వివరించుచున్నామని ప్రారంభించి 'యతోఽభ్యుదయ నిఃశ్రేయససిద్ధిః స ధర్మః' (1.1.2) దేని వలన 'అభ్యుదయస్తత్త్వజ్ఞానం నిఃశ్రేయసమాత్యంతికీ దుఃఖ నివృత్తిః తదుభయం యతః స ధర్మః' (1.1.2) ఉపస్కార అన్నటుల తత్త్వజ్ఞానరూపమైన అభ్యుదయము, దుఃఖ నివృత్తి రూపక నిశ్శ్రేయసము దేనివలన గలుగునో అది ధర్మమని నిర్వచించుచు ఆ ధర్మ ప్రతిపాదనమునకు 'తద్వచనాదామ్నాయస్య ప్రామాణ్యం' (1.1.3) ఈశ్వరప్రోక్తమగు వేదమే ప్రమాణ మని సూచిపరచుచు, 'ధర్మ విశేషప్రసూతాత్ ద్రవ్యగుణకర్మ

సామాన్య విశేష సమవాయానాం పదార్థానాం సాధర్మ్య వైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానా న్నిఃశ్రేయసం' (1.1.4) ద్రవ్య గుణకర్మ సామాన్య విశేష సమవాయ రూపమైన పదార్థముల సాధర్మ్యవైధర్మ్యముల గ్రహించుటవలన గలుగుధర్మవిశేషముగు తత్త్వజ్ఞానమువలననే నిఃశ్రేయసమగుముక్తి లభించునని ప్రతిజ్ఞ సేయుచు, అయిదవ సూత్రమునసే తన శాస్త్రమున కంతటికి నాధారమగు 'పృథివ్యాపస్తేజో వాయురాకాశం కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి' (1.1.5) యనబరగు నవద్రవ్యముల ప్రశేశపరచెను.

బ్రహ్మ సూగసూత్రాదిక వచనమువలె వైశేషికము గూడ 'లఘూని సూచితార్థాని స్వల్పాక్షరపదాని చ। సర్వతః సారభూతాని సూత్రాణ్యాహుర్మనీషిణః' (బ్ర. సూ. 1.1.1. భామతి) క్లిష్టమును, అర్థసూచికమును, మితాక్షరియు, సార భూతమును గలదానని తజ్ఞులు సూత్రమందురను భామతీ వచన రీతి, గ్రంథము సూత్రరచనము ననుసరించియున్నది. ఇందుగల 370 మూడువందలడెబ్బది సూత్రములు పదిఅధ్యాయములుగ విభజింపబడి మరల నొక్కొక్క అధ్యాయము రెండాహ్నిక ములుగ రూపొందింపబడియున్నది. అందు ద్రవ్యగుణములను వానికర్మలను వాని కార్యకారణముల ప్రథమాధ్యాయమున ద్రవ్యగుణకర్మవిచారరూపమున (1. 2. 1 వివృత్తి) విరచించి, ద్వితీయాధ్యాయమున బహిర్ద్రవ్యపరీక్షానామమున బహిర్ద్రవ్య

ములగు పంచభూతములయొక్కయు అభూతములగు దిక్కాల గుణ విచారమును గావించినది. అంత తృతీయాధ్యాయమున ఆత్మపరీక్షా (3. 1. 1. ఉపస్కార) విషయములగు నింద్రియార్థ విషయముల నాత్మలక్షణముల విచారించి నాల్గవఅధ్యాయమున ఇంద్రియోపలబ్ధి (4. 1. 1. వివృత్తి) తత్సంబంధియగు శరీరసృష్టిని గూర్చి వివరించెను. అయిదవఅధ్యాయమున ద్రవ్యముల నాశ్రయించియున్న కర్మపరీక్షను(5. 1. 1. ఉపస్కార) గావించి, ఆరవ యధ్యాయమున ధర్మాధర్మపరీక్షా (6. 1. 1. ఉపస్కార) రూప ధరాధర్మవిమర్శ తత్ప్రవృత్తినిగూర్చి ప్రసంగించెను. మరల సప్తమమున గుణలక్షణ (7.1.1. వివృత్తి) విచారముజేసి సంఖ్యా నిరూపణ(7. 2. 1. వివృత్తి) మనబరగు గుణేతరవిశేషవివరణము గావించి యంత తన అష్టమాధ్యాయమున బుద్ధిపరీక్షా (8 1. 1. ఉపస్కార) యనబడు జ్ఞానక్రియావిమర్శ చేయబడినది. ఈ జ్ఞాన క్రియా విమర్శయే తొమ్మిదవయధ్యాయమున నభావప్రత్యక్ష (9.1.1. వివృత్తి) యనియు లైంగిక ప్రత్యక్ష (9.2.1. ఉపస్కార) యనియు ద్వివిధమున విచారింపబడి, దశమాధ్యాయమున ఆత్మ గుణములగు (10. 1. 1. ఉపస్కార) సుఖదుఃఖవిచారము కారణత్రియ (10. 2. 1. ఉపస్కార) మీమాంసయు, సమగ్రముగ జర్చింపబడి నిరూపింపబడియున్నవి.

నేటి గ్రంథగత సూత్రములలో గొన్ని ప్రక్షిప్తములున్నట్లుగా కొందరు పండితులు భావించుచున్నారు. ఎందుచేతనన

Some of the Sutras now formed in his treatise were not commented on by the scholiast Prasastapada 57.
కణాదసూత్రముల ప్రస్తుతముగల కొన్ని సూత్రములను భాష్యకర్తయగు ప్రశస్తపాదుడు వ్యాఖ్యానించి యుండలేదు. కాబట్టి ప్రశస్తపాదునికాలమునకు ఆసూత్రములుండక తర్వాత చేర్పబడియుండునని తాత్పర్యము. ఈవిషయమింకను అనిశ్చితముగనే యున్నది.



57. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 179

# వైశేషిక విశేషాంశములు

## పరమాణువు

వైశేషికమును గూర్చియు విశాలమును సూక్ష్మమును అగు దృష్టి బరిశీలించి చూచుచో దానియున్న తత్త్వవిచారణము, కార్యకారణ మీమాంసయు ఆశ్చర్యమును గొలుపుటయేగాక ఆధునికలోకమునకు గలవరము గలుగజేయుచున్న atom పరమాణు విషయము, Gravity గురుత్వసిద్ధాంతము మనకు విస్మయానందముల గలిగింపకమానవు. ఆధునిక నిర్వచనమునకును, ప్రాచీన వివరణమునకు మిగుల వ్యత్యాసము గోచరించినను, అగుగాక ఆవిషయముల ప్రపంచమునకు ప్రథమముగా చూపెట్టిన ప్రఖ్యాతి కణాదమునీంద్రునిదే యనుటకెట్టి సందియమును లేదు. సర్వము భ్రాంతి, మాయ, అనుమాటలు భారతీయ తత్త్వలోకమున గానుపించుచున్నను, ఆమాయాదికమునకధిష్ఠానమున నొక త్రికాలాబాధ్యమైన వస్తువుండుట ప్రతిపాదింపబడియుండుటయు, సర్వకారణమగు ప్రధానమొండు గలదని సాంఖ్యులును సర్వసృష్టికాధారముగ నిత్యమగు పరమాణువు గలదని వైశేషికులును, నిత్యశబ్దమునుండియే సర్వసృష్టియని మీమాంసకులును వచించుచుండుటచే The indistructibility of matter was not unknown to our most ancent sages - Kapila, Gautama, Kanada, Patanjai, Jaimini and many others know its indistructible nature 58. అతిప్రాచీ

58. Swami Ramakrishnananda: The Message of Eternal Wisdom 93

నులగు మహర్షులకు ద్రవ్యముయొక్క అనశ్వరత్వము తెలియక పోలేదు. కపిల, గౌతమ, కణాద, పతంజలి, జైమిన్యాది యనేక మహర్షులకు పదార్థముయొక్క నిత్యత్వము తెలియును అని రామకృష్ణానందులు వ్రాసిరి. ఆధునిక భౌతికవిజ్ఞానశాస్త్ర పారిభాషికపదములే భారతీయ విజ్ఞానశాస్త్రముల గోచరించు చుండుటచేతను, ప్రఖ్యాతముగ వైశేషికము పరమాణుసిద్ధాంత మునే ప్రతిపాదించి గురుత్వమును సూచించి యుండుటచేతను వాని నాధునికమున కన్వయింపరాదనుచు The interpretation of the physics of the Vaiseshika presents great difficulties 59. వైశేషిక భౌతికవిజ్ఞానశాస్త్రవివరణము అనేకసమస్యల కలుగజేయుచున్నదియు and it is extremely dubious if we are justified with modern scholars, Indian and western, in seeking to read recent results into the simple and rather rude concepts of the ancient texts 59. ప్రాచీనగ్రంథములగల సామాన్యమును అస్పష్టమును అగు విజ్ఞానవిషయముల ఆధునిక శాస్త్రవిషయములకు, కొందరు భారతీయ ఐరోపీయపండితులవలె ముడిపెట్టుట కడుంగడు సంశయాస్పదమగును; ఎందులకన Their interest was metaphysical, and it is not usual for science and philosophy to be effectually combined 59. ప్రాచీనుల దృక్పథము అభౌతికము మరియు భౌతికమును తత్త్వవిషయములు సంకలనపరచుట సర్వసాధారణముకాదని A. A. Macdonell మాక్డొనెల్ వ్రాసియున్నాడు. ఇతని భావములో వైశేషికముయొక్క పరమాణు

59. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature 486

సిద్ధాంతము సమగ్రముగాదని యుండనోపు. కాని Science భౌతికవిజ్ఞానము ఎన్నటికిని సంపూర్ణము కానేరదు. ఇతర విషయము లెట్లున్నను, The atomic theory has never properly been proved either in ancient or in modern times 60. ప్రాచీనార్వాచీనకాలములందెప్పుడును బరమాణు సిద్ధాంతము సక్రమముగ నిరూపింపబడలేదని రాధాకృష్ణపండితుడే వచించియున్నాడు. అందుచే సమగ్రమయినను కాకున్నను, పరమాణుసిద్ధాంతమును బ్రపంచమునకు దొలి ప్రసాదించిన మహాపురుషుడు కణాదుడేయనుట నిస్సందేహము. ఆమహాత్మునియొక్క దృక్పథము కేవలము అలౌకికము కాదనియు ప్రాకృతికసృష్టి విచారణామే యతని ముఖ్య తాత్పర్యమనియు పూర్వమే వచించియుంటిమి. కాన లౌకిక అలౌకికములకు, ప్రాపంచిక అధ్యాత్మములకు, భౌతికవిజ్ఞాన అధ్యాత్మములకు నాప్రాచీనమహర్షి పుంగవుడు సమన్వయముగావించియుండెననియు ననవచ్చును. కాన Science without religion is lame, religion without science is blind 61. విజ్ఞానములేని అధ్యాత్మవిద్య కుంటిపోవును. అధ్యాత్మములేని విజ్ఞానము అంధము అను Einstein ఐన్‌స్టీన్ వాక్యరహస్యము నానాడె కణాదుడు గ్రహించియుండును.

## గురుత్వము

మరియు బ్రాసంగికముగ నీశాస్త్రమున గణాదయోగీశ్వరునిచే నిరూపింపబడియున్న Gravity అను గురుత్వసిద్ధాం

60. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 202
61. Einstein; Prabuddha Bharata Sep 1952

తముగూడ అసమానము, అపూర్వము. సర్వవిజ్ఞలోకమునకు ఆదర్శకము. 'గురుత్వప్రయత్న సంయోగానాత్ క్షేపణం' (1 1.29) 'సంయోగాభావే గురుత్వాత్ పతనం' (5.1.7) 'సంస్కారాభావే గురుత్వాత్ పతనం' (5.1.18) 'అపాం సంయోగాభావే గురుత్వాత్ పతనం' (5 2.3) మొదలగు సూత్రములలో గురుత్వము వివరింపబడియున్నది. అందు మొదటి సూత్రమునకు ఉపస్కారకారుడు 'అత్ర గురుత్వస్య హస్తలోష్టాదిప్రత్తినో నిమిత్తకారణత్వం' (1.1.2 ) గురుత్వము హస్తాదికమునగలిగి ఉత్క్షేపణ కార్యమునకు నిమిత్తకారణ మగుచున్నదని వివరించియున్నాడు. అట్లే 'ప్రతిబంధకాభావే గురుత్వాదసమవాయికారణాత్ పతనం అథ సంయోగ ఫలికాక్రియా జాయతే' (5.1 7. ఉపస్కార) ప్రతిబంధకాభావమున అసమవాయికారణమగు గురుత్వమువలన పతనమును, అంత సంయోగరూపఫల మేర్పడుచున్నదని శంకరాచార్యుడు వ్రాసెను. అనగా గురుత్వము అసమవాయికారణముగ నుండును. ఈ విషయమునే వివరించుచు 'ఫలాదా' (5.1.7) పడుచున్న ఫలాదికమునే వ్యాఖ్యాత ఉదాహరణముగ గైకొనెను. ఈ విషయమునే ప్రస్తావించుచు 'గురుత్వం పృథివీజలవృత్తిః' (30) అని తర్కసంగ్రహము స్పష్టపరచెను. ఆ గురుత్వమను శక్తి పృథ్వీజలాదులలో నుండినను యింద్రియగోచరము కాదనుట 'సామగ్ర్యభావాన్న గురుత్వాదేః ప్రత్యక్షం' (4 1.10) ప్రత్యక్షగోచరమగుటకు సామగ్రిము లేకుండుటచే గురుత్వము అగోచరమని వ్రాయుటను, ఆ గురుత్వము స్పర్శన ప్రత్యక్షముగా నల్లభాచార్య నుదాహరించెనని వృత్తికారుడు

వివరించెను. కారికావళీకారుడును 'అతీంద్రియం గురుత్వం స్యాత్ పృథివ్యాదివృత్తి తు తత్' (153) గురుత్వమతీంద్రియమై పృథ్వ్యాదులయందుండి 'తదేవాసమవాయిస్యాత్ పతనాఖ్యే తు కర్మణి' (153) అది అసమవాయికారణముగ నుండి పతనక్రియను కలుగజేయుచున్నట్లు వ్రాసియున్నాడు. గురుత్వముయొక్క యునికి ఎట్లు తెలియబడుచున్నదన 'సంయోగజన్యక్రియాదిత్వానుమానేన గురుత్వసిద్ధిరితి భావః' (154) సంయోగజన్యమునుబట్టి గురుత్వమున్నట్లు సిద్ధమని ముక్తావళి వివరించెను. అందుచే గురుత్వము ఫలాదులందును పృథ్వియందు నున్నదని తాత్పర్యమగుటచే నాధునిక Gravity అను ఆకర్షణశక్తికి చాలవరకు సన్నిహితమని విశదమగుచున్నది. కావున **Gravitation was known by the Indians thousands of years before Newton was born** 62. న్యూటను జనించుటకు వేలసంవత్సరముల పూర్వమే భూమియొక్క ఆకర్షణశక్తి భారతీయులకు గ్రాహ్యమని వివేకానందులు వచించియున్నారు.

పై విధాన భౌతిక విజ్ఞానతత్త్వముల సమన్వయపరచి, సర్వజిజ్ఞాసువులకు సుసూక్ష్మ గవేషణావిధానమును బ్రసాదించి, ముముక్షుకోటికి దుఃఖహానోపాయమును గటాక్షించియున్న శ్రీ కణాద మునీంద్రులు కడుంగడు స్తవనీయులు. చిరస్మరణీయులు. అమ్మహాత్మునికి సర్వవిజ్ఞానలోకము సదా కృతజ్ఞులై యుండక తప్పదుగదా!

---

62 Sawmi Vivekananda : The Complete Works Vol 2 20

## నామవిశిష్టత

పూర్వము వచింపబడిన తెరంగున వైశేషికము ఉలూకమహర్షి యొక్క పుత్రుడగు కణాదునిచే నిర్మింపబడుట వలన దీని ఔలూక్యదర్శనమనియు, కణాద ప్రతిపాదితము గాన కాణాద సూత్రమనియు, పదార్థశోధనాశాస్త్రమగుటచే పదార్థ నిరూపణ తంత్రమనియు దశాధ్యాయములు గలిగి యుండుటచే దశాధ్యాయినీ తంత్రమనియు, పలువిధముల వ్యవహరింపబడుచున్నది. అంతియగాక ద్రవ్యాది సమవాయపర్యంత షట్పదార్థ విజ్ఞానమును విశదీకరించుటచేత షట్పదార్థియనియు, అభావముతోగూడ సప్తపదార్థియనియు బ్రఖ్యాతము. మరియు The Vaiseshika system takes its name from Visesha or particularity 63. విశేషయను నామముమీద నాధారపడి యిది వైశేషిక మనబడియున్నదనియు By means of విశేష or particularity we are able to perceive things as different from one another 64. విశేషజ్ఞానమువలన వస్తువుల బరస్పరవ్యత్యాసముద్వారా వస్తువును గ్రహించెదమనియు, ఆ విధానము నాశ్రయించినదగుటచే నిది వైశేషికమనబడినదని రాధాకృష్ణపండితుని వివరణము. It received its name from the category of విశేష particularity on which great stress is laid in its theory of atoms 65. షట్పదార్థములగల విశేష ననుసరించియే దానికి యీ నామము గలిగెను. దాని బరమాణువాదమున నది

---

63. Prof. S Radhakrishnan: Indian Philosophy Vol 2 176
64. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 180
65. Dr. A. A. Macdonell· A History of Sanskrit Literature 385

వ్యక్తమని A. A. Macdonell మాక్డొనెల్ కూడ వ్రాసి యున్నాడు. అట్లుగాక ఇది తర్కీన దర్శనములకంటె ప్రధానముగ న్యాయదర్శనముకంటె విశిష్టముగ సధిక యుక్తియుక్తముగ నుండుటచే వైశేషికమని పేరొందెనని గొందరందురు.

మరియు తన గ్రంథాంతమున 'సంయుక్త సమవాయాదగ్నేర్వైశేషికం' (10.2.7) అనుచోట 'వైశేషికం' అను పదము నుపయోగించి తదర్థముగా అగ్న్యాదిద్రవ్య గుణశోధనయే యీ గ్రంథ తాత్పర్యమని సూచించుచు ఆ విశిష్టనామము నే తన శాస్త్రమున కలంకరింపవలయునని ఆ పరను యోగీంద్రుడు సంకల్పించియుండెనేమో అనియుగూడ దోచెడిని. అట్టి సార్థక సంకల్పముచే నీ శాస్త్రరాజము సార్థక నామము ధరించి, భారతీయతత్త్వ విజ్ఞానసౌధమునకు బునాది వేసినదని నమ్మదగియున్నది.



# వైశేషిక సూత్రములు

## ప్రథమగ్రంథము – ప్రథమాహ్నికపాఠము

1 అథాతో ధర్మం వ్యాఖ్యాస్యామః

2 యతోఽభ్యుదయ నిఃశ్రేయససిద్ధిః స ధర్మః

3 తద్వచనాదామ్నాయస్య ప్రామాణ్యం

4 ధర్మవిశేషప్రసూతాత్ ద్రవ్యగుణకర్మ సామాన్యవిశేష సమవాయానాం పదార్థానాం సాధర్మ్యవైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానాన్నిఃశ్రేయసం

5 పృథివ్యాపస్తేజో వాయురాకాశం కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి

6 రూపరసగంధస్పర్శాః సంఖ్యాః పరిమాణాని పృథక్త్వం సంయోగవిభాగౌ పరత్వాపరత్వే బుద్ధయః సుఖదుఃఖే ఇచ్ఛాద్వేషౌ ప్రయత్నాశ్చ గుణాః

7 ఉత్క్షేపణ మవక్షేపణ మాకుంచనం ప్రసారణం గమన మితి కర్మాణి

8 సదనిత్యం ద్రవ్యవత్ కార్యం కారణం సామాన్యవిశేషవదితి ద్రవ్యగుణకర్మణా మవిశేషః

9 ద్రవ్యగుణయోః సజాతీయారంభకత్వం సాధర్మ్యం

10 ద్రవ్యాణి ద్రవ్యాంతరమారభంతే గుణాశ్చ గుణాంతరం

11 కర్మ కర్మసాధ్యం న విద్యతే

12 న ద్రవ్యం కార్యం కారణం చ వధతి

13 ఉభయథా గుణాః

14 కార్యవిరోధి కర్మ
15 క్రియాగుణవత్ సమవాయికారణమితి ద్రవ్యలక్షణం
16 ద్రవ్యాశ్రయ్యగుణవాన్ సంయోగవిభాగే ష్వకారణమనపేక్ష
ఇతి గుణలక్షణం
17 ఏకద్రవ్యమగుణం సంయోగవిభాగే ష్వకారణమనపేక్ష
కారణమితి కర్మలక్షణం
18 ద్రవ్యగుణ కర్మణాం ద్రవ్యం కారణం సామాన్యం
19 తథా గుణాః
20 సంయోగ విభాగవేగానాం కర్మ సమానం
21 న ద్రవ్యాణాం కర్మ
22 వ్యతిరేకాత్
23 ద్రవ్యాణాం ద్రవ్యం కార్యం సామాన్యం
24 గుణవైధర్మ్యా న్నకర్మణాం కర్మ
25 ద్విత్వప్రభృతయః సంఖ్యాః పృథక్త్వ సంయోగవిభాగాశ్చ
26 అసమవాయాత్ సామాన్యకార్యం కర్మ న విద్యతే
27 సంయోగానాం ద్రవ్యం
28 రూపాణాం రూపం
29 గురుత్వప్రయత్న సంయోగానా ముత్క్షేపణం
30 సంయోగ విభాగాశ్చ కర్మణాం
31 కారణసామాన్యే ద్రవ్యకర్మణాం కర్మాకారణముక్తం

## ప్రథమగ్రంథము - ద్వితీయాహ్నికపాఠము

1 కారణాభావాత్ కార్యాభావః
2 న తు కార్యాభావాత్ కారణాభావః

3 సామాన్యం విశేష ఇతి బుద్ధ్యపేక్షం
4 భావోఽనువృత్తేరేవ హేతుత్వాత్ సామాన్యమేవ
5 ద్రవ్యత్వం గుణత్వం కర్మత్వం చ సామాన్యాని విశేషాశ్చ
6 అన్యత్రాంత్యేభ్యో విశేషేభ్యః
7 సదితి యతో ద్రవ్యగుణకర్మసు సా సత్తా
8 ద్రవ్యగుణకర్మభ్యో ఽర్థాంతరం సత్తా
9 గుణకర్మసు చ భావాన్న కర్మ న గుణః
10 సామాన్యవిశేషాభావేన చ
11 అనేకద్రవ్యవత్త్వేన ద్రవ్యత్వముక్తం
12 సామాన్యవిశేషాభావేన చ
13 తథా గుణేషు భావాద్గుణత్వముక్తం
14 సామాన్యవిశేషాభావేన చ
15 కర్మసు భావాత్ కర్మత్వముక్తం
16 సామాన్యవిశేషాభావేన చ
17 సదితి లింగావిశేషాద్విశేష లింగాభావాచ్చైకో భావః

## ద్వితీయగ్రంథము — ప్రథమాహ్నికపాఠము.

1 రూపరసగంధస్పర్శవతీ పృథివీ
2 రూపరసస్పర్శవత్య ఆపో ద్రవాః స్నిగ్ధాః
3 తేజో రూపస్పర్శవత్
4 స్పర్శవాన్ వాయుః
5 త ఆకాశే న విద్యంతే
6 సర్పిర్జతుమధూచ్ఛిష్టానామగ్నిసంయోగాద్ద్రవత్వమద్భిః సామాన్యం

7 త్రపుసీసలోహరజతసువర్ణానామగ్నిసంయోగాద్ద్రవవత్వ
మద్భిః సామాన్యం
8 విషాణీ కకుద్మాన్ ప్రాంతబాలధిః సాస్నావాన్ ఇతి గోత్వే
దృష్టం లింగం
9 స్పర్శశ్చ వాయోః
10 న చ దృష్టానాం స్పర్శ ఇత్యదృష్టలింగో వాయుః
11 అద్రవ్యవత్త్వేన ద్రవ్యం
12 క్రియావత్త్వాద్గుణవత్త్వాచ్చ
13 అద్రవ్యవత్త్వేన నిత్యత్వముక్తం
14 వాయోర్వాయుసమ్మూర్ఛనం నానాత్వలింగం
15 వాయుసన్నికర్షే ప్రత్యక్షాభావాద్దృష్టం లింగం న విద్యతే
16 సామాన్యతో దృష్టాచ్చావిశేషః
17 తస్మాదాగమికం
18 సంజ్ఞాకర్మ త్వస్మద్విశిష్టానాం లింగం
19 ప్రత్యక్షప్రవృత్తత్వాత్ సంజ్ఞాకర్మణః
20 నిష్క్రమణం ప్రవేశనమిత్యాకాశస్య లింగం
21 తదలింగ మేకద్రవ్యత్వాత్ కర్మణః
22 కారణాంతరానుక్లృప్తివైధర్మ్యాచ్చ
23 సంయోగాదభావః కర్మణః
24 కారణగుణపూర్వకః కార్యగుణో దృష్టః
25 కార్యాంతరాప్రాదుర్భావాచ్చ శబ్దః స్పర్శవతామగుణః
26 పరత్ర సమవాయాత్ ప్రత్యక్షత్వాచ్చ నాత్మగుణో న
మనోగుణః

27 పరిశేషాల్లింగ మాకాశస్య
28 ద్రవ్యత్వనిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే
29 తత్త్వం భావేన
30 శబ్దలింగావిశేషాద్విశేషలింగాభావాచ్చ
31 తదనువిధానాదేకపృథక్త్వంచేతి

ద్వితీయగ్రంథము - ద్వితీయాహ్నికపాఠము

1 పుష్పవస్త్రయోః సతి సన్నికర్షే గుణాంతరాప్రాదుర్భావో వస్త్రే గంధాభావలింగం
2 వ్యవస్థితః పృథివ్యాం గంధః
3 ఏతేనోష్ణతా వ్యాఖ్యాతా
4 తేజస ఉష్ణతా
5 అప్సు శీతతా
6 అపరస్మిన్నపరం యుగపత్ చిరం క్షిప్రమితికాలలింగాని
7 ద్రవ్యత్వనిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే
8 తత్త్వం భావేన
9 నిత్యేష్వభావాదనిత్యేషు భావాత్ కారణే కాలాఖ్యేతి
10 ఇత ఇదమితి యతస్తద్దిశ్యం లింగం
11 ద్రవ్యత్వనిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే
12 తత్త్వం భావేన
13 కార్యవిశేషేణ నానాత్వం
14 ఆదిత్యసంయోగాద్భూతపూర్వాద్భవిష్యతో భూతాచ్చప్రాచీ
15 తథా దక్షిణా ప్రతీచీ ఉదీచీ చ

16 ఏతేన దిగంతరాలాని వ్యాఖ్యాతాని

17 సామాన్యప్రత్యక్షాద్విశేషాప్రత్యక్షాద్విశేష స్మృతేశ్చ సంశయః

18 దృష్టం చ దృష్టవత్

19 యథా దృష్టమయథాదృష్టత్వాచ్చ

20 విద్యాఽవిద్యాతశ్చ సంశయః

21 శ్రోత్రగ్రహణో యోఽర్థః స శబ్దః

22 తుల్యజాతీయేష్వర్థాంతరభూతేషు విశేషస్య ఉభయథా దృష్టత్వాత్

23 ఏకద్రవ్యత్వాన్న ద్రవ్యం

24 నాపి కర్మాచాక్షుషత్వాత్

25 గుణస్య సతోఽపవర్గః కర్మభిః సాధర్మ్యం

25 సతో లింగాభావాత్

27 నిత్యవైధర్మ్యాత్

28 అనిత్యశ్చాయం కారణతః

29 న చాసిద్ధం వికారాత్

30 అభివ్యక్తౌ దోషాత్

31 సంయోగాద్విభాగాచ్చ శబ్దాచ్చ శబ్దనిష్పత్తిః

32 లింగాచ్చానిత్యః శబ్దః

33 ద్వయోస్తు ప్రవృత్త్యోరభావాత్

34 ప్రథమాశబ్దాత్

35 సంప్రతిపత్తిభావాచ్చ

36 సందిగ్ధా సతి బహుత్వే

37 సంఖ్యాభావః సామాన్యతః

## తృతీయగ్రంథము - ప్రథమాహ్నికపాఠము.

1 ప్రసిద్ధా ఇంద్రియార్థాః
2 ఇంద్రియార్థప్రసిద్ధిరింద్రియార్థేభ్యోఽర్థాంతరస్య హేతుః
3 సోఽనపదేశః
4 కారణాజ్ఞానాత్
5 కార్యేషు జ్ఞానాత్
6 అజ్ఞానాచ్చ
7 అన్యదేవ హేతురిత్యనపదేశః
8 అర్థాంతరం హ్యర్థాంతరస్యాఽనపదేశః
9 సంయోగిసమవాయ్యేకార్థసమవాయివిరోధి చ
10 కార్యం కార్యాంతరస్య
11 విరోధ్యభూతం భూతస్య
12 భూతమభూతస్య
13 భూతో భూతస్య
14 ప్రసిద్ధిపూర్వకత్వాదపదేశస్య
15 అప్రసిద్ధోఽనపదేశో ఽసన్ సందిగ్ధశ్చానపదేశః
16 యస్మాద్విషాణీ తస్మాదశ్వః
17 యస్మాద్విషాణీ తస్మాద్గౌరితి చానైకాంతికస్యోదాహరణం
18 ఆత్మేంద్రియార్థసన్నికర్షాద్యన్నిష్పద్యతే తదన్యత్
19 ప్రవృత్తినివృత్తీ చ ప్రత్యగాత్మని దృష్టే పరత్ర లింగం

## తృతీయగ్రంథము - ద్వితీయాహ్నికపాఠము.

1 ఆత్మేంద్రియార్థసన్నికర్షే జ్ఞానస్య భావోఽభావశ్చ మనసో లింగం

2 తస్య ద్రవ్యత్వనిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే
3 ప్రయత్నాయౌగపద్యాత్ జ్ఞానాయౌగపద్యాచ్చైకం
4 ప్రాణాపాననిమేషోన్మేషజీవన మనోగతీంద్రియాంతరవికారాః
సుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్నాశ్చ చాత్మనో లింగాని
5 తస్య ద్రవ్యత్వనిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే
6 యజ్ఞదత్త ఇతి సన్నికర్షే ప్రత్యక్షాభావాద్దృష్టలింగం న విద్యతే
7 సామాన్యతో దృష్టాచ్చావిశేషః
8 తస్మాదాగమికః
9 అహమితి శబ్దస్య వ్యతిరేకాన్నాగమికం
10 యది దృష్టమన్వక్షమహం దేవదత్తోఽహం యజ్ఞదత్త ఇతి
11 దృష్ట ఆత్మని లింగే ఏక ఏవ దృఢత్వాత్ ప్రత్యక్షవత్ ప్రత్యయః
12 దేవదత్తో గచ్ఛతి యజ్ఞదత్తో గచ్ఛతీత్యుపచారాచ్ఛరీరే ప్రత్యయః
13 సందిగ్ధస్తూపచారః
14 అహమితి ప్రత్యగాత్మని భావాత్ పరత్రాభావాదర్థాంతర ప్రత్యక్షః
15 దేవదత్తో గచ్ఛతీత్యుపచారాదభిమానాత్తావచ్ఛరీర ప్రత్యక్షోఽహంకారః
16 సందిగ్ధస్తూపచారః
17 న తు శరీరవిశేషాద్యజ్ఞదత్తవిష్ణుమిత్రయోర్జ్ఞానం విషయః

18 అహమితి ముఖ్యయోగ్యాభ్యాం శబ్దవద్వ్యతిరేకావ్యభిచారాద్విశేషసిద్ధేర్నాగమికః
19 సుఖదుఃఖజ్ఞాన నిష్పత్త్యవిశేషా దైకాత్మ్యం
20 వ్యవస్థాతో నానా
21 శాస్త్ర సామర్థ్యాచ్చ

## చతుర్థగ్రంథము—ప్రథమాహ్నిక పాఠము

1 సదకారణవనిత్యం
2 తస్య కార్యం లింగం
3 కారణభావాత్ కార్యభావః
4 అనిత్య ఇతి విశేషతః ప్రతిషేధభావః
5 అవిద్యా
6 మహత్యనేక ద్రవ్యవత్వాత్ రూపాచ్చోపలబ్ధిః
7 సత్యపి ద్రవ్యత్వే మహత్వే రూపసంస్కారాభావాద్వాయో రనుపలబ్ధిః
8 అనేక ద్రవ్యసమవాయాత్ రూపవిశేషాచ్చ రూపోపలబ్ధిః
9 తేన రసగంధస్పర్శేషు జ్ఞానం వ్యాఖ్యాతం
10 తస్యాభావా దవ్యభిచారః
11 సంఖ్యాః పరిమాణాని పృథక్త్వం సంయోగవిభాగౌ పరత్వా పరత్వే కర్మ చ రూపిద్రవ్యసమవాయాత్ చాక్షుషాణి
12 అరూపిష్వచాక్షుషాణి
13 ఏతేన గుణత్వే భావే చ సర్వేంద్రియం వ్యాఖ్యాతం

## చతుర్థగ్రంథము - ద్వితీయాహ్నిక పాఠము

1 తత్ పునః పృథివ్యాది కార్యద్రవ్యం త్రివిధం శరీరేంద్రియ విషయకసంజ్ఞం
2 ప్రత్యక్షా ప్రత్యక్షాణాం సంయోగస్యాప్రత్యక్షత్వాత్ పంచాత్మకం న విద్యతే
3 గుణాంతర ప్రాదుర్భావాచ్చ న ఆత్మకం
4 అణుసంయోగ స్త్వప్రతిషిద్ధః
5 తత్ర శరీరం ద్వివిధం యోనిజమయోనిజం చ
6 అనియత దిగ్దేశపూర్వకత్వాత్
7 ధర్మవిశేషాచ్చ
8 సమాఖ్యాభావాచ్చ
9 సంజ్ఞాయా అనాదిత్వాత్
10 సంత్యయోనిజాః
11 వేదలింగాచ్చ

## పంచమ గ్రంథము - ప్రథమాహ్నిక పాఠము

1 ఆత్మసంయోగ ప్రయత్నాభ్యాం హస్తే కర్మ
2 తథ హస్తసంయోగాచ్చ ముసలే కర్మ
3 అభిఘాతజే ముసలాదౌ కర్మణి వ్యతిరేకాదకారణం హస్త సంయోగః
4 తథాత్మసంయోగో హస్తకర్మణి
5 అభిఘాతాన్ముసలసంయోగాత్ హస్తే కర్మ
6 ఆత్మకర్మ హస్తసంయోగాచ్చ

7 సంయోగాభావే గురుత్వాత్ పతనం
8 నోదనవిశేషాభావాన్నోర్ధ్వం న తిర్యగ్గమనం
9 ప్రయత్నవిశేషాన్నోదన విశేషః
10 నోదనవిశేషాదుదసన విశేషః
11 హస్తకర్మణా దారకకర్మ వ్యాఖ్యాతం
12 తథా దగ్ధస్య విస్ఫోటనే
13 ప్రయత్నాభావే ప్రసుప్తస్య చలనం
14 తృణే కర్మ వాయుసంయోగాత్
15 మణిగమనం సూచ్యభిసర్పణమ దృష్టకారణం
16 ఇషావయుగపత్ సంయోగవిశేషాః కర్మాన్యత్వే హేతుః
17 నోదనాదాద్యమిషోః కర్మ తత్కర్మకారితాచ్చ సంస్కారా దుత్తరం తథోత్తరముత్తరం చ
18 సంస్కారాభావే గురుత్వాత్ పతనం

## పంచమగ్రంథము - ద్వితీయాహ్నిక పాఠము

1 నోదనాపీడాత్ సంయుక్తసంయోగాచ్చ పృథివ్యాం కర్మ
2 తద్విశేషేణాదృష్టకారితం
3 అపాం సంయోగాభావే గురుత్వాత్ పతనం
4 ద్రవత్వాత్ స్యందనం
5 నాడ్యో వాయుసంయోగాదారోహణం
6 నోదనాపీడనాత్ సంయుక్తసంయోగాచ్చ
7 వృక్షాభిసర్పణమిత్యదృష్టకారితం
8 అపాం సంఘాతో విలయనం చ తేజః సంయోగాత్

9 తత్ర విస్ఫూర్జథుర్లింగం
10 వైదికం చ
11 అపాం సంయోగాద్విభాగాచ్చ స్తనయిత్నోః
12 పృథివీకర్మణా తేజకర్మ వాయుకర్మ చ వ్యాఖ్యాతం
13 అగ్నేరూర్ధ్వజ్వలనం వాయోస్తిర్యక్ పవన మణూనాం మన సశ్చాద్యకర్మాదృష్టకారితం
14 హస్తకర్మణా మనసః కర్మ వ్యాఖ్యాతం
15 ఆత్మేంద్రియమనోఽర్థసన్నికర్షాత్ సుఖదుఃఖం
16 తదనారంభ ఆత్మస్థే మనసి శరీరస్య దుఃఖభావః సంయోగః
17 అపసర్పణముపసర్పణ మశితపీత సంయోగాః కార్యాంతర సంయోగాశ్చేత్యదృష్టకారితాని
18 తదభావే సంయోగాభావోఽప్రాదుర్భావశ్చ మోక్షః
19 ద్రవ్యగుణకర్మ నిష్పత్తివైధర్మ్యాదభావ స్తమః
20 తేజసో ద్రవ్యాంతరేణావరణాచ్చ
21 దిక్కాలావాకాశం చ క్రియావద్వైధర్మ్యా న్నిష్క్రియాణి
22 ఏతేన కర్మాణి గుణాశ్చ వ్యాఖ్యాతాః
23 నిష్క్రియాణాం సమవాయః కర్మభ్యో నిషిద్ధః
24 కారణం త్వసమవాయినో గుణాః
25 గుణైర్దిగ్వ్యాఖ్యాతా
26 కారణేన కాలః

### షష్ఠగ్రంథము-ప్రథమాహ్నిక పాఠము.

1 బుద్ధిపూర్వా వాక్యకృతిర్వేదే
2 బ్రాహ్మణే సంజ్ఞాకర్మ సిద్ధి లింగం

3 బుద్ధిపూర్వో దదాతిః
4 తథా ప్రతిగ్రహః
5 ఆత్మాంతరగుణానామాత్మాంతరేఽకారణత్వాత్
6 తద్దుష్టభోజనే న విద్యతే
7 దుష్టం హింసాయాం
8 తస్య సమభివ్యాహారతో దోషః
9 తదదుష్టే న విద్యతే
10 పునర్విశిష్టే ప్రవృత్తిః
11 సమే హీనే వా ప్రవృత్తిః
12 ఏతేన హీనసమవిశిష్టధార్మికేభ్యః పరస్వాదానం వ్యాఖ్యాతం
13 తథా విరుద్ధానాం త్యాగః
14 హీనే పరే త్యాగః
15 సమే ఆత్మత్యాగః పరత్యాగో వా
16 విశిష్టే ఆత్మత్యాగ ఇతి

## షష్ఠగ్రంథము - ద్వితీయాహ్నిక పాఠము.

1 దృష్టాదృష్టప్రయోజనానాం దృష్టాభావే ప్రయోజన మభ్యుదయాయ
2 అభిషేచనోపవాస బ్రహ్మచర్యగురుకులవాస వానప్రస్థ యజ్ఞ దాన ప్రోక్షణదిఙ్నక్షత్రమంత్రకాలనియామాశ్చాదృష్టాయ
3 చాతురాశ్రమ్యముపధా అనుపధాశ్చ
4 భావదోష ఉపధాఽదోషోఽనుపధా
5 యదిష్టరూపరసగంధస్పర్శం ప్రోక్షిత మభ్యుక్షితం చ తచ్ఛుచి

6 అశుచీతి శుచిప్రతిషేధః

7 అర్థాంతరం చ

8 అయుతస్య శుచిభోజనాదభ్యుదయో న విద్యతే నియమాభావాత్ విద్యతే వాఽర్థాంతరత్వాద్యమస్య

9 అసతి చాభావాత్

10 సుఖాద్రాగః

11 తన్మయత్వాచ్చ

12 అదృష్టాచ్చ

13 జాతివిశేషాచ్చ

14 ఇచ్ఛాద్వేషపూర్వికా ధర్మాధర్మప్రవృత్తిః

15 తత్సంయోగో విభాగః

16 ఆత్మగుణకర్మసు మోక్షో వ్యాఖ్యాతః

## సప్తమగ్రంథము - ప్రథమాహ్నిక పాఠము

1 ఉక్తా గుణాః

2 పృథివ్యాది రూపరసగంధస్పర్శా ద్రవ్యానిత్యత్వా దనిత్యత్వాశ్చ

3 ఏతేన నిత్యేషు నిత్యత్వముక్తం

4 అప్సు తేజసి వాయౌ చ నిత్యా ద్రవ్యనిత్యత్వాత్

5 అనిత్యేష్వనిత్యా ద్రవ్యానిత్యత్వాత్

6 కారణగుణపూర్వకాః పృథివ్యాం పాకజాః

7 ఏకద్రవ్యత్వాత్

8 అణోర్మహతశ్చోపలబ్ధ్యనుపలబ్ధీ నిత్యే వ్యాఖ్యాతే

9 కారణబహుత్వాచ్చ
10 అతో విపరీతమణు
11 అణు మహదితి తస్మిన్ విశేషభావాత్ విశేషాభావాచ్చ
12 ఏకకాలత్వాత్
13 దృష్టాంతాచ్చ
14 అణుత్వమహత్త్వయోరణుత్వమహత్త్వాభావః కర్మగుణైర్వ్యా ఖ్యాతః
15 కర్మభిః కర్మాణి గుణైశ్చ గుణా వ్యాఖ్యాతాః
16 అణుత్వమహత్త్వాభ్యాం కర్మగుణాశ్చ వ్యాఖ్యాతాః
17 ఏతేన దీర్ఘత్వహ్రస్వత్వే వ్యాఖ్యాతే
18 అనిత్యేఽనిత్యం
19 నిత్యే నిత్యం
20 నిత్యం పరిమండలం
21 అవిద్యా చ విద్యాలింగం
22 విభవాన్మహానాకాశస్తథాచాత్మా
23 తదభావాదణు మనః
24 గుణైర్దిగ్ వ్యాఖ్యాతా
25 కారణే కాలః

## సప్తమగ్రంథము – ద్వితీయాహ్నిక పాఠము

1 రూపరసగంధస్పర్శ వ్యతిరేకార్థాంతరమేకత్వం
2 తథా పృథక్త్వం
3 ఏకత్వైక పృథక్త్వయోరేకత్వైక పృథక్త్వాభావోఽణుత్వ మహత్త్వాభ్యాం వ్యాఖ్యాతః

4 నిఃసంఖ్యత్వాత్ కర్మగుణానాం సర్వైకత్వం న విద్యతే
5 భ్రాన్తం తత్
6 ఏకత్వాభావాద్భక్తిస్తు న విద్యతే
7 కార్యకారణయో రేకత్వైకపృథక్త్వాభావా దేకత్వైకపృథక్త్వం
న విద్యతే
8 ఏతదనిత్యయోర్వ్యాఖ్యాతం
9 అంతరకర్మజ ఉభయకర్మజః సంయోగజశ్చ సంయోగః
10 ఏతేన విభాగో వ్యాఖ్యాతః
11 సంయోగవిభాగయో సంయోగవిభాగాభావోఽణుత్వమహ
త్త్వాభ్యాం వ్యాఖ్యాతః
12 కర్మభిః కర్మాణి గుణైర్గుణా అణుత్వమహత్త్వాభ్యామితి
13 యుతసిద్ధ్యభావాత్ కారకారణయోః సంయోగవిభాగౌ న
విద్యతే[1]
14 గుణత్వాత్
15 గుణోఽపి విభావ్యతే
16 నిష్క్రియత్వాత్
17 అసతినాస్తీతి చ ప్రయోగాత్
18 శబ్దార్థావసంబంధౌ
19 సంయోగినో దండాత్ సమవాయినో విశేషాచ్చ
20 సామయికః శబ్దాదర్థ ప్రత్యయః
21 ఏకదిక్కాభ్యామేక కాలాభ్యాం సన్నికృష్టవిప్రకృష్టాభ్యాం
పరమపరం చ
22 కారణపరత్వాత్ కారణాపరత్వాచ్చ

23 పరత్వాపరత్వయోః పరత్వాపరత్వాభావోఽణుత్వమహా
త్త్వాభ్యాం వ్యాఖ్యాతః

24 కర్మభిః కర్మాణి

25 గుణైర్గుణాః

26 ఇహేదమితి యతః కార్యకారణయోః స సమవాయః

27 ద్రవ్యత్వగుణత్వప్రతిషేధో భావేన వ్యాఖ్యాతః

28 తత్త్వం భావేన

### అష్టమగ్రంథము - ప్రథమాహ్నికపాఠము.

1 ద్రవ్యేషు జ్ఞానం వ్యాఖ్యాతం

2 తత్రాత్మా మనశ్చాప్రత్యక్షే

3 జ్ఞాననిర్దేశే జ్ఞాననిష్పత్తివిధిరుక్తః

4 గుణకర్మసు సన్నికృష్టేషు జ్ఞాననిష్పత్తేర్ద్రవ్యం కారణం

5 సామాన్యవిశేషేషు సామాన్యవిశేషాభావాత్తత ఏవ జ్ఞానం

6 సామాన్యవిశేషాపేక్షం ద్రవ్యగుణకర్మసు

7 ద్రవ్యే ద్రవ్యగుణకర్మాపేక్షం

8 గుణకర్మసు గుణకర్మాభావాద్గుణకర్మాపేక్షం న విద్యతే

9 సమవాయినః శ్వైత్యాచ్ఛ్వైత్యబుద్ధేశ్చ శ్వేతే బుద్ధిస్తే ఏతే
కార్యకారణభూతే

10 ద్రవ్యేష్వనితరేతరకారణాః

11 కారణాఽయౌగపద్యాత్ కారణక్రమాచ్చ ఘటపటాదిబుద్ధీనాం
క్రమో న హేతుఫలభావాత్

## అష్టమగ్రంథము - ద్వితీయాహ్నిక పాఠము.

1 అయమేష త్వయాకృతం భోజయైనమితి బుద్ధ్యపేక్షం
2 దృష్టేషు భావాదదృష్టేష్వభావాత్
3 అర్థ ఇతి ద్రవ్యగుణకర్మసు
4 ద్రవ్యేషు పంచాత్మకత్వం ప్రతిషిద్ధం
5 భూయస్త్వాద్గంధవత్వాచ్చ పృథివీ గంధజ్ఞానే ప్రకృతిః
6 తథాపస్తేజోవాయుశ్చ రసరూపస్పర్శ విశేషాత్

## నవమగ్రంథము - ప్రథమాహ్నిక పాఠము.

1 క్రియాగుణవ్యపదేశభావాత్ ప్రాగసత్
2 సదసత్
3 అసతః క్రియాగుణవ్యపదేశాభావాదర్థాంతరం
4 సచ్చాసత్
5 యచ్చాన్యదసదతస్తదసత్
6 అసదితి భూతప్రత్యక్షాభావాత్ భూతస్మృతేర్విరోధిప్రత్యక్షవత్
7 తథాఽభావే భావప్రత్యక్షత్వాచ్చ
8 ఏతేనాఘటోఽగౌరధర్మశ్చ వ్యాఖ్యాతః
9 అభూతం నాస్తీత్యనర్థాంతరం
10 నాస్తి ఘటో గేహే ఇతి సతో ఘటస్య గేహసంసర్గప్రతిషేధః
11 ఆత్మన్యాత్మమనసోః సంయోగవిశేషాదాత్మప్రత్యక్షం
12 తథా ద్రవ్యాంతరేషు ప్రత్యక్షం
13 అసమాహితాంతఃకరణా ఉపసంహృతసమాధయస్తేషాం చ

14 తత్సమవాయాత్ కర్మగుణేషు

15 ఆత్మసమవాయాదాత్మగుణేషు

## నవమగ్రంథము - ద్వితీయాహ్నిక పాఠము.

1 అస్యేదం కార్యం కారణం సంయోగి విరోధి సమవాయి చేతి లైంగికం

2 అస్యేదం కార్యకారణసంబంధశ్చావయవాద్భవతి

3 ఏతేన శాబ్దం వ్యాఖ్యాతం

4 హేతురపదేశో లింగం ప్రమాణం కరణమిత్యనర్థాంతరం

5 అస్యేదం బుద్ధ్యపేక్షితత్వాత్

6 ఆత్మమనసోః సంయోగవిశేషాత్ సంస్కారాచ్చ స్మృతిః

7 తథా స్వప్నః

8 స్వప్నాంతికం

9 ధర్మాచ్చ

10 ఇంద్రియదోషాత్ సంస్కారదోషాచ్చావిద్యా

11 తద్దుష్టజ్ఞానం

12 అదృష్టం విద్యా

13 ఆర్షం సిద్ధదర్శనం చ ధర్మేభ్యః

## దశమగ్రంథము - ప్రథమాహ్నిక పాఠము.

1 ఇష్టానిష్టకారణవిశేషాద్విరోధాచ్చ మిథః సుఖదుఃఖయోరర్థాంతరభావః

2 సంశయనిర్ణయాంతరభావశ్చ జ్ఞానాంతరత్వే హేతుః
3 తయోర్నిష్పత్తిః ప్రత్యక్షలైంగికాభ్యాం
4 అభూదిత్యపి
5 సతి చ కార్యాదర్శనాత్
6 ఏకార్థసమవాయికారణాంతరేషు దృష్టత్వాత్
7 ఏకదేశే ఇత్యేకస్మిన్ శిరః పృష్ఠముదరం మర్మాణి తద్విశేష
స్తద్విశేషేభ్యః

దశమగ్రంథము – ద్వితీయాహ్నిక పాఠము.

1 కారణమితి ద్రవ్యే కార్యసమవాయాత్
2 సంయోగాద్వా
3 కారణే సమవాయాత్ కర్మాణి
4 తథా రూపే కారణైకార్థసమవాయాచ్చ
5 కారణసమవాయస్య సంయోగః పరస్య
6 కారణకారణసమవాయాచ్చ
7 సంయుక్తసమవాయాదగ్నేర్వైశేషికం
8 దృష్టానాం దృష్టప్రయోజనానాం దృష్టాభావే ప్రయోగోఽ
భ్యుదయాయ
9 తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యమితి



# వైశేషిక సిద్ధాంత విచారము

ఇంతవరకు శ్రీకణాదప్రోక్తమగు వైశేషిక ప్రాశస్త్య మునుగూర్చి యిసుమంత వ్రాయబడియున్నది. ఇక నీ సిద్ధాంతమున ముఖ్యసమస్యలగు ఈశ్వర జీవ ప్రకృతుల విచార మెట్లు చేయబడియున్నదియు, సృష్టి యేవిధముగా నేర్పడి నదియు మొదలుగాగల విషయముల గ్రహింప యత్నించెదము గాక.

## ద్రవ్యపరీక్ష – ద్రవ్యము

The Nyaya and Vaiseshika take up respectively the world within and the world without న్యాయ వైశేషికములు అంతర బాహ్యప్రపంచములగూర్చి ప్రసంగించు చున్నట్లు కాణాదసిద్ధాంతము, ఉపోద్ఘాతమున వివరింపబడినదెరం గున, దృగ్గోచరములగు స్థూలభూతములతో బ్రారంభించి, అమూర్తములగు కాలాదులను వాని వస్తుగుణకర్మాదులగూర్చి మీమాంసించియున్నది. 'ద్రవ్యగుణకర్మ సామాన్యవిశేష సమవాయానాం పదార్థానాం సాధర్మ్యవైధర్మ్యాభ్యాం తత్త్వ జ్ఞానాన్నిః శ్రేయసం' (వై. సూ. 1.1.4) పదార్థములయొక్క ద్రవ్యాది షట్పదార్థముల సాధర్మ్యవైధర్మ్యములతో గ్రహించుట తత్త్వజ్ఞానమనియు, నా తత్త్వజ్ఞానమువలన 'నిఃశ్రేయసమాత్యం తికీ దుఃఖనివృత్తిః' (వై. సూ. ఉ. 1.1.2) అత్యంతదుఃఖనివృత్తి నాబడు నిఃశ్రేయససిద్ధియనియు వైశేషికతాత్పర్య మగుటచే,

కణాదఋషీంద్రుడు నిఃశ్రేయసప్రాప్తి కుపాయమగు ధర్మ నిర్వచనము గావించి తద్గమ్యమగు తత్త్వజ్ఞానమును బ్రతిపాదించి, గ్రంథారంభముననే తత్త్వజ్ఞాన సామగ్రియగు ద్రవ్యాదుల బ్రవేశపరచుట యెంతయు సముచితముగనున్నది. ప్రథమముననే 'పృథివ్యాపస్తేజో వాయురాకాశం కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి' (వై. సూ. 1.1.5) ఇంద్రియగోచరమగు సృష్టి కాధారభూతములగు ద్రవ్యములు పై తొమ్మిదిమాత్రమే యనియు, వానికి 'క్రియాగుణవత్ సమవాయికారణమితి ద్రవ్య లక్షణం' (వై. సూ. 1.1.15) క్రియాగుణవిశిష్టమై సమవాయి కారణమైనది గాన ద్రవ్యపద ముపయుక్తమని విచారణము ప్రారంభింపబడియున్నది. అందును 'తత్ పునః పృథివ్యాదికార్య ద్రవ్యం' (వై. సూ. 4 2.1) పృథివ్యాద్యులను కార్యద్రవ్యములని సూచించినట్లు ఆ ద్రవ్యములు కార్యకారణరూపమున ద్వివిధమనియు అని 'న ద్రవ్యం కార్యం కారణం చ వధతి' (వై.సూ.1.1.12) ద్రవ్యము కార్యకారణములచే నశింపబడదనియు వాక్రుచ్చి, ఆద్రవ్యముల నాశ్రయించియున్న గుణ, కర్మ, సామాన్య,విశేష సమవాయవిచారమును బ్రారంభించెను. కణాదప్రతిపాదిత ద్రవ్యనవకముతో, సాంఖ్యులు కొందరు తమమును, సువర్ణమును మీమాంసకులు జేర్చి ద్రవ్యములుగా గైకొనిరి. కణాదునిదృష్టికది అసమంజసముగా దోచియుండనోపు,కాన నతడు యీసూత్రాంతమున 'ఇతి' అనిమాత్రమే పదప్రయోగము గావించి సంశయ నివారణ మొనరించియుండినట్లు విదితము. ఈవిషయమునే తన ఉత్తరగ్రంథములో 'ద్రవ్యగుణకర్మనిష్పత్తివైధర్మ్యాదభావ స్తమః' (వై. సూ. 5.2.19) ద్రవ్యగుణకర్మల గలుగు జేయుటలో

వైధర్మ్యముండుటచేత, అనగా అశక్తమైయుండుటచేత నీతమము, అభావరూపమే యగునని స్పష్టపరచియున్నాడు. మరియు దాని నైజమును దెల్పుచు, 'తేజసో ద్రవ్యాంతరేణావరణాచ్చ' (వై. సూ. 5.2.20) మరొక పదార్థముచేత బ్రకాశము ఆవృత మగుటచేతనే తమ మేర్పడుచున్నది. కాన అది కేవలము అభావ రూపమనియు కాని అది దశమద్రవ్య మనిపించుకొనుట కధికారము లేదనియు దీర్మానించియున్నాడు. ఇక సువర్ణమన్ననో 'అనిత్య ఇతి విశేషతః ప్రతిషేధభావః' (వై సూ. 4.1.4) ముఖ్యముగా ప్రతిషేధము, అనగా విరుద్ధభావము గలదియే అనిత్యమని నిర్వచించు సూత్రమునను సరించి వివృత్తికారులగు జయనారాయణ తర్కపంచాననులు వచించుచున్నట్లు 'తథా చావయవీ న నిత్య ఇతి' (వై. సూ. వి. 4.1.4) అంత అవయవములు గలది నిత్యముకాదు అనుటచే అవయవియైయున సువర్ణాదిక లోహ పదార్థములు నిత్యములగు ద్రవ్యములుగా పరిగణింప బడజెల్లవు.

## గుణము

పైవిధాన సూచింపబడియున్న తొమ్మిదిద్రవ్యములకు 'రూపరసగంధస్పర్శాః సంఖ్యాః పరిమాణాని పృథక్త్వం సంయోగవిభాగే పరత్వాపరత్వే బుద్ధయః సుఖదుఃఖే ఇచ్ఛాద్వేష ప్రయత్నాశ్చ గుణాః' (వై. సూ. 1.1.6) మొదలగు గుణములును, సూచింపబడని గురుత్వద్రవత్వస్నేహసంస్కార ధర్మాధర్మశబ్దము (వై. సూ. ఉ. 1.1.6) కూడ 'చ'లో చేర్చి వచింపబడినవి. నైజమున 'ద్రవ్యాశ్రయగుణవాన్ సంయోగవిభాగేష్వకారణమనపేక్ష ఇతి గుణలక్షణం' (వై. సూ.

1.1.16) ద్రవ్యము నాశ్రయించి యుండునదియు, గుణరహిత మైనదియు, సంయోగవిభాగములకు కారణముగాక, వానితో నెట్టి సంబంధము లేనిదియు గుణముగా నిర్వచింపబడియున్నది. ఈగుణములు కార్యకారణములలో రెంటిచేతను 'ఉభయథా గుణాః' (వై. సూ. 1.1.13) అనునట్లు నశించినవియైయుండును. అందును 'పృథివ్యాదిరూపరసగంధస్పర్శా ద్రవ్యానిత్యత్వాదనిత్యత్వాచ్చ' (వై. సూ. 7.1.2) పృథివ్యాదులయొక్క రూపరస గంధాదిగుణములు ఆయాద్రవ్యములయొక్క నిత్యత్వానిత్యత్వములపై నాధారపడుచు, అవియు నిత్యానిత్యములై యొప్పారును. అనగా 'ఏతేన నిత్యేషు నిత్యత్వముక్తం' (వై. సూ. 7.1.3.) నిత్యములలో వానికి నిత్యత్వము గలదు. 'అనిత్యేష్వనిత్యా ద్రవ్య నిత్యత్వాత్' (వై. సూ. 7.1.5) అనిత్యద్రవ్యములలో నవి అనిత్యములుగా నుండును.

## భూతగుణము

ఇక నేయేద్రవ్యముల కేయే గుణములున్నవో కొంచెము విచారింతము. 'రూపరసగంధస్పర్శవతీ పృథివీ' (వై. సూ. 2.1.1) రూపరసగంధస్పర్శములు పృథివికి గుణములు. 'రూపరసస్పర్శవత్య ఆపో ద్రవాః స్నిగ్ధాః' (వై. సూ. 2.1.2.) రూపరసస్పర్శములును ద్రవత్వస్నేహములు జల లక్షణములు. 'తేజో రూపస్పర్శవత్' (వై. సూ 2.1.3) తేజస్సుకు రూప స్పర్శములు గలవు. 'స్పర్శవాన్ వాయుః' (వై. సూ. 2.1.4)

స్పర్శగుణముగలవాడు వాయువు. ఇక అయిదవభూతమనబడు ఆకాశమునందు 'త ఆకాశే న విద్యంతే' (వై. సూ. 2 1.5) యీగుణము లెవ్వియును అభావము.

పైనుదాహరింపబడిన గుణములలో 'వ్యవస్థితః పృథివ్యాం గంధః' (వై. సూ. 2.2.2) గంధము పృథ్వియొక్క గుణమని తీర్మానింపబడినది. అట్లే 'ఏతేనోష్ణతా వ్యాఖ్యాతా' (వై. సూ. 2 2.3)' తేజస ఉష్ణతా' (వై. సూ. 2.2.4) తేజస్సునకు ఉష్ణత్వము లక్షణమనియు దీర్మానము. 'అప్సు శీతతా' (వై. సూ. 2.2.5) జలమునకు శీతలత్వము గుణము. 'స్పర్శశ్చ వాయోః' (వై. సూ. 2. 1 9) మరియు స్పర్శము వాయు లక్షణము. ఈ స్పర్శాదిలక్షణములు ఆయా భూతముల నిజ లక్షణములని యర్థము. వీనిలో 'న చ దృష్టానాం స్పర్శ ఇత్య దృష్టలింగో వాయుః' (వై. సూ. 2. 1. 10) అనురీతి దృగ్గోచరవస్తువుల స్పర్శముకాక వాయువునకు అగోచరలక్షణము గలదు. అందుచేత వాయువు 'అద్రవ్యవత్త్వేన ద్రవ్యం' (వై. సూ. 2. 1. 11) అద్రవ్యలక్షణముగలది కాన వాయువు ద్రవ్యము. అట్లైన యితరములు కావా? అని సందేహింప, 'ద్రవ్యానాశ్రితమిత్యర్థః' వాయువు యితర ద్రవ్యముల గలిగి లేదని ఉపస్కారకారుడు వివరించియున్నాడు. అనగా 'అద్రవ్యవత్త్వేన నిత్యత్వముక్తం' (వై. సూ. 2. 1. 13) అను సూత్రవిధానమున వాయువు యితరద్రవ్యముల సంపర్కములేనిదిగాన నిత్యమని చెప్పబడును. దీనిననుసరించి, అగ్ని జల పృథ్వీభూతములు 'ద్రవ్యం హి సమవాయికారణాసమవాయికారణాంతర

నాశాన్నశ్యతి' (వై. సూ. ఉ. 2. 1. 13) ద్రవ్యము తన సమవాయి అసమవాయి కారణములలో నేది నశించినను, నశించునుగాన, 'పృథివ్యాదిరూపరసగంధస్పర్శాద్రవ్య నిత్యత్వా దనిత్యత్వాశ్చ' (వై. సూ. 7.1.2) పృథివ్యాదులకుగల రూపరసగంధస్పర్శాది గుణములు అనిత్యద్రవ్యముల నాశ్రయించుచో అనిత్యద్రవ్యములుగను, 'ఏతేన నిత్యేషు నిత్యత్వముక్తం' (వై. సూ. 7.1.3) నిత్యవస్తువుల నాశ్రయించినచో నిత్యములునై విరాజిల్లుచుండును. మరియు వాయువునలె నదృష్టమై కారణద్రవ్యమనబరగు నాకాశలక్షణమునుగూర్చియు నిసుమంత విచారింతము. 'నిష్క్రమణం ప్రవేశనమిత్యాకాశస్య లింగం' (వై.సూ. 2.1.20) ప్రవేశ నిష్క్రమణముల కవకాశమొసంగునది ఆకాశలక్షణములుగ వైశేషికవచనమైనను, కర్మ మూర్తద్రవ్యముల నాశ్రయించునది కాన (వై. సూ. వి. 2.1 21) ఆకాశలక్షణమును కర్మపొందనేరదనియు (వై. సూ. వి. 2.1.2 ) సమవాయికారణముగనే కాక అసమవాయికారణముగనైన ప్రవేశనిష్క్రమణాది కర్మలు ఆకాశధర్మముల దెలుపనేరవనియు, (వై. సూ. ఉ. 2.1.22) నిమిత్తకారణరూపముననైన ఆ కర్మలాకాశముయొక్క యునికిని కనిపెట్టజాలవనియు (వై. సూ. వి. 2.1.23)వక్కాణించి, 'కారణగుణపూర్వకః కార్యగుణో దృష్టః' (వై. సూ. 2.1.24) కార్యగుణము కారణగుణములో బూర్వమే యిమిడియున్నది. కాన 'కార్యాంతరాప్రాదుర్భావాచ్చ శబ్దః స్పర్శవతామగుణః' (వై. సూ. 2 1 25) కార్యాంతరము లేకుండుటచే శబ్దము స్పర్శాదులవలె గుణముకాదని నిరూపింపబడినది. అనగా శబ్దము గంధాదులవలె మేవస్తువుల నాశ్రయింపక

'తస్మాన్న స్పర్శవద్విశేషగుణః శబ్దః' (వై. సూ. ఉ. 2.1.25) అని ఉపస్కారకర్తలు వచించినట్లు శబ్దము స్పర్శాదులవలె గుణముకాదు. అది ఆత్మయొక్క గుణమును కాదు. మనస్సుయొక్క గుణముకూడకాదు (వై. సూ. 2.1 26). కావున ఆ శబ్దము 'పరిశేషాల్లింగమాకాశస్య' (వై. సూ. 2.1 27) ఆకాశమునకు ఏగుణమును వచింపబడకుండుటచే నది ఆకాశము యొక్క గుణము. అందుచేతనే 'శబ్దలింగా విశేషాద్విశేష లింగాభావాచ్చ' (వై. సూ. 2.1.30) శబ్దము దేనియొక్క గుణముగ నింతవరకు నిర్ణీతముకాకుండుటయు, ఆకాశమున కేగుణమును తెలుపబడియుండకపోవుటచేత, ఆకాశమునకు శబ్దము లక్షణము. ఇంద్రియములలో జ్ఞానక్రియార్థము ఇతరేంద్రియముల గ్రహణమునకు విషయములున్నను, శ్రోత్రమునకు 'శ్రోత్రగ్రహణో యోఽర్థః స శబ్దః' (వై. సూ. 2.2.21) శ్రోత్రగ్రహణమునకు అర్థము శబ్దము అని తెలుపబడినది. ఆ శబ్దము ఒక ద్రవ్యములో మాత్రముండుటచేత ద్రవ్యము కాదు. (వై. సూ. 2.2.23) 'నాపి కర్మాచాక్షుషత్వాత్' (వై. సూ. 2.2 24) కర్మవలె నదృష్టమైయున్నను కర్మయును కాదు కాని యితరద్రవ్యలక్షణములకును శబ్దమునకును ఒక తారతమ్యము గలదు 'నిత్యవైధర్మ్యాత్' (వై. సూ. 2.2 27) నిత్యముకాక ఉచ్చారణానంతర స్థితిగలది. 'అనిత్యశ్చాయం కారణతః' (వై. సూ. 2.2.28) కారణమునగలదికాన శబ్దము అనిత్యము. 'లింగాచ్చానిత్యః శబ్దః' (వై. సూ. 2.2.32) అనగా 'వర్ణాత్మకః శబ్దోఽనిత్యః, జాతిమత్త్వే, సతి శ్రోత్రగ్రాహ్యత్వాత్ వీణాదిధ్వనివదిత్యర్థః' (వై. సూ. ఉ. 2.2.32)

వర్ణాత్మకముగాన శబ్దము అనిత్యము. మరియు వీణాదిధ్వన్యాదులవలె శ్రోత్రగ్రాహ్యమై యుండుటచే ననిత్యమైయున్నది.

## కాలదిగాత్మమనములు

ఇట్లు పంచభూతగుణ మీమాంస చూచితిమి. ఇక అప్రత్యక్షములును అస్థూలములును అగు 'కాలో దిగాత్మా మన' యనబడు నాలుగు సూక్ష్మద్రవ్యగుణముల గ్రహింప యత్నింతము. పృథివ్యాది ఆకాశపర్యంత ద్రవ్యములు బాహ్యేంద్రియములగు శ్రోత్రాది యింద్రియగోచరములుగాన నవి బాహ్యగోచరములై యుండును. అందుచేతనే అవి బహిర్ద్రవ్యములు నాబడినవి. అందు ప్రథమత్రయము క్రమముగా స్థూలము నుండి సూక్ష్మములగుచున్నవి. వాయువు తన గుణమును మాత్రమే గోచరింపజేయుచు నిత్యద్రవ్యముగా పరిగణింపబడినది. ఆకాశమన్నచో సంపూర్ణముగ నతీంద్రియమై తన గుణమునుగూడ సందిగ్ధావస్థలోనుంచి, శబ్దము ఆకాశలక్షణమా కాదా అను సందేహమున దాగియున్నది. కాని అది పంచభూతములలో నుత్కృష్టమై 'విభవాన్మహానాకాశ స్తథా చాత్మా' (నై. సూ. 7.1.22) అనుచందము సర్వవ్యాప్తమై అనంతమైన దిగా నుండి ఆత్మయు నింతియయని సూచించుచున్నది.

## కాలము

ఆ విధమునగూడ గాక కాలదిగాత్మమనములు అస్థూలములై, అనిర్దేశ్యములై యున్నవి. అందు 'అపరస్మిన్నపరం యుగపత్ చిరం క్షిప్రమితికాలలింగాని' (నై. సూ. 2.2.6)

పూర్వము, సమానము, మందగతి, త్వరితగతి, కాలముయొక్క గుణముగా నిర్దేశింపబడినవి. 'తస్మాదేతాదృశవిశిష్టప్రత్యయాన్యథానుపపత్త్యా విశేషణప్రాపకం యత్ ద్రవ్యం స కాలః' (వై. సూ. ఉ. 2.2.6) ఏద్రవ్యము యిట్టిభావముల నిర్ధారణముచేయునో, లేకున్న వానియునికికే యవకాశ ముపపన్నము కాదు గాన, అట్టిద్రవ్యమే కాల మన బరగును. 'ద్రవ్యత్వనిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే' (వై. సూ. 2.2.7) కాలముయొక్క ద్రవ్యత్వ నిత్యత్వములు వాయువిచారణము వలెనే తీర్మానము. 'కారణే కాలః' (వై సూ. 7.1.25) సూత్రానుసారముగ కాలమే సర్వకారణముగ నున్నది. అనగా కాలము పూర్వోక్తరీతి పరాపరరూప భావజాలములకు కారణమై యున్నది. ఈ భావములు సర్వతః వ్యాప్తములుగాన కాలము సర్వవ్యాపకమనబరగినది. కాలమునకే కారణత్వము గూడ, నన్వయము. కాని 'నిత్యేష్వ భావాదనిత్యేషు భావాత్ కారణే కాలాఖ్యేతి' (వై. సూ. 2.2.9) కాలము నిత్యమై యున్నను, నిత్యములకు గారణముగాక ననిత్యములకుమాత్రమే కారణమగుచున్నది. నిత్యములగు నాకాశాదుల కుద్భవమే లేకుండుటచే మందత్వత్వరితత్వములుగాని, మరి యేయితర కాల గుణములుగాని వానికి అన్వయింపవు. కాని అనిత్యములగు ఘటపటాదులకు 'సర్వోత్పత్తిమన్నిమిత్తకారణం' (వై. సూ. ఉ. 2.2.9) అను వాక్యరీతి ఉత్పాద్యములగు సర్వమునకు గాలము నిమిత్తకారణమై యొప్పారుచున్నది. ఇట్లు దీనికి నిమిత్త కారణత్వము ప్రత్యక్షముగ గోచరింపకున్నను, సూక్ష్మదృష్టి గోచరముగాన సమ్మతింపవలసియుండును.

## దిక్

అటులనే కణాదునిచేత దిక్కుకూడ నొక ద్రవ్యముగా చేర్కొనబడియున్నది. 'ఇత ఇదమితి యత స్తద్దిశ్యం లింగం' (వై. సూ. 2.2.10) అది యిది యనునవి దిక్కుయొక్క గుణములు. అనగా రెండువస్తువులు ఒకేకాలమున రెండుస్థానముల నున్నప్పుడు, వాని దూరత్వ సన్నిహితత్వముల ననుసరించి అది ఇది యను వ్యవహార ముత్పన్నమగుచున్నది. దిక్కు పూర్వోక్త వాయ్వాకాశములవలె 'ద్రవ్యత్వనిత్యత్వే వాయునా వ్యాఖ్యాతే' (వై. సూ. 2.2.11) ద్రవ్యత్వనిత్యత్వములుగలిగి 'తత్త్వం భావేన' వై. సూ 2.2.12) అనునట్లు ఏకమైయున్నది. దిశ యిట్లేకముగ నొప్పారినను 'ఆదిత్యసంయోగాద్భూత పూర్వాద్భవిష్యతో భూతాచ్చ ప్రాచీ' (వై. సూ. 2.2.14) సూర్యసంబంధముచేత భూతభవిష్యద్వర్తమానముల వలన పూర్వపశ్చిమాది దిక్కులు ఏర్పడుచున్నవి. 'ప్రాక్ అస్యాం సవితా అంచతీతి ప్రాచీ' (వై. సూ. ఉ. 2.2.14) అచ్చటనుండి సూర్యుడు ముందుగనపడుచునుండుటచే ప్రాచీదిశయనబడెను. తదను సారముగా మేరువునకు పశ్చిమమునకు సూర్యుడు ప్రయాణించు చున్నప్పుడు ప్రథమతః త్రికాలములలో సంబంధించు ప్రథమదిక్కునకు పూర్వ లేక ప్రాచీయనియు నామమేర్పడెను. అట్లే 'తథా దక్షిణా ప్రతీచీ ఉదీచీ చ' (వై. సూ. 2.2 15) దక్షిణ పశ్చిమోత్తరరూపములుగా దిక్కు విభజింపబడినది. అదే విధముగా దిగంతరాళములగు నీశాన్యాది దిక్కులుకూడ సూర్యభ్రమణము ననుసరించియే ఏర్పడుచున్నవి. అయినను

యథార్థమునకు నేకమై అనంతమై మాత్రమే యున్నది. ఈ విషయవివరణము గావించుచు, 'గుణైర్దిగ్ వ్యాఖ్యాతా' (వై. సూ. 5.2.25) తన గుణముచేత దిక్కు అనంతము; దిక్కుతో నేర్పడుచున్న పరాపరాదులును, దశదిశాది విభేదములును, 'తస్యా నానాత్వకల్పనా చ కల్పనాగౌరవప్రతిహతేత్యుక్తం' (వై. సూ. ఉ. 7.1.25) కేవలము కల్పనచేయుని ఉపస్కారకారుడు వాకొనియున్నాడు. కాని నీకల్పనల కన్నింటికి నధిష్ఠానమై యుండు దిక్కు అనంతమైనదే యగును.

**Space deals with co-existence, time with successions, or more accurately space deals with visible objects, while time deals with things produced and destroyed.** దిక్కు సమకాలికత్వమును, కాలము కాలక్రమత్వమును దెలుపును. అనగా దిక్కు స్థూలగోచరములను, కాలము ఉత్పత్తివినాశములను, విశదపరచునని రాధాకృష్ణపండితుడు వివరించియున్నాడు. (Indian Philosophy vol.2). అందుచేతనే 'జన్యమాత్రం క్రియామాత్రం వా కాలోపాధిః మూర్తిమాత్రం దిగుపాధిః' ఉత్పత్తిక్రియలకు గాలముపాధియు, మూర్తిమంతములకు దిక్కు ఉపాధియు నగుచున్నది. అంతియగాక **Sankara Misra holds that relations of time are constant, while those of space are not constant. Things move by virtue of time and hold together by virtue of space.** (Indian Philosophy vol. 2) కాలసంబంధములు నిత్యములును, దిక్సంబంధములు అనిత్యములై యుండును, కాలవశమున బదార్థములు సంచరించును, దిగ్వశమున అనుసంధింపబడియుండును, అని శంకరమిశ్రుని అభిప్రాయముగా రాధాకృష్ణులు

వచించెను. ఈవిధముగా దిక్కాలద్వయము వస్తుకోటికి నిమిత్త కారణములై యుండును (వై.సూ. 7.1.25) అని తాత్పర్యము.

ఇంతవరకు వివరింపబడిన ద్రవ్యములు బాహ్యములగుట వైశేషికమునకు సంతద్రవ్యము లేదు యని గొందరి అభిప్రాయము. కాని ఆత్మమనములగూడ గణాదుడు చేర్చియుండుటచే వాని లక్షణములగూడ నాకించుక బరిశీలింతముగాక.

## మనము

ఆత్మమనములలో నాత్మ మనముకంటె నవ్యక్తముగాన ప్రథమమున మనమునుగూర్చి విచారింతము. 'ఆత్మేంద్రియార్థ సన్నికర్షే జ్ఞానస్య భావోఽభావశ్చ మనసో లింగం' (వై. సూ. 3.2.1) ఆత్మేంద్రియములకుగల సంబంధముచే నేర్పడుచున్న జ్ఞానముయొక్క భావాభావములే మనస్సుయొక్క గుణములు. 'మనోగతిమాత్మనో లింగం' (వై. సూ. ఉ. 3.2.1) అను ఉపస్కార నిర్వచనమురీతి మనస్సుయొక్క గమనమే ఆత్మాస్తికతా నిరూపణమునకు లక్షణము. మనస్సు అంతరమైన ఆత్మతో డను, బాహ్యమైన వస్తువుతోడను, ఎప్పుడు సంబంధమేర్పరచు కొనునో అప్పుడే బాహ్యవస్తుజ్ఞాన మేర్పడును. ఆవస్తుజ్ఞానము తోడనే మనస్సుయొక్క యునికి నిర్ధారణ మగుచున్నది. కాల మువలె ప్రత్యేకలక్షణములేని ద్రవ్యమగుటచేతను, (వై. సూ. ఉ. 3.2.1) ఆత్మవలె జ్ఞానమునకు అసమవాయికారణమునకును సంయోగాధార మగుటవలనను, ఆకాశమువలె శబ్దగుణములేని

దగుటచేతను (న్యై. సూ. ఉ. 3.2.1) మనస్సు సర్వవ్యాప్తమను టకు వీలులేదు. అట్లు మనస్సు సర్వవ్యాప్తమగుచో నది సర్వేంద్రియములతో నేకకాలసంబంధి యగుటచే నొకజ్ఞాన ముత్పన్నమై ఆ జ్ఞానము సర్వేంద్రియసన్నికృష్టజ్ఞానరూపమై యుండ వలయును. అట్లుకాక ఏకేంద్రియార్థజ్ఞానము కలుగుచున్నది గాన మనస్సు వ్యాప్తముకాదు. ఏకకాలమున గోచరించు వివిధేంద్రియజ్ఞానములును, యథార్థమున ఏకకాలికములుగాక, క్రమగతములై యుండును. ఫలమును భుజించుకాలమున దాసనుచియేగాక, గంధము, స్పర్శము రూపము ఏకకాలమున గోచరించినట్లున్నను, ఆయాజ్ఞానములు క్రమగతములే యగు చున్నవి 'శీఘ్రసంచారి మనోఽణుస్తేషు' (న్యై సూ. ఉ. 3.2.1) శీఘ్రగమనముగల మనస్సువలన గ్రమముగాగలిగి 'స్మృత్యాప నీతజ్ఞానేషు' స్మృతివలన జ్ఞానమును గలుగజేయుచున్నవి. అందుచే మనస్సు 'తదభావాదణు మనః' (న్యై. సూ. 7.1.23) సర్వవ్యాపకత్వలోపమువలన అణుపరిమాణము గలదియే యగు చున్నది. సర్వవ్యాపకత్వమునకు దగిన యాధారములు లేమిచే అణుపరవ్యాప్తముగలదియే యగుచున్నది. అట్లైనను మనస్సు యొక్క ద్రవ్యత్వ నిత్యత్వములు వాయువునోలె గ్రాహ్యము (న్యై. సూ. 3.2 2). అనగా అది నిత్యమైనదే అగుచున్నది. ఆత్మయొక్క సుఖదుఃఖాదికజ్ఞానమున కది యుపకరణమై, యింద్రి యార్థప్రవృత్తికి గ్రియారూపమైనదగుటచే మనస్సు ద్రవ్యత్వ నిత్యత్వములు లేనిదని సందేహింపనచ్చును. కాని స్థూలవాయువు ననుసరించి నిత్యమైన వాయువుయొక్క అణువు గుణకర్మ విశిష్ట మైనదని నిరూపింపబడినట్లు, తత్కాలిక వివిధ జ్ఞానములు లేకుం

డుటచే, గుణములు గలదగుటచే మనస్సు ద్రవ్యమే యగును. జ్ఞానేంద్రియసంయుక్తము కాకున్నచో మనస్సు జ్ఞానజనకము కాదు. మరియు సుఖదుఃఖాదిక సాక్షాత్కారమునకు, యింద్రియకరణత్వ ముపపన్నము. రూపాదులవలె సుఖాదులుగూడ సాక్షాత్కారరూపములే గదా! కావున మనస్సునకు యింద్రియత్వము సిద్ధము. జ్ఞానకారణమునకును, మనస్సునకు గల సంధానమునకు నాశ్రయమైనదే యింద్రియము నాబడును. అందుచేత మనస్సు యింద్రియార్థప్రవృత్తి కాశ్రయమై యుండుటచే ద్రవ్యముగా స్వీకరింపబడినది. దాని కేయాశ్రయము లేకుండుటచే నది నిత్యత్వమును సాధించినదాయెను. మరియు నిది 'ప్రయత్నాయౌగపద్యాత్ జ్ఞానాయౌగాపద్యా చ్చైకం' (వై. సూ. 3.2.3) ప్రయత్నములయొక్కయు, జ్ఞానములయొక్కయు, ఏకకాలికత్వము లేకుండుటచే మనస్సు ఏకమే. అనగా నొక్కొక్క శరీరములో ఒక్కొక్క మనస్సే యుండునుగాని, అనేకము కాదని భావము. అనేకముగనున్నచో ఏకకాలమున ననేక ప్రవృత్తులు జ్ఞానములు గలుగుచుండవలసియుండును. అట్లు జరుగుటలేదు. ఏకకాలమున జరుగు కరచరణాద్యవయవ ప్రవృత్తియు క్రమగతికములేగాని, ఏకకాలికములు కావు. అందుచే ఒక్కమనస్సే ఒక్క శరీరము నాశ్రయించి యుండును. ఆయినను 'తత్రాత్మా మనశ్చాప్రత్యక్షే' (వై. సూ. 8.1.2) అచ్చట ఆత్మమనములు అపరోక్షములై అగోచరములైయుండునను సూత్రవిధానమున మనస్సు యింద్రియముల కప్రత్యక్షమై శరీరమున నుండును.

## ఆత్మ

ద్రవ్యనవకమున జివరిదగు ఆత్మవిషయము నెఱుంగుదము గాక. పూర్వోక్తరీతి 'మనోగతిమాత్మనోలింగం' (వై. సూ. ఉ. 3.2.1) మనోప్రవృత్తి ఆత్మయొక్క యునికిని సూచించును. మరియు నీ మనస్సు యింద్రియములద్వారా విషయముల నాత్మ కెఱుకపరచును. అందుచే నావిషయార్థజ్ఞానకార్యములో బాహ్యముగ గోచరించు పదార్థములేగాక 'ఇంద్రియార్థప్రసిద్ధిరింద్రియార్థేభ్యోఽర్థాంతరస్య హేతుః' (వై. సూ. 3.1 2) ఇంద్రియార్థముల ప్రసిద్ధివలన వీనికన్యమగు మరొక వస్తువు వీనిని గ్రహించునదిగా యున్నదని తెలియుచున్నది. అనగా నిచ్చట విషయములు ఇంద్రియములు మనస్సుమాత్రమే గాక, జ్ఞానకార్యమున కొక అధిష్ఠాత యున్నట్లువ్యక్తము. అనగా యింద్రియార్థప్రసిద్ధి మరొక పదార్థములో కార్యము గనో, గుణముగనో, క్రియగనో ఆశ్రయించియుండవలెను. కాని జ్ఞానక్రియ క్రియారూపముగాన నది యింద్రియజన్యమై యుండవలెను. ఇంద్రియమన్ననో కేవల ముపకరణమే కావున దాని నుపయోగించుకర్త యొకడవసరము. అందుచే 'యత్రేయం ప్రసిద్ధిరాశ్రితా యః ఘ్రాణాదీనాం కారణానాం ప్రయోక్తా స ఆత్మా' (వై. సూ. ఉ. 3.1.2) దేనిలో నింద్రియార్థ ప్రసిద్ధి యుండునో, ఏది శ్రోత్రాదీంద్రియముల నియోగించునో అది ఆత్మయై విరాజిల్లుచున్నది. అట్లుకాక శరీరేంద్రియాదులు యీ ప్రసిద్ధి కాశ్రయమగుట కెట్టి యవకాశమును గాన్పింపదు. ప్రకాశజ్ఞానమును దీపిక ఎట్లొసంగుటలేదో, అట్లే యింద్రి

యార్థజ్ఞానము దేహేంద్రియాదులవలన కలుగుట అసంబద్ధము. దేహాదులు అచేతనములుగా నుండుటచే చేతనకారకమగు జ్ఞానక్రియ వానివలన నేర్పడదని 'కారణాజ్ఞానాత్' (వై.సూ. 3.1.4) యీ కారణము లజ్ఞానములగుటచేతనని సూత్రము వివరించుచున్నది. అజ్ఞానకారణమున జ్ఞానోత్పత్తి కలుగనుగదా! కార్యమునగల చేతనక్రియ అజ్ఞానకారణమున నిమిడియుండునా? అందుచేత జ్ఞానక్రియకు దేహేంద్రియాది అచేతనాంశములు అధిష్ఠానముగాక 'అన్య దేవ హేతురిత్యనపదేశః' (వై. సూ. 3.1.7) మరొక కారణముండవలెను. అదియే ఆత్మ. 'ఆత్మేంద్రియార్థ సన్నికర్షాత్తావత్ జ్ఞానముత్పద్యతే' (వై. సూ. ఉ. 3.1.18.) ఆత్మేంద్రియసంబంధముచేత జ్ఞానముద్భవించుచున్నది. కాన జ్ఞానము ఆత్మకు ద్వివిధముల లింగమై యొప్పారును. అది కార్యమైయుండుటచే చేతన వస్త్వాశ్రయమును బొంది యుండవలెను. మరియు నది ప్రత్యభిజ్ఞయనబడు స్మృతిరూపమున నొకనిలో నిమిడియుండవలెను. అనగా స్మృతిజ్ఞానములకు ఒకే కర్త యుండవలయునుగదా! 'ఆత్మేంద్రియార్థసన్నికర్షే జ్ఞానస్య భావోఽభావ మనసో లింగం' (వై. సూ. 3.2.1) అను రీతి ఆత్మేంద్రియార్థముల సంబంధమున్నను, జ్ఞానముయొక్క యునికిలేములు మనస్సుయొక్క లక్షణము అయియుండ మరల నాజ్ఞానమే ఆత్మలక్షణముగ నుండును.

మరియు, 'ప్రాణాపాన నిమేషోన్మేషజీవనమనోగతీంద్రియాంతరవికారాః సుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్నాశ్చ చాత్మనో లింగాని' (వై. సూ. 3.2.4) ప్రాణాపానములు, నిమేషోన్మేషనములు, జీవనము, మనోగతి, ఇంద్రియాంతరవికార

ములు, సుఖదుఃఖములు, ఇచ్ఛాద్వేషములు, ప్రయత్నము, ఆత్మగుణములు. ఈసూత్రమువలన బూర్వోక్తమైన జ్ఞానము మాత్రమేగాక, ఆత్మగుణము లనేకములు గ్రాహ్యములు. ఇతర కార్యము లెట్లు ప్రయత్నములేక జరుగుటలేదో అట్లే ప్రాణా పానములుగూడ యత్నజన్యములే. కాని వానికి బ్రత్యక్షముగా నేకర్తయు గోచరించుట కానము కాని 'యః ప్రయత్నేన వాయుమూర్ధ్వమధో వా ప్రేరయతి' (వై. సూ. ఉ. 3.2.4) ఎవడు తన ప్రయత్నముచే బ్రాణము నూర్ధ్వముగను, అధోముఖముగను నడువ ప్రేరేపించునో, అట్టి కర్త యొకడు కలడు. సుషుప్తికాలమునగూడ నతడే కర్తృత్వమువహించి ప్రాణాపానముల నడుపు మండును.

అవ్విధముగనే మన కర్తృత్వ మావంతయులేని నిమేషోన్మేషనములుగూడ ఆత్మవలననే జరుగుచున్నవనుట కెట్టి సందియమును లేదు. అచేతనవిగ్రహ నృత్యమునకు చేతను సహాయ మపేక్షితమైనట్లు, నిమేషోన్మేషనములకు నప్రత్యక్ష ప్రయత్నము చేతనునుండి రావలయును. ఆచేతనాంశమే ఆత్మ. అదేవిధముగా 'జీవనమప్యాత్మలింగం' (వై. సూ. ఉ. 3.2.4) జీవనత్వముగూడ ఆత్మగుణమే యగును. గృహాంతరవాసి గృహమును అభివృద్ధిగావించునట్లు, దేహాంతరవాసియగు ఆత్మయు అన్నాది పదార్థములచే దేహమును నభివృద్ధిగావించుచు వ్యాధికాలమున ఔషధాదిచే నివారించుచు, శరీరపోషణ రక్షణ భారమును వహించును. కాన జీవనలక్షణముసైతము ఆత్మ కారకత్వమును సూచించుచు ఆత్మలింగ మగుచున్నది. అట్లే 'ఏవం మనోగతిరప్యాత్మలింగం' (వై. సూ. ఉ. 3,2.4) మనో

గమనముగూడ ఆత్మలక్షణమే యగును. మనస్సు అణురూపము గలిగి అభిన్నమైనదని పూర్వము వర్ణితము. అభిమత విషయ గ్రహణమునకై యింద్రియముల నిర్దేశించుట కొరకు కోరికయు యత్నమును అవసరము. ఆయత్నమే ఆత్మను సూచించును. అదేరీతిగా 'ఇంద్రియాంతరవికారాత్ ఖల్వపి దృశ్యతే' (వై. సూ. ఉ. 3.2.4) ఇంద్రియాంతర వికారముల మూలముగ గూడ ఆత్మవ్యక్తము. అనగా పూర్వానుభవ జన్యమైన వాసనా బలమున ప్రస్తుత ప్రత్యక్షవిషయముల గాంచి ఇంద్రియవికారము కలుగుట సామాన్యము. ఫలానుభవముండుటచే ఆఫలము గోచరింపగనే నోరూరుచున్నది. దానికి కారణముగ బూర్వానుభవసంస్కారము, ప్రస్తుతానుభవముగూడ ఒకే కర్తలో నుండియుండవలయును. ఆకర్తయే ఆత్మ. మరియు 'సుఖాదయశ్చ జ్ఞానవదేవాత్మలింగాని ద్రష్టవ్యాః' (వై. సూ. ఉ. 3.2.4) జ్ఞానమువలెనే సుఖదుఃఖములుగూడ ఆత్మలింగములుగా చూడదగినవి. ఈసుఖదుఃఖములుగూడ కారణజన్యములగు కార్యములుగాన నొక అధిష్ఠానమును గలిగి, అందుమిడి యుండవలయును.

ఇట్లు ఆత్మమనములు తీర్మానింపబడియున్నవి. ఆత్మ నిత్యమై ద్రవ్యమై యొప్పుచున్నది. దీనికిని పూర్వద్రవ్యముల వలె గుణములుండుటచే నిదియు ద్రవ్యముగా వ్యవహార్యము. ఇది 'తస్మాదాగమికః' (వై. సూ. 3.2.8) అనురీతి అన్నిద్రవ్యముల వలె సులభగ్రాహ్యము కాకపోవుటచే సులభముగా దీర్మానింపబడునదియు గాకుండుటచే దానియునికి వేదముచేతనే తీర్మానింప

బడియున్నది. 'అహం' ప్రత్యయమువల్లగూడ 'అహమితి శబ్దస్య వ్యతిరేకాన్నాగమికం' (వై. సూ. 3.2.9) అనురీతి ఆత్మ గ్రాహ్యము. అంతియగాక 'నేను సుఖిని, నేను దుఃఖిని' మొదలగు వ్యవహారములద్వారా అనగా సుఖదుఃఖాది ఆత్మగుణములద్వారా ఆత్మ ప్రత్యక్షగోచరమై విరాజిల్లుచున్నది. 'అహం' ప్రత్యయమునకు వ్యవహారమైన దేహాదికమునకే యన్వయముగాని తదధిష్ఠాతయగు నాత్మకు గానేరదనుట సిద్ధము.

## నానా - ఆత్మ

సురల ఆత్మ మనస్సువలెనే నానాశరీరములలో నానా విధములుగా నొప్పారును. అనగా సర్వశరీరములలో నొకే యాత్మ అనేకరీతులుగా నుండక, 'సుఖదుఃఖజ్ఞాననిష్పత్త్య విశేషాదైకాత్మ్యం' (వై సూ. 3.2.19) సుఖదుఃఖజ్ఞానముల మూలము ఏకముగానున్నట్లు గోచరించినను 'వ్యవస్థాతో నానా' (వై. సూ. 3 2.20) బరిస్థితుల తారతమ్యమువలన ఆత్మ అనేకమే యగుచున్నది. అనగా ఒకడు ధనవంతుడు మరొకడు పేద, ఒకడు సుఖి, మరొకడు దుఃఖి మొదలగు పరిస్థితుల వ్యత్యాసములవలన, ఏకాత్మయే నైయున్న యీఅవాంతర భేదము లనుపపన్నములగుట, ఆత్మలనేకములేగాని ఏకము కాదు. అంతియుగాక 'ప్రవృత్తినివృత్తీచ ప్రత్యాగాత్మని దృష్టే పరత్ర లింగం' (వై. సూ. 3.1.19) ఆత్మలో ప్రవృత్తినివృత్తుల యునికి వలన ఆత్మలనేకములని సూచన. ప్రవృత్తినివృత్తులు, రాగద్వేషజన్యములగు ప్రయత్నములు. వీనిచేత హితప్రాప్తి

అహిత పరిహారఫలకములై శరీరమునందు తత్తద్వికారముల గలుగజేయుచున్నవి. ఇట్టి శారీరకచేష్టలు ఇతరదేహములలో మనము తిలకించునప్పుడు అందు మరియొక ఆత్మ కలదని తీర్మానమునకు రావలయును. మన శారీరక కార్యమువలెనే యితర శరీరములందుగూడ అన్యతరప్రేరితమైన కర్మ గోచరించుటచే అన్యాత్మకలదని తాత్పర్యము. కాన యితరశరీరములలో స్వీయశరీరమునవలెనే ఆత్మలుండవలయునుగాన అనేక శరీరములందు అనేకాత్మ లున్నవనుటయు ఆవశ్యకముగాన, ఆత్మలనేకములేగాని ఏకము కాదు. ఆత్మ యిట్లనేకసంఖ్యాకముగనుండియు, 'విభవాన్మహానాకాశస్తథా చాత్మా' అను సూత్రవిధానముగ విభుత్వమున నాకాశము అనంతమైయున్నటుల ఆత్మయు ననంతమై మరియు దుర్గ్రాహ్యమైయుండును. ఆకాశమువలె ఆత్మయు 'నిత్యః సమమహత్పరిమాణవాన్ వైభవాత్' (వై. సూ. వి. 7.1.21) విభవవిశేషమున నిత్యమును మహత్వమును గలిగి సర్వవ్యాపకత్వమును గలిగియుండును. 'అదృష్టవదాత్మసంయోగస్య సర్గాద్యకాలీనపరమాణుకర్మహేతుత్వాత్ ఆత్మవైభవమప్యావశ్యకం' (వై. సూ. వి. 7.1.22) సర్గాద్యకాలీన పరమాణుగత కర్మ అదృష్టప్రేరిత ఆత్మసంయోగమున గలుగుచుండుటచే ఆత్మయొక్క వ్యాపకత్వ మవసరమగుచున్నదిగా వివృత్తికారుని వివరణము.

## కర్మ

ఇంతవరకు ద్రవ్యములకుగల వస్తుగుణవిమర్శ చేయబడినది. ఇక ద్రవ్యములకుగల కర్మవిచారము గావించి ద్రవ్య

కర్మసంబంధముల జూతము. 'ఏకద్రవ్యమగుణం సంయోగ విభాగేష్వనపేక్షకారణమితి కర్మలక్షణం' (వై. సూ. 1.1.17) ఒకేద్రవ్యము నాశ్రయించినదియు, గుణరహితమైనదియు, సంయోగవిభాగములకు గారణభూతమైనదియు కర్మయనబడును. ఈకర్మ 'ఉత్క్షేపణమవక్షేపణమాకుంచనం ప్రసారణం గమనమితి కర్మాణి' (వై.సూ. 1.1.7) పైకెగరవేయుట, క్రిందికి బడవేయుట, ముడుచుకొనుట, ప్రసరించుట, నడచుటలుగా ముఖ్యముగా కర్మ పంచవిధములు.

పృథ్వీద్రవ్యమున యీకర్మ 'నోదనపీడనాత్ సంయుక్త సంయోగాచ్చ పృథివ్యాం కర్మ' (వై.సూ. 5.2.1) ప్రేరణము, పీడనము, సంయోగములవలన బృథివియందు గర్మ కలుగును. వెదురునుండు అగ్ని ప్రేరణముచే గర్మ జనించును, లేక కుఠార తాడనముచే గూడ వెదురునందు కర్మ జనించును. అట్లే రథచోదనకార్యమున, నశ్వములకు రథములకును బగ్గములకు గల సంయోగముచే గర్మ ఉద్భవించును. 'తద్విశేషేణాదృష్ట కారితం' (వై. సూ. 5.2.2) పృథ్వియందు భూకంపనాదిక కర్మలు అదృష్టవశమున నేర్పడుచుండును. 'అపాం సంయోగాభావే గురుత్వాత్ పతనం' (వై. సూ. 5.2.3) సంయోగము లేనప్పుడు గురుత్వకారణమున జలము పడును. మరియు 'ద్రవత్వాత్ స్యందనం' (వై.సూ. 5.2.4) జలము ద్రవమగుట వలన ప్రవహించును. ఈజలము సూర్యాతప వాయుసహాయమున 'నాడ్యో వాయుసంయోగాదారోహణం' (వై. సూ 5.2.5) పైకెగురును. వృక్షాదులందు జలము పైకి ప్రసరించుటయు, 'వృక్షాభిసర్పణమిత్యదృష్టకారితం' (వై.సూ. 5.2.7)

అదృష్టకారణమున జరుగును. 'అపాం సంఘాతో విలయనం చ తేజః సంయోగాత్' (వై. సూ. 5 2.8) తేజోసంబంధమున జలము ఘనీభవించుట, అదృశ్యమగుటయు నేర్పడుచుండును.

అటులనే 'పృథివీకర్మణా తేజఃకర్మ వాయుకర్మ చ వ్యాఖ్యాతం' (వై.సూ.5.2.12) తేజోవాయుకర్మలు పృథివీకర్మల ననుసరించి అన్వయము. అనగా మెరుపు తుపానులు అదృష్ట ప్రేరితములు. మరియు అగ్నివాయువులలో 'అగ్నే రూర్ధ్వ జ్వలనం వాయోస్తిర్యక్పవనమణూనాం మనసశ్చాద్యకర్మాదృష్ట కారితం' (వై. సూ. 5.2.13) అగ్ని ఊర్ధ్వముగ జ్వలించుట, వాయువు దిశలకు వీచుట, అణువుల మనస్సుయొక్క సృష్ట్యాది కర్మయు అదృష్టప్రేరితములుగ నుండును. మనోకార్యము హస్తాది అవయవ కర్మద్వారా వ్యక్తము (వై.సూ. 5.2.14). అట్లే సుఖదుఃఖాదికము 'ఆత్మేంద్రియమనోఽర్థసన్నికర్షాత్ సుఖదుఃఖం' (వై. సూ. 5.2.15) అనురీతి ఆత్మేంద్రియమనస్సులకును, వాని విషయములకును సంయోగమువలన కలుగుచున్నను, 'తదనారంభే ఆత్మస్థే మనసి శరీరస్య దుఃఖాభావః సంయోగః' (వై. సూ. 8.2.16) ఆత్మయందున్న మనస్సులో గర్మయే లేకున్న దేహమున బాధ అభావమే యగును. అనగా మనస్సునకు బాహ్యసంబంధమున్ననే దానికి గర్మప్రవృత్తి గలిగి దుఃఖాద్యనుభవము కలుగును. దేహమును డి బాహ్యాభ్యంతరముల మనస్సు సంచరించుచుండుటయు నదృష్ట కారితమే యగుచున్నది (వై. సూ. 5.2.17).

తర్వాత 'దిక్కాలావాకాశం చ క్రియావద్భ్యోవైధర్మ్యాన్ని ష్క్రియాణి' (వై. సూ. 5.2.21) దిక్కు కాల ఆకాశములు

కర్మవిశిష్టద్రవ్యములకు విలక్షణములుగాన నవి నిష్క్రియములై యగుచున్నవి. అనగా నీ ద్రవ్యత్రయమునకు గర్మలేదని గ్రాహ్యము.

వైశేషికసిద్ధాంతమునకు షట్పదార్థి అను వ్యవహారము నకు కారణభూతములగు ద్రవ్యగుణకర్మ సామాన్యవిశేష సమవాయములలో (వై. సూ. 1.1 4) ద్రవ్యగుణకర్మవిచారము గావింపబడినది. ఇక సూక్ష్మముగ సామాన్యవిశేషసమవాయ పరిశీలన గావింతము.

## సామాన్యము

'సామాన్య విశేష ఇతి బుద్ధ్యపేక్షం' (వై. సూ. 1.2.3) అను సూత్రచందము బుద్ధ్యపేక్షికమైన సామాన్యవిషయముల బరిశీలింతము. పూర్వము వివరింపబడిన ద్రవ్యగుణకర్మలలో గల 'ద్రవ్యత్వం గుణత్వం కర్మత్వం చ సామాన్యాని విశేషాశ్చ' (వై. సూ. 1.2.5) ద్రవ్యత్వ గుణత్వ కర్మత్వములు సామాన్య విశేషరూపములై రాజిల్లును. ద్రవ్యాదులలో ద్రవ్యత్వ మెట్లుండునన 'అనేకద్రవ్యవత్త్వేన ద్రవ్యత్వముక్తం' (వై. సూ. 1.2.11) అనునట్లు అనేక ద్రవ్యాశ్రితమైన ద్రవ్యవత్వము ద్రవ్యత్వమగుచున్నది. అట్లే గుణత్వ కర్మత్వములును (వై.సూ.1.2.13) అన్వయము. కాన ద్రవ్యాదులగల ద్రవ్యత్వాదులలో సామాన్య విశేషభావము లగుపడునవియు, నవి బుద్ధ్యపేక్షికములనియు దాత్పర్యము. అనగా వాని జ్ఞానము ఇంద్రియాదికమునగాక బుద్ధిద్వారమునజరుగును. అవి 'సామాన్యవిశేషాపేక్షం ద్రవ్యగుణ

కర్మసు' (వై. సూ. 8.1.6) ద్రవ్యగుణకర్మజ్ఞానము నంటియే యుండి వాని సామాన్యత్వవిశేషత్వముల పరిజ్ఞానము గలుగ జేయును. ఆత్మేంద్రియార్థ సన్నికర్షమున (వై. సూ. 3.2.1) సామాన్యవిశేష జ్ఞానము గలుగును (వై. సూ 8.1.5). అందు 'అనువృత్తిబుద్ధిః సామాన్యస్య వ్యావృత్తిబుద్ధిర్విశేషస్య' (వై. సూ. ఉ. 1.2.3) సామాన్యమువలన అనువృత్తిబుద్ధి, విశేషము వలన వ్యావృత్తిబుద్ధియు నుండును. అనగా 'అనువృత్తిత్వం అధికదేశవృత్తిత్వం వ్యావృత్తత్వమల్పదేశవృత్తిత్వం' (వై. సూ. వి. 1.2.3) అధికదేశమునందుండుట అనువృత్తత్వమును అల్పదేశ గతమగుట వ్యావృత్తమని వివృత్తికారుని వివరణము. అందుచే నధికదేశమునందుండునది సామాన్యమనియు, అల్పదేశస్థమగునది విశేషమనియు నర్థము.

అందు సామాన్యము 'ద్వివిధం పరమపరం చ' (వై. సూ. ఉ. 1.2.3) పరాపరరూపమున ద్వివిధము. 'తత్ర పరం సత్తా అపరం సత్తావ్యాప్యం ద్రవ్యత్వాది'(వై. సూ. ఉ. 1.2.3) పరమైనది సత్తాయును, ద్రవ్యత్వాదులందు సత్తావ్యాపకత్వము అపరమైనది యగును. 'తత్ర పరస్సామాన్యం సత్తా ద్రవ్యత్వాదికత్వపరసామాన్యం' (వై. సూ. వి. 1.2.3) అనియు వివృత్తికారుడు వాక్రొనియున్నాడు. పరరూపసామాన్య మన బడిన సత్తా 'సదితి యతో ద్రవ్యగుణకర్మసు సా సత్తా' (వై. సూ. 1.2.7) ద్రవ్యగుణకర్మలయొక్క యునికిని రూపించునది యగుచు, 'ద్రవ్యగుణకర్మభ్యోఽర్థాంతరం సత్తా' (వై. సూ. 1.2.8) ద్రవ్యగుణకర్మల కన్యముగానుండునది సత్తాయైయున్నది. అనగా ద్రవ్యాదులు సత్తాపై తమ యునికికై యాధారపడు

చుండునుగాని, సత్తా వానికి విలక్షణముగనేయుండును. మరియు 'ద్రవ్యాదయో౽ననుగతాః సత్తా చానుగతా' (వై. సూ. ఉ. 1.2.8) ద్రవ్యాదులు పరిమితములు సత్తావ్యాప్తమును అగుచున్నవి. అందుచే అనుగతత్వాననుగతత్వలక్షణ (వై. సూ. ఉ. 1.2.8) ములు సత్తా ద్రవ్యములుగలిగి వాని విభేదమునుగూడ నిర్దేశించుచున్నవి. మరియు 'గుణకర్మసు చ భావాన్న కర్మ న గుణాః' (వై.సూ.1 2.9) కర్మగుణాదులలో సత్తా యుండుటచే నది కర్మగుణములకన్యమైనది. 'సామాన్యవిశేషాభావేన చ' (వై. సూ. 1.2.10) సామాన్యవిశేషములు మరల సత్తాలో నుండనేరవు అనికూడ తాత్పర్యము. 'సదితి లింగావిశేషా ద్విశేషలింగాభావాచ్చైకో భావః' (వై. సూ. 1.2.17) అను సూత్రమురీతి అందు లింగావిశేషముచేతను, విశేషలింగాభావము చేతను సత్ ఏకమైయుండును. అనగా 'సదిత్యాకారకం జ్ఞానం శబ్దప్రయోగో వా సత్తాయా లింగం' (వై. సూ. ఉ. 1.2.17) ఉన్నదను ఆకారకజ్ఞానముగాని పదప్రయోగము గాని సత్తయొక్క లక్షణము. అది ద్రవ్యగుణకర్మలలో సమానవిశిష్టమై భేదరహితమై 'ఏకైవ తేషు వర్తతే' (వై. సూ. ఉ. 1.2.17) వానిలో నేకమై వర్తించును. మరియు 'సదకారణవన్నిత్యం' (వై. సూ. 4.1.1) సత్తు అకారణమును నిత్యమును అయియున్నది. అనగా 'అసతః సజ్జాయతే' (వై. సూ. వి. 4.1 1) అసత్తునుండి సత్తుకలుగుననుట తగదు. కావున 'సత్ భావరూపం కించిత్ అకారణవత్ అజన్యం నిత్యం వినాశాప్రతియోగివస్తు' (వై. సూ. వి. 4.1.1) సత్తు సదా భావరూపమై అకారణమై, నిత్యమై, వినాశమునొందనిదై యున్నది.

అట్లు వివరింపబడియున్న సత్తు సామాన్యముయొక్క పర రూపమై యొప్పారుచున్నది.

## విశేషము

విశేషము నాబడుటవలననే 'అణు మహదితి తస్మిన్ విశేషభావాత్ విశేషాభావాచ్చ' (వై. సూ. 7.1.11) అణు మహాదాది లక్షణములు వ్యవహార్యము. అనగా బిల్వాపేక్ష వలన రేగు అణువగును. అట్లే రేగుపండుతో పోల్పగా బిల్వ ఫలము మహత్తగుచున్నది. 'విశేషభావామహత్వవిశేషస్యైవ తరతమాది భావేన భావాత్' (వై. సూ. ఉ. 7.1.11) విశేషమే కారణము. తరతమభావరూపమున బరిమాణవిశేషముండుటయే యిందు హేతువుగ ఉపస్కార వివరణము. విశేషము ఏకదేశముకాక ఏకకాలికముగ నుండును. ఒకవస్తువునందు చిన్న పెద్దలు రెండును ఏకకాలమున నుండక, ఒకేకాలమున రెండువస్తువులందు యుండును. ఇట్లే దీర్ఘత్వ హ్రస్వత్వ వ్యవహారముగూడ గ్రాహ్యము.

## సమవాయము

ఇంతవరకు షట్పదార్థముల సమవాయమువినా ద్రవ్యాది విశేషపర్యంతము గ్రహింపబడియున్నది. పూర్వోక్తముల యన్నింటికంటె సమవాయవిచారణము అత్యంత ముఖ్యము. ఎందులకన దత్త్వవిచారణమున 'కార్యకారణభావస్యాసిద్ధత్వేన శశవిషాణసమానత్వాత్' (వై.సూ.వి. 1.2.1) కార్యకారణ

భావము నిరూపణముగానిచో శశవిషాణప్రసంగమువలె నిష్ఫలమగుటచే గార్యకారణభావముయొక్క విచారణ మావశ్యకము. సూక్ష్మదృష్టి విచారించుచో 'కారణాభావాత్ కార్యాభావః' (వై. సూ. 1.2.1) కారణమే లేకున్నచో గార్యమే అభావమగును. కాని 'న తు కార్యాభావాత్ కారణాభావః' (వై. సూ. 1.2.2) కార్యము లేకున్నంతమాత్రమున గారణము అభావముకాదు. అనగా కార్యము కారణాధీనముగాని కారణము కార్యాధీనము కాదు. సర్వకార్యములకు 'అవధిస్తు కారణమేవ' (వై. సూ. ఉ. 1.2.1) కారణమే పరమావధి. కాన కార్యము కారణముపై నాధారపడియుండును. ఈ కార్యకారణభావమే లేకున్న ప్రవృత్తి నివృత్తులును లేకపోవునని ఉపస్కార వివరణము. కార్యోత్పత్తికి గారణము ఏకముగాక త్రివిధముగా వైశేషికవాదము. 'తథా చాత్మా జ్ఞానస్య సమవాయికారణం, ఆత్మమనఃసంయోగోఽసమవాయికారణం విషయసన్నికర్షో నిమిత్తకారణమితి' (వై. సూ. వి. 8.1.3) అను రీతి జ్ఞానకార్యము నుదాహరణముగ గైకొనిన నందు ఆత్మ సమవాయికారణముగను, ఆత్మమనఃసంయోగము అసమవాయముగను, విషయసంబంధము నిమిత్తకారణముగ నగుచున్నది. లేక ఘటకార్యమున మృత్తు, కపాలసంయోగ కులాలులు క్రమముగ సమవాయాసమవాయ నిమిత్తములుగ నుండును. ఈ మూడుకారణములును గార్యోత్పత్తికి బ్రధానమైనను అందు సమవాయము అతిప్రధానమగుటయు, గార్యమునకు ద్రవ్యత్వము నొసంగున దగుటయు, దాని షట్పదార్థములలో గణాదమునీంద్రుడు గైకొనెను. దాని నొకించుక బరిశీలింతముగాక.

కార్యోత్పత్తికి 'అసతః సజ్జాయతే' (న్యై. సూ. వి. 4.1.1) అనునట్లు సత్తాకాక అసత్తు కారణమైయుండునని కొందరివాదము. అనగా బీజనాశనమున అంకురోత్పత్తియని వారి ఉదాహరణము. కాని అవయవరూపములగు కార్యములకు మూలకారణము అసత్ కాదనియు, సర్వకారణముగ సత్తు గలదనియు కణాదమతము. అందుచే సర్వకార్యములకు మూలకారణమగు సమవాయము అసద్రూపముకాక, సత్తామాత్రమనియే నిర్ణయము. అనగా సర్వద్రవ్యములును 'యత్ కార్యద్రవ్యం తత్ సావయవం యచ్చ సావయవం తత్ కార్యం' (న్యై. సూ. ఉ. 4.1.2) అనురీతి ఏది కార్యద్రవ్యమో అది సావయవముగను, ఏది సావయవమో అది కార్యముగ నుండును. గాన కార్యములన్నియు సావయవములగుటచే నన్నింటికి సమవాయమగునది 'తస్మాన్నిరవయవం ద్రవ్యమవధిః' (న్యై.సూ.ఉ. 4.1.2) అనునట్లు నిరవయవమవధిగాగల 'స ఏవ పరమాణుః' (న్యై.సూ.ఉ 4.1.2) పరమాణువులే అయియుండవలెను. ఇట్లు పరమాణువులు సర్వద్రవ్యములకు ద్రవ్యత్వమునొసంగు సర్వ సమవాయకారణముగా విరాజిల్లుచున్నవి. ఇవియే లేకున్న 'కారణాభావాత్ కార్యాభావః' (న్యై.సూ.4.1.3) అనుచందము కార్యములే లేకుండుటచే, 'తస్య కార్యంలింగం' (న్యై.సూ.4 1.2) సర్వత్ర గోచరించుచుండు కార్యరూపములే వానియునికిని నిర్ధారణము గావించుచున్నవి. కాన 'ఇహేదమితి యతః కార్యకారణయోః స సమవాయః' (వై.సూ. 7.2.26) కార్యకారణములలో నొకటి రెండవదానిలో నున్నదను వ్యవహారమునకు

గారణమైనది సమవాయమని నిర్వచింపబడినది. అనగా కార్య కారణములలో నేకరూపముననున్నదే సమవాయము అని అర్థము. ఆ హేతువుచే 'స చాయం నిత్య అకారణత్వాత్, సమవాయకారణామత్పత్తినియమః తదనురుద్ధే చ నిమిత్తాసమవాయినాం' (వై.సూ.ఉ. 7.2.26) సమవాయము అకారణమగుటచే నిత్యమై సర్వకార్యోత్పత్తిహేతువగుచు, అసమవాయి నిమిత్తకారణములకంటె విశిష్టమై యున్నది. దీనినే 'కార్యకారణయోరవయవావయవినోర్యతః సంబంధాత్ ఇహేదమితి ప్రత్యయః స సమవాయః' (వై.సూ.వి. 7.2 26) కార్యకారణములలో, అవయవ అవయవులలో నొకటి యొక్కచో గలదను సంబంధమును తెలుపునది సమవాయమని వివృత్తికారుడు వచించియున్నాడు. అనగా 'తంతుషు పటః కపాలేషు ఘటః' తంతువుల పటమును, కపాలముల ఘటమును గాంచి, పటఘటములకు దంతుకపాలముల సమవాయములుగ నెరుంగుటయని భావము. కార్యకారణములను పదముల కొక యన్వయ శక్తి గలదనియు, అందు సమవాయము గుణగుణులు, క్రియాక్రియావతులు, జాతివ్యక్తులు, నిత్యద్రవ్యవిశేషపదార్థములు, ఆధారాధేయముల సంబంధనియమముల నిర్ణయించుచుండును (వై.సూ.వి. 7 2.26).

మరియు 'కారణగుణపూర్వకః కార్యగుణో దృష్టః' (వై. సూ. 2.1.24) కార్యగుణము కారణగుణమున గాంచనగు నను రీతి, 'సమవాయినః శ్వైత్యాచ్ఛ్వైత్యబుద్ధేశ్చ శ్వేతే బుద్ధిస్తే' (వై.సూ. 8.1 9) శ్వేతవర్ణవస్తువునగల శ్వేతత్వము దాని కారణ ద్రవ్యమును గలిగియుండును. కాన 'ద్రవ్యగుణకర్మణాం ద్రవ్యం

కారణం సామాన్యం' (వై.సూ. 1.1.18) ద్రవ్యగుణకర్మలకు సమవాయ మొక్కటియే యైయుండును. సమవాయము ఏకముగాగాక 'ద్రవ్యాణాం ద్రవ్యం కార్యం సామాన్యం' (వై. సూ. 1.1.23) కార్యద్రవ్యమునకు ద్రవ్యములు కారణముగ నుండును. 'రూపాణాం రూపం' (వై సూ. 1.1.8) ఒక రూపమునకు అనేకరూపములు కారణముగ నుండవచ్చును. కాన పైసూత్రార్థముల ననుసరించి చూతుమేని సమవాయికారణము కార్యోత్పత్తికి ద్రవ్యత్వతః కారణమై నిత్యమై కార్యాంతర్గతమై యొప్పారుచున్నది. అదియే లేకున్న అసలు కార్యోత్పన్నము దుర్లభము. అందుచే దత్త్వశాస్త్రమున దీనికి బ్రబల ప్రాధాన్యత యీయబడియున్నది. ఇది ఎల్లప్పుడు ద్రవ్యరూపముననే కార్యకారణముల యుండుననియు గ్రాహ్యము సర్వకార్యములకు బరమకారణముగ నిత్యములగు పరమాణువులు సమవాయములై విరాజిల్లునను, పరంపరారూపమున నవయవులుగూడ అవయవులకు సమవాయ మగుచుండును. అనగా ఘటోత్పత్తికి మృత్తు పరమకారణ మనుకొనిన, గపాలద్వయము అవయవరూపముననుండియు సమవాయము అయినట్లు అని భావము.

## అసమవాయము

సమవాయముతర్వాత అంత ప్రధానమగు అసమవాయి కారణమునుగూర్చియు నిసుమంత విచారించుట అవసరము. 'అసమవాయికారణత్వం చ కార్యకారణభావసంబంధ్యైకార్థసమవేతకారణత్వం' (వై. సూ. ఉ. 10.2.3) వస్తువులో గార్య

కారణసంబంధమున అందు సమవేతమైనకారణము అసమవాయ మనియు, కాన సమవాయమువలె ద్రవ్యరూపమునగాక 'ద్రవ్యాణాం సంయోగోఽసమవాయికారణం' (వై. సూ. ఉ. 1.1.19) ద్రవ్యములకు అసమవాయము సంయోగరూపమున నుండుననియు అనగా 'కారణసమవాయస్య సంయోగః పటస్య' (వై. సూ. 10.2.5) వస్త్రమునకు కారణమున సంయోగరూప మున సమవాయమైయుండునది అసమవాయమనియు వివరింప బడియున్నది అసమవాయము మరల 'ఆద్యాలఘ్వీ ద్వితీయా మహతీతి వైశేషికపరిభాషా' (వై. సూ. ఉ. 10.2.3) వైశేషిక పరిభాషలో లఘ్వీ మహతి యని ద్వివిధమై యున్నది. 'తచ్చ కార్యైకార్థసమవాయాత్ కారణైకార్థసమవాయాద్వా' (ఉ. 10.2.3) కార్యరూపద్రవ్యగతమై యుండుటయు, కారణగతమై యుండుటయు ననుభేదమున నాద్వివిధవిభాగ మేర్పడియున్నదని గ్రాహ్యము. అందుచే నది సంయోగాదిరూపకర్మలో నుండుచు, కార్యగతమై లఘ్వీఅసమవాయమై యుండును (ఉ. 10.2.3). మరల నదే అసమవాయము 'తథా రూపే కారణైకార్థసమ వాయాచ్చ' (వై. సూ. 10.2.4) ఆకార్యముననే రూపగతమై కారణమున మహతీఅసమవాయముగ నుండును. 'ద్రవ్యారంభే సంయోగస్యాసమవాయికారణస్య లఘ్వీం ప్రత్యాసత్తిమాహ' (వై. సూ. ఉ. 10.2 5) ద్రవ్యారంభమున సంయోగమునకు లఘ్వీఅసమవాయమును జెప్పు 'కారణకారణసమవాయాచ్చ' (వై సూ. 10.2.6) కారణకారణమున సమవాయమై 'సంయో గస్య క్వచిత్ మహత్య ప్రత్యాసత్త్యా కారణత్వం' (వై.సూ. ఉ. 10.2.6) సంయోగమునకు మహత్యాసమవాయముగూడ

చెప్పబడును అనియు వివరింపబడియున్నది. అనగా కారణ దృష్ట్యా మహతీ అసమవాయమనియు, కార్యదృష్ట్యా లఘ్వీ అసమవాయమనియు నెరుంగనగును.

ద్రవ్యముల సంయోగరూపమునను, శబ్దాదిపృథక్త్వాది గుణములలో సజాతీయకారణగుణ అసమవాయముగను, బుద్ధ్యాది ఆత్మగుణములలో మనఃసంయోగ అసమవాయముగను వివిధరీతుల నీఅసమవాయము గోచరించుచున్నది. ఇది ఎచ్చట యున్నను, క్రియారూపమై యొప్పారుచుండుననుట విదితము.

## నిమిత్తము

'విషయసన్నికర్షో నిమిత్తకారణం' (వై.సూ.వి. 8.1.3) విషయసామీప్యమే నిమిత్తకారణముగా నిర్వచింపబడియున్న తృతీయకారణమునుగూడ కొంత చూచెదముగాక. 'పటోత్పత్తౌ తంతూనాం సమవాయికారణత్వవత్ నిమిత్తకారణత్వమపి' (వై. సూ. ఉ. 10.2.2) పటోత్పత్తియందు సమవాయికారణమువలె నిమిత్తకారణముగూడ తంతువులకు గలదు. పటోత్పత్తికి తురీతంతుసంయోగముగూడ కారణమగుచున్నది. ఆ తురీతంతుసంయోగము నిమిత్తకారణమనబడును.'సంయుక్తసమవాయాదగ్నేర్వైశేషికం' (వై. సూ. 10.2.7) సంయుక్తసమవాయరూపమున నగ్నియొక్క విశేషలక్షణముల నిమిత్తకారణము గలదు. అనగా అగ్నియందుగల యుష్ణత్వము, పాకజముల సంయుక్తసమవాయమై పాకజరూపముల నేర్పరచుచు నిమిత్తకారణముగ నగుచున్నది. పాకజములగల ఉష్ణత్వమే

నిమిత్తకారణముగ తెలుపబడియున్నది. 'సమవాయికారణా సమవాయికారణభిన్నం కారణం నిమిత్తకారణమితి సామాన్య లక్షణం బోధ్యం' (వై. సూ. వి. 10.2.7) సమవాయాసమ వాయముల విభిన్నమైన కారణము నిమిత్తకారణముగా సామాన్య నిర్వచనమని గ్రాహ్యము.

పైవిధాన గార్యోత్పత్తికి సమవాయాసమవాయ నిమిత్త కారణత్రయ మవసరమైయున్నను, గార్యమునకు ద్రవ్యత్వ మును బ్రసాదించు సమవాయమే ముఖ్యమగుట షట్పదార్థము లలో సమవాయమే గ్రహింపబడి అందే అసమవాయ నిమిత్త ములు అంతర్గతములుగా జేయబడినవి.

## అభావము

వైశేషికవాదమునకు షట్పదార్థి అని కొందరు సిద్ధాం తులు నామకరణ మొనరించియున్నను, కొందరు పూర్వోక్త ద్రవ్యాదిసమవాయపర్యంత షట్కమునకు నభావమునుగూడ చేర్చి సప్తకముగ జేసి సప్తపదార్థి అని నామంబొసంగిరి. కణాద మహర్షి తన సిద్ధాంతమున కట్టి పేరొసంగినట్లు ఎక్కడను సాక్ష్యము అగోచరము. తన సూత్రములలో ద్రవ్యాదులలో అభావముగూడ 'అభావప్రత్యక్ష' అనుశీర్షికక్రింద కణాదుడు చర్చించియున్నాడు. యథార్థమున అభావమైయున్నను, సిద్ధాం తమున భావరూపముదాల్చి ప్రాముఖ్యత నార్జించియున్న అభావ విచారణమునుగూడ గావింతముగాక !

'సదితి యతో ద్రవ్యగుణకర్మసు సా సత్తా' (వై. సూ. 1.2 7) ద్రవ్యగుణకర్మలయొక్క కలిమిని సూచించునది సత్తా యనియు, కాని అది 'ద్రవ్యగుణకర్మభ్యోఽర్థాంతరం సత్తా' (వై. సూ. 1.2 8) ద్రవ్యాదిత్రయమున కన్యమనియు బూర్వము సత్తా నిర్వచింపబడియున్నది. అనగా సత్తా ద్రవ్యాదు లన్యోన్యాపేక్షికములై ద్రవ్యాదికకలిమిచే సత్తాయును, సత్తాచే ద్రవ్యాదులును విదితమగుచుండును. కాని 'సత్యపి ద్రవ్యత్వే మహత్త్వే రూపసంస్కారాభావాద్వాయోరనుపలబ్ధిః' (వై. సూ. 4 1.7) ద్రవ్యత్వమహత్త్వములు గలిగి యున్నను, రూపసంస్కారము లేమిచే వాయురూపము అనుపలబ్ధ మగుచున్నది. అట్లే 'తేన రసగంధస్పర్శేషు జ్ఞానం వ్యాఖ్యాతం' (వై. సూ. 4.1.9) రసగంధస్పర్శాదిక అనుపలబ్ధికూడ ఆయా సంస్కార రాహిత్యమువలననే గలుగుచున్నదను సూత్రములచే కేవలము ద్రవ్యాదికము లేకపోవుటచే సత్తారహిత మేర్పడు చున్నదనుటకు వీలులేదు. ద్రవ్యాదికగుణోపలబ్ధి ఆయా యింద్రియ గోచరమగుటచే నన్నిటి కొకేవిధాన ఉపలబ్ధజ్ఞాన మేర్పడక వివిధరీతుల గలుగుచు, సత్తాస్ఫూర్తిని కలుగజేయును. ఉదాహరణమునకు ద్రవ్యములనున్న గురుత్వము అనుద్భూత రూపము గలదగుటచే నప్రత్యక్షమైయున్నను, దానియొక్క సత్తారూప అస్తిత్వమునకెట్టి హానియు లేదు. అందుచే అను ద్భూతరూపమునందున్న సత్తా విషయముగాక సర్వవిధముల సత్తావ్యతిరేకరూప అసత్తు లేక అభావమే యిట గ్రాహ్యము. సామాన్యముగా 'దృష్టేషు భావాదదృష్టేష్వభావాత్' (వై. సూ. 8.2.2) అనురీతి దృశ్యములు భావరూపములనియు నదృ

శ్యములు అభావరూపములనియు ననుట పరిపాటియైయున్నను అదృశ్యములైనంతమాత్రమున నభావములనుటకు వీలుగాను పించదు. అందుచే నీఅభావప్రత్యక్షము అవశ్య విచారణీయమై యున్నది.

## ప్రాగభావము

అభావము నాబడు ప్రత్యక్షము ప్రాగభావ, ప్రధ్వంసాభావ, అన్యోన్యాభావ, అత్యంతాభావ, సామయికాభావములుగ పంచవిధములై యున్నది. అందు 'క్రియాగుణవ్యపదేశాభావాత్ ప్రాగసత్' (వై. సూ. 9.1.1) క్రియాగుణ వ్యపదేశము లేకుండుటచే కార్యము కార్యోత్పత్తికి పూర్వము అసత్తై యుండునుగాన కార్యముయొక్క పూర్వాభావస్థితిని ప్రాగభావమందురు. అనగా 'కార్యోత్పత్తేః ప్రాక్ కార్యం ఘటపటాది అసత్' (వై.సూ. ఉ. 9.1.1) కార్యోత్పత్తికి పూర్వము ఘటపటాది కార్యములు లేవు. 'తత్కాలీన స్వజనకాభావప్రతియోగిత్వర్థః' (వై. సూ. ఉ. 9.1.1) ఆకాలమునను న్నచో స్వజనకభావవిరుద్ధమగుట లేదని యన్వయము. 'అత్ర హేతు క్రియాగుణవ్యపదేశాభావాత్' (వై.సూ.ఉ. 9 1.1) అక్కడ కార్యగతమగు క్రియాగుణాదులు లేకుండుటయే కార్యాభావమును వ్యక్తము చేయుచున్నవి. అట్లుకానిచో, ఘటమున్నదనియు, వ్యవహార మపేక్షింపబడవలసియుండుటచే ఘటోత్పత్తికి ముందు ఘటవిశిష్టమగు గుణకర్మలభావమనుట ఉచితము. అందుచేతనే 'ఘటస్తిష్ఠతి ఘటశ్చలతి ఘటః శ్యామ' (వై. సూ. వి. 9.1.1) ఘటముగలదు. ఘటము కదలు

న్నది. ఘటము నల్లగనున్నది అను వ్యవహారములు ఘటోత్ప త్తికి బూర్వము లేవు. అందుచే గుణకర్మల కధిష్ఠానమగు కార్యము లేకుండుటను ప్రాగభావమందురు.

## పరిధ్వంసాభావము

అట్లే 'సదసత్' (వై. సూ. 9.1.2) సత్తు అసత్తగును అను సూత్రప్రకారము ఉన్నది లేకుండపోవుట ప్రధ్వంసాభావ మని చెప్పబడుచున్నది. కారణవ్యాపారమునకు బూర్వము ప్రత్యక్షానుమానప్రమాణములప్రకారము కార్యముయొక్క అభావమెట్లు తెలియబడుచున్నదో అట్లే భావరూపమగు ఘటాది కార్యము వినాశనమైనపిమ్మట, ప్రత్యక్షానుమానప్రమాణముల వలన నభావమని స్పష్టము. దీనినే 'స చాయమభావో ధ్వంస ఇతి' (వై. సూ. ఉ. 9.1.2) ధ్వంసమని అందురు. అందుచే ఘటము ధ్వంసమైనది అను వ్యవహార మేర్పడుచునన్నది. పూర్వ దృష్టమైన ఘటరూపము అదృశ్యమగుటచే నాఘటముయొక్క అభావప్రత్యక్ష మేర్పడుచున్నది. ఈ అభావప్రత్యక్షమున బూర్వదృష్టఘటసంస్కారము సహాయభూతముగనుండి ఘటా భావమును గోచరింపజేయుచున్నది. ఒక్క ప్రాగభావప్రత్యక్ష మునకాక శేషమగు అభావప్రత్యక్షవిధానముల అన్నింటిలో బూర్వదృష్ట ఘటసంస్కారము ముఖ్యముగానుండును. ప్రాగ భావప్రత్యక్షమున భవిష్యత్కాలిక ఘటరూపమును కారణ మున అనుమానప్రమాణమును ఆశ్రయించి గ్రహించెదము.

పూర్వకాలిక సత్తారూపమునుగలిగి వర్తమానమున నభావ మైన వస్తువును, సంస్కారబలమున నభావముగ గ్రహించు టయే ప్రధ్వంసాభావప్రత్యక్ష రహస్యము.

## అన్యోన్యాభావము

సామన్యముగ అభావశబ్దమునకు సందర్భముననుసరించి ప్రాగభావప్రధ్వంసాభావములే యన్వయింపబడినను, అన్యోన్యాభావ అత్యంతభావమును శాస్త్రమున ప్రఖ్యాతములే. అందు 'సచ్చాసత్' (వై. సూ. 9.1.4) సత్తుగూడ అసత్తుయే అను సూత్రము అన్యోన్యాభావ వివరణముగావించును. 'ప్రతీయతే భవతి హి అసన్నశ్వో గవాత్మనా అసన్ గౌరశ్వాత్మనా' (వై. సూ. ఉ. 9.1.4) అశ్వము గోవుతో నేకముకాదు, అటులే గోవు అశ్వముతో నేకముగాదు. అందుచే 'అనశ్వో గౌః అగౌరశ్వశ్చ' (వై. సూ. ఉ. 9.1.4) గోవు గుర్రము కాదు, గుర్రము గోవు కాదు, అను వ్యవహారముగలదు. అప్పుడు 'తదస్యా మశ్వాన్యోన్యాభావ వాన్ గౌః పటాన్యోన్యాభావవాన్ ఘటః' (వై.సూ. ఉ. 9.1.4) అశ్వమునకు అన్యోన్యాభావముగలది గోవు, పటమున కన్యోన్యాభావముగలది ఘటము. అనగా 'ఇత్యాన్యోన్యాభావ ఏవ తాదాత్మ్యాభావాపరనామా భాసతే' (వై.సూ.ఉ. 9.1.4) ఈవిధముగ నన్యోన్యాభావము తాదాత్మ్యాభావరహితమును దెలుపుచున్నది. ఇట్టి అన్యోన్యాభావము నిత్యముగానుండును అని ఉపస్కారకర్త వివరించియున్నాడు.

## అత్యంతాభావము

'యచ్చాన్యదసదతస్తదసత్' (వై. సూ. 9.1.5) అస త్తుల కన్నింటికి అన్యమైయున్నది అత్యంతాసత్ అనబడును అనుసూత్రమున చతుర్థాభావమైన అత్యంతాభావము వివరింప బడియున్నది. పూర్వోక్తమైన త్రివిధ అభావముల కన్నింటికి అన్యమైనది అత్యంతాభావమని భావము. దానినే 'ఉక్తా భావత్రయభిన్నో యోఽభావః సోఽత్యంతాభావ ఇతి' (వై. సూ. వి. 9.1.5) అని పూర్వార్థమునే స్పష్టముగ దెలుపు చున్నది. ఎట్లన 'తత్ర ప్రాగభావస్య ఉత్తరావధికత్వం ప్రధ్వం సస్య పూర్వావధికత్వం, అన్యోన్యాభావస్య ప్రతియోగి సమా నాధికరణత్వం' (వై. సూ. వి. 9.1.5) వీనిలో ప్రాగభావము నకు నుత్తరావధియు, ప్రధ్వంసమునకు బూర్వావధియు, అన్యోన్యాభావమునకు ప్రతియోగసమానాధికరణత్వములుండ, 'అత్యంతాభావస్య తు త్రితయవైధర్మ్యం' (వై. సూ. వి. 9. 1.5) అత్యంతాభావము ఆమూడింటికి వైధర్మ్యము గలిగియున్న దని వివృత్తికారుని వ్యాఖ్యానము. 'అభూతం నాస్తీత్యనర్థాం తరం' (వై.సూ. 9.1.9) ఎప్పుడును లేనిదే అభూత మని వచింప బడుచున్నది. ఈవస్తువు లేదు అనుట ప్రధ్వంసాభావము తెలుపుచుండ, ఉన్నట్లుగ వ్యవహారములేనిది అత్యంతాభావ ముగ బరిగణింపబడును. అందుచేత 'అభూతమిత్యుత్పాద వినాశానాలంబనత్వం ద్యోతయతి' (వై. సూ. ఉ. 9.1.9) ఉత్పత్తివినాశనములు లేకుండుదానిని అభూతమనియు దానినే అత్యంతాభావమనియు సందురు. 'ఏవం చ యద్వస్తు యత్ర న కదాఽపి భవిష్యతి న చ కదా

చిద్భూతం తస్య వస్తునస్త్రాత్యంతాభావో మంతవ్యః' (వై. సూ. ఉ. 9.1.9) ఎప్పుడు వస్తువు పూర్వాపరములందు లేకున్నదో, అది అత్యంతాభావముగ గ్రాహ్యము. భూతభవిష్యత్కాలములపై నాధారపడియుండు ప్రధ్వంస ప్రాగభావములవలెగాక 'అతఏవాయమాత్యంతికస్త్రైకాలిక ఇత్యభిధీయతే' (వై. సూ. ఉ. 9.1.9) అత్యంతాభావము త్రైకాలికముగ నుండును. అందుచే నిది 'సనాతనశ్చ' (వై. సూ. వి. 9.1.5) సనాతనము అనగా నిత్యముగా చెప్పబడియున్నది.

### సామయికాభావము

పైనుదాహరింపబడిన జతుర్విధ అభావములుగాక 'నాస్తి ఘటో గేహే ఇతి సతో ఘటస్య గేహసంసర్గప్రతిషేధః' (వై. సూ. 9.1.10) ఇంట ఘటములేదు అను వ్యవహారము నభావమగు ఘటమునకు గృహమునకును సంబంధముగలదు. ఇచ్చట, ఘటాభావమునకు 'నత్యంతాభావః' (వై. సూ. ఉ. 9.1.10) అత్యంతాభావము నన్వయించుటకు వీలులేదు. ఎందులకన 'కదాచిత్తత్ర ఘటసత్వాత్' (వై. సూ. ఉ. 9.1.10) మరొక స్థానమున ఘటముండుట కారణము. 'నాపి ప్రాగభావప్రధ్వంసౌ' (వై.సూ.ఉ. 9.1.10) ప్రాగభావ ప్రధ్వంసములునుగావు. 'తయోః సమవాయికారణమాత్రవృత్తిత్వాత్' (వై. సూ. ఉ. 9.1 10) ఆరెండును, సమవాయి కారణముపై నాధారపడియుండును. 'నాప్యుత్పాదవినాశశీలోఽత్యంతాభావ ఏవ' (వై.సూ. ఉ. 9.1.10) ఉత్పత్తివినాశ

రహితమగు అత్యంతాభావమును కాదు. 'ఆత్యంతికశ్చోత్పా దవినాశనశీలశ్చేతి విరోధాత్' (వై. సూ. 9 1.10) అత్యంతా భావమునకును, ఉత్పత్తివినాశ శీలత్వమునకు విరోధత్వ ముండుటచేత కానేరదు. ఇక 'నాపి చతుర్థ ఏవాయం సంసర్గా భావః' (వై.సూ.ఉ. 9.1.10) నాల్గవదియగు సంసర్గాభావము కాదు. ఆద్యత్రియఅభావములును లేకుండుటచేతనని ఉప స్కార కారుడు వివరించియున్నాడు. అందుచే గృహమున ఘటము ఒకకాలముననుండి మరొకకాలమున మాత్రము లేకుండుట ఒక విధమైన అభావరూపముగ నున్నది. ఈ యభావము పూర్వోక్త అభావచతుష్టయమున నన్వయింప నసాధ్యము. ఇచ్చట ఘటాభావము తాత్కా లికముగ గోచరించును. పూర్వస్థానమునకు మరల ఘటము ప్రవేశించియున్నచో, సామయికాభావమని శాస్త్రజ్ఞులందురు. 'యత్ర భూతలే పూర్వం ఘటాదికం స్థితమథాపసారితం పునరా నీతం చ'(వై.సూ.వి. 9.1 5)ఎప్పుడుభూతలమున ఘటాదులుండి తర్వాత తీసివేయబడి మరల పెట్టబడినవో, ఆపూర్వాపరములకు మధ్యగల ఘటాభావమును, 'సామయికనామా చతుర్థః సంస ర్గాభావ ఏవ ప్రతీయతే' (వై. సూ వి. 9.1.5) చతుర్థమగు సంసర్గాభావము సామయికాభావముగ ప్రతీతి అని వివృత్తి కారుని వివరణము.

అందుచే ద్రవ్యముయొక్క అస్తిత్వమునకు దోడుగ అభావరూప నాస్తిత్వముగూడ బ్రధానమగుటచే ద్రవ్యగుణ, కర్మ,సామాన్య,విశేష,సమవాయములలో నభావమునకుగూడ కొందరు వైశేషికసిద్ధాంతులు సమానప్రతిపత్తినొసంగి వైశేషిక

మునకు సప్తపదార్థియనియు బ్రఖ్యాతి నార్జింపజేయుట సముచిత మేయని తోచెడిని. దీనివలన పృథివ్యాది ఆత్మపర్యంతమగు నవద్రవ్యములయొక్క ద్రవత్వాది అభావపర్యంత లక్షణవిచారము సేయుటే 'తత్త్వం జ్ఞాయతేఽనేనేతి తత్త్వజ్ఞానం' (వై.సూ.ఉ. 1.1.4) అని నిర్వచింపబడిన తత్త్వజ్ఞానముగాన, 'ఏతాదృశం తత్త్వజ్ఞానం వైశేషికశాస్త్రాధీనం (వై. సూ. ఉ. 1.1.4) ఆతత్త్వజ్ఞానము వైశేషిక శాస్త్రాధీనమగుటచేతను, 'ఆత్యంతిక దుఃఖనివృత్తి' రూప నిశ్శ్రేయసనిద్ధికై యీసిద్ధాంతము నింకను దరచి చూచెదముగాక.

## సృష్టి చింతనము

ఇంతవరకు ప్రపంచసృష్టి కాధారభూతములగు పృథివ్యాదికమును, వాని విశిష్టములగు ద్రవ్యాదుల గ్రహించి యున్నాము. కాని యీ ద్రివ్యములు ఉత్పాద్యములా? ఎట్లు? ఉత్పాదనమునకు గారకులెవరు? ఉత్పత్తి సామగ్రి ఎద్ది? అను ప్రశ్నపరంపరలకు వైశేషికమెట్లు సమాధానమొసంగెనో ఎట్లు సమర్థించెనో కనుగొందము.

పూర్వోక్తవిధానమున లోకవ్యవహారాపేక్షిక దృష్టి తిలకించినచో సావయవపదార్థములన్నియు బరాపేక్షికములై కారణాధీనమై యుండును. కావుననే 'కారణాభావాత్ కార్యాభావః' (వై సూ. 1.2.1) కారణములేకున్న కార్యమే అభావ మగుచున్నదని నుడువబడియున్నది. కారణములు నాబడు సమవాయాసమవాయనిమిత్తములలో 'కారణమితి ద్రవ్యే కార్య

సమవాయాత్' (వై. సూ. 10.2.1) అను సూత్రవిధానమున గార్యములో నిమిడియున్న ద్రవ్యరూపకారణము సమవాయము కాన, నిదియే ద్రవ్యోత్పత్తికి మూలకారణ మగుచున్నది. అసమవాయము క్రియారూపమై ఉత్పత్తికి హేతువగుచున్నది. నిమిత్తముగూడ నుత్పత్తికి గారణము. కావున పృథివ్యాది ద్రవ్యనవకమునకు వానివలనగల్గిన యీయనంతసృష్టికి యీ త్రివిధకారణము లెట్లున్నవో గ్రహింతము.

సర్వద్రవ్యముల కాధారముగ సృష్టికిపూర్వము, సృష్టి అనంతరమును, సర్వగతముగ 'పార్థివా జలీయాః తైజసా వాయవీయాశ్చ పరమాణవః సర్వాసు దిక్షు సర్వేషు దేశేషు చ సంతి' (వై. సూ. వి. 4.2.6) పృథివ్యప్తేజోవాయుసంబంధముగ పరమాణువులు సర్వదిక్కుల సర్వదేశముల నావరించియుండును. అవి మూర్తివంతములగుటకు బూర్వము యీపరమాణువులు 'పరమాణోర్మహత్త్వాభావాన్న ప్రత్యక్షమితి భావః' (వై. సూ. వి. 4.1.6) మహత్త్వరూపవ్యాప్తి లేకుండుటచే నప్రత్యక్షములై 'పరమాణుత్వపరమహ్రస్వత్వే పరమాణువర్తినీ' (వై. సూ. ఉ. 7.1.8) అను సూత్రవివరణమురీతి అత్యల్ప హ్రస్వత్వ విశిష్టమై పరమాణువులుండును. వాని అస్తిత్వ నిరూపణార్థము 'పరమాణుసిద్ధిప్రకారస్తు త్రసరేణుః' (వై. సూ. వి. 2.1.12) త్రసరేణువు నాబడు సూర్యరశ్మియందుగోచరించు రేణువును గొంతవరకు నుదాహరింపనగును. కాని యాత్రసరేణువు 'సావయవశ్చాక్షుషద్రవ్యత్వాత్ ఘటవత్ త్రసరేణోరవయవాః' (వై. సూ. వి. 2.1.12) ఘటాదులవలె త్రసరేణువు నేత్రదృష్టి గోచరమై యుండుటచే నదియు సావయవి యగుచున్నది. కాన

'తస్మాన్నిరవయవం ద్రవ్యమవధిః స ఏవ పరమాణుః' (వై. సూ. ఉ. 4.1.2) సావయవియగు ద్రవ్యమునకు నిరవయవి యవధిగా నుండవలయునుగాన నిరవయవియగుచు బరమావధియగునది పరమాణువే యగును. దృశ్యమానమగు సర్వేంద్రియముల కంటె నతిసూక్ష్మమగు త్రసరేణువుకంటె బరమసూక్ష్మమై 'అనిత్య ఇతి విశేషతః ప్రతిషేధభావః' (వై. సూ. 4.1.4) ప్రతిషేధమగు ననిత్యత్వము విశేషముల నాశ్రయించియుండు ననురీతిగ అనగా సావయవుల ననిత్యముండునుగాన 'తథా చావయవీ న నిత్య' (వై. సూ. వి. 4.1.4) అవయవి అనిత్యమగును గాన సర్వాధిష్ఠానమైనది నిత్యమగుట సిద్ధాంతమగుటచే 'తస్మాన్నిరవయవం ద్రవ్యమవధిః' (వై.సూ.ఉ 4.1 2) అనుటయు చాల సమంజసముగనున్నది. అందుచే సర్వసృష్టికవధిగా పరమాణువు గలదని నిర్ణయము. ఇక 'నిత్యం పరమాణుత్పత్తి' (వై. సూ. ఉ. 7.1.11) పరమాణువు నిత్యమైనదనియు గ్రాహ్యము. అట్టిచో 'పరమాణోరనిత్యత్వవిషయా సర్వాప్యనుమితిః అవిద్యా భ్రమరూపా ఆభాసప్రభవత్వాత్' (వై. సూ. ఉ. 4.1 5) పరమాణువు అనిత్యమనుట కేవలము అవిద్య, భ్రాంతి, ఆభాస జనితముగ నుండుననుట నిర్వివాదము. కావున నిత్యమగు బరమాణువు 'పరమాణురూపస్య మూలకారణస్య సిద్ధిః' (వై. సూ వి. 4.1.2) సర్వసృష్టికి మూలకారణమగుట సిద్ధమైనదని ముఖ్య తాత్పర్యము.

పై వివరింపబడిన పరమాణువులు 'నిత్యం పరిమండలం' (వై.సూ. 7.1.20) అను సూత్రరీతి నిత్యములు. 'పరిమండలశబ్దో పరమాణుపరిమాణం తద్విశిష్టం పరిమాణం చ పరిభాషయా

నదృష్టమే నియమించుచున్నది. అనగా ఈశ్వరసంకల్ప హేతువు అదృష్టమే అనుచున్నది. కాన పై వచింపబడిన తెరంగున సృష్టికి ఉపాదానములగు పరమాణువులలో, నీశ్వరాపేక్షయు అదృష్టకర్తృత్వమును కలిసి జీవ పూర్వకర్మానుసారముగా స్పందనరూప ఆద్యకర్మ కలిగించుచున్నది. ఇచ్చట అదృష్టము 'ధర్మాధర్మావదృష్టం స్యాత్' (కారికావళి. 161) ధర్మాధర్మ రూపమని కారికావళీకర్త నిర్వచించియున్నాడు. అందుచే ధర్మాధర్మరూపమున నున్న జీవగత పూర్వకర్మప్రాబల్యమున నీశ్వరసృష్టిసంకల్పముగలిగి జగదుత్పత్తి పరమాణుసమవాయ త్వమున నగుచున్నదని తాత్పర్యము.

ఇట్లు పరమాణుకోటిలో స్పందన మేర్పడినతోడనే 'క్రియావత్త్వాద్గుణవత్త్వాచ్చ' (వై. సూ. 2.1.12) పరమాణువులు క్రియాగుణముల గలిగియుండుటచేత, అనగా 'ద్వ్యణుకారంభక సంయోగాదిరూపగుణవత్త్వం తదనుకూలక్రియావత్త్వం చ పరమాణావశ్యమంగీకార్యమితి' (వై.సూ. వి. 2.1.12) పరమాణువులలో ద్వ్యణుకోత్పత్తికారకమగు సంయోగరూప గుణమును, తదనుకూలక్రియయు నుండుట యంగీకార్యమనుటచే, పరమాణువులనుండి ద్వ్యణుకోత్పత్తి యేర్పడుచున్నది. ఈ క్రియాగుణము పరమాణువులలో నంతర్గతముగనే యున్నది. ఏతత్కారణమున ద్వ్యణుకములనుండి త్రసరేణువు లనబరగు త్ర్యణుకములును, చతుష్కములును వానిననుసరించి పృథివ్యాది భూతకోటియు నుత్పత్తినొందెను. 'తత్ర పరమమహత్త్వపరమదీర్ఘత్వే విభుచతుష్టయవర్తినీ, పరమాణుత్వపరమహ్రస్వత్వే పరమాణువర్తినీ, అవాంతరాణుత్వావాంతరహ్రస్వత్వే ద్వ్యణు

నదృష్టమే నియమించుచున్నది. అనగా ఈశ్వరసంకల్ప హేతువు అదృష్టమే అనుచున్నది. కాన పై వచింపబడిన తెరంగున సృష్టికి ఉపాదానములగు బరమాణువులలో, నీశ్వరాపేక్షయు అదృష్టకర్తృత్వమును కలిసి జీవ పూర్వకర్మానుసారముగా స్పందనరూప ఆద్యకర్మ కలిగించుచున్నది. ఇచ్చట అదృష్టము 'ధర్మాధర్మావదృష్టం స్యాత్' (కారికావళి. 161) ధర్మాధర్మ రూపమని కారికావళీకర్త నిర్వచించియున్నాడు. అందుచే ధర్మాధర్మరూపమున నున్న జీవగత పూర్వకర్మప్రాబల్యమున నీశ్వరసృష్టిసంకల్పముగలిగి జగదుత్పత్తి పరమాణుసమవాయ త్వమున సగుచున్నదని దాత్పర్యము.

ఇట్లు పరమాణుకోటిలో స్పందన మేర్పడినతోడనే 'క్రియావత్త్వాద్గుణవత్త్వాచ్చ' (వై. సూ. 2.1.12) పరమాణు వులు క్రియాగుణముల గలిగియుండుటచేత, అనగా 'ద్వ్యణు కారంభక సంయోగాదిరూపగుణవత్త్వం తదనుకూలక్రియా వత్త్వం చ పరమాణావశ్యమంగీకార్యమితి' (వై.సూ. వి. 2.1.12) పరమాణువులలో ద్వ్యణుకోత్పత్తికారకముగా సంయోగరూప గుణమును, తదనుకూలక్రియయు నుండుట యంగీకార్యమనుటచే, పరమాణువులనుండి ద్వ్యణుకోత్పత్తి యేర్పడుచున్నది. ఈ క్రియాగుణము పరమాణువులలో నంతర్గతముగనే యున్నది. ఏతత్కారణమున ద్వ్యణుకములనుండి త్రసరేణువు లనబరగు త్ర్యణుకములును, చతురణుకములును వానిననుసరించి పృథివ్యాది భూతకోటియు నుత్పత్తినొందెను. 'తత్ర పరమమహత్త్వపరమ దీర్ఘత్వే విభుచతుష్టయవర్తినీ, పరమాణుత్వపరమహ్రస్వత్వే పరమాణువర్తినీ, అవాంతరాణుత్వావాంతరహ్రస్వత్వే ద్వ్యణు

కవర్తినీ' (వై. సూ. ఉ. 7.1.8) సర్వవ్యాప్తములగు నాకాశ కాల దిగాత్మలు నాచతుష్టము, అణుపరిమాణమగు మనస్సు, మధ్యమపరిమాణముగల పృథివ్యాదిభూతములును మొదలగు బదార్థములు పరమాణువులనుండి జనించెను. అందు 'తథా చాకాశవత్ పరమాణులక్షణో వాయుర్ద్రవ్యం' (వై. సూ. ఉ. 2.1.11)అట్లు ఆకాశమువలెపరమాణులక్షణముగలిగినద్రవ్యమగు టచే వాయువు పరద్రవ్యాశ్రయములేని శుద్ధద్రవ్యమైయున్నది. అందుచే నది నిత్యమైగూడ నొప్పొందుచున్నది. ఆకాశాత్మలు గూడ సర్వవ్యాప్తములై నిత్యములై 'గగనాదావంత్యావయవిని' (వై. సూ. వి. 1.1.9) గగనము నిరవయవి యనురీతి పరమాణుజన్యమై రాజిల్లుచున్నది. పూర్వోక్తవిధానమున నిత్యత్వము నిరవయవికే యుండునుగాన, అనిత్యమగుదానికి సావయవత్వముగాన, 'తథా చావయవీ న నిత్య ఇతి ప్రతిషేధో భవతి' (వై.సూ. వి. 4.1.4) అనురీతి అవయవి అనిత్యమై యుండును. ఆకారణమున నిరవయవములగు వాయు,ఆకాశాత్మ దిక్కులు నిత్యములుగా బరిగణింపబడియున్నవి. వీనికి కేవలము పరమాణువులే సమవాయములుగా నుండును.

అట్లుకాక, అనగా పరమాణుసమవాయములుగాక ద్వ్యణుకాది కల్పితమైన ద్రవ్యములు అనిత్యములై మధ్యమ పరిమాణయుక్తములై యుండును. ఆద్రవ్యము లేర్పడుటకు కేవలము పరమాణువులుకాక 'ఇత్యభిధానాత్ పరమాణుభ్యాం ద్వ్యణుకారంభాత్ ద్వ్యణుకాదిప్రక్రమేణావయవినో మహాత ఆరంభస్యోపాదనీయత్వాదితి' (వై.సూ.ఉ. 2.1.11) అని ఉప

స్కారవివరణము. రెండు పరమాణువులుకలిసి ద్వ్యణుకము లేర్పడుచున్నవిగాన, సర్వసృష్టియొక్క సమవాయకారణము ద్వ్యణుకత్ర్యణుకాది క్రమసంయోగములచేత నేర్పడుచున్నది. ఈద్వ్యణుకాదులే అవయవిద్రవ్యములై అనిత్యములై అన్యద్రవ్యకారణములై యున్నవి. 'అణుత్వం హి కార్యం ద్వ్యణుకమాత్రవృత్తి, నిత్యం పరమాణువృత్తి' (వై. సూ. ఉ. 7.1.11) అనురీతి పరమాణువునకు నిత్యత్వమే లక్షణమైయుండ ద్వ్యణుకమునకు హ్రస్వత్వము లక్షణమై యొప్పారుటచే,ద్వ్యణుకకృత ద్రవ్యము హ్రస్వపరిమాణవిశిష్టమైయుండును. 'తత్ర కారణబహుత్వం కేవలం త్ర్యణుకే మహత్త్వదీర్ఘత్వే జనయతి' (వై. సూ. ఉ. 7.1.9) వీనిలో త్ర్యణుకములు 'కారణబహుత్వాచ్చ' (వై. సూ. 7.1.9) అనురీతి కారణబహుత్వముచే మహత్త్వదీర్ఘత్వముల గలుగజేయుచున్నవి. ఈ బహుత్వమునకు గూడ 'తచ్చ బహుత్వమీశ్వరాపేక్షాబుద్ధిజన్యం' (వై. సూ. ఉ. 7.1.9) అను వాక్యానుసారముగ నీశ్వరబుద్ధ్యపేక్ష గలదు.

సృష్టికి సమవాయమొసంగుచున్న పరమాణువులు 'క్రియావత్త్వాద్గుణవత్త్వాచ్చ' (వై. సూ. 2.1.12) అను సూత్రప్రకారము క్రియాగుణవిశిష్టములై యుండును. అవి గూడ 'ఏవం చ పృథివ్యాదౌ యథా పరమాణు స్తథా వాయుస్థలేఽపి' (వై.సూ. వి. 2.1.12) అందుచే బృథివ్యప్తేజములలో వలె వాయువునందుగూడ పరమాణువులు తమతమ విశిష్ట ధర్మములతో నుండును. ఈ వివిధ గుణవిశిష్ట పరమాణువులు 'ద్రవ్యగుణయోః సజాతీయారంభకత్వం సాధర్మ్యం' (వై.సూ. 1.1.9) ద్రవ్యగుణములు తమతమ సజాతీయ ద్రవ్యగుణములనే

కలుగజేయు ననురీతి, 'పార్థివాః పరమాణవః పార్థివద్వ్యణుక మారభంతే' (వై.సూ.వి. 1.1.9) పృథ్వీద్రవ్యపరమాణువులు పృథ్వీగుణయుక్త ద్వ్యణుకత్ర్యణుకాదులను గలిగించును. 'పార్థివా జలీయాః తైజసా వాయవీయాశ్చ పరమాణవః సర్వాసు దిక్షుసర్వేషు దేశేషు చ సంతి' (వై.సూ.వి. 4.2.6) పృథివ్యాప స్తేజ వాయుద్రవ్య పరమాణుకోటి సర్వత్ర అనంతముగ నుండుటచే ఆ యా ద్రవ్యోత్పత్తి యనంతముగానగుచు, సృష్టియు ననంతమై అవిచ్ఛిన్నమై యలరారుచున్నది.

సృష్టమగు ద్రవ్యములలో 'మహత్వనేకద్రవ్యవత్వాత్ రూపాచ్చోపలబ్ధిః' (వై సూ. 4 1.6) అనేకద్రవ్యత్వముండుటచే నేది మహత్వమగుచున్నదో, దానికి రూపముండుటచే నది దృగ్గోచరమగుచున్నది. కాని మహత్వపరిమాణమున్నమాత్రమున దృగ్గోచరము కానవసరములేదు. దానికి ఉదాహరణము వాయువు. వాయువునకు అనేకద్రవ్యత్వలోపముండుటచే నది దృగ్గోచరము అగుటలేదు. కాని దానికి స్పర్శసమవాయము మాత్రము గలదు. కాబట్టి 'అనేకద్రవ్యసమవాయాత్ రూపవిశేషాచ్చ రూపోపలబ్ధిః' (వై. సూ. 4 1.8) అనేక ద్రవ్యసంయుక్తమగుటచే రూపవిశిష్టములై ద్రవ్యములు దృగ్గోచరములగుచున్నవి. అనేకద్రవ్యములనగా పరమాణు ద్వ్యణుకములు గాక 'త్రిసరేణుప్రభృతి తత్సమవాయాత్' (వై.సూ.ఉ.4 1.8) త్రసరేణువులనుండి అన్యద్రవ్య ద్వ్యణుకత్ర్యణుకాదులని యర్థము. ఈవిధముగనే 'తేన రసగంధస్పర్శేషు జ్ఞానం వ్యాఖ్యాతం' (వై. సూ. 4.1.9) రసగంధస్పర్శజ్ఞానము గ్రాహ్యము. ఎవ్విధమైన

ఆటంకములు లేనప్పుడు యీగుణములు యిందిృయగోచరము లగుచుండునని భావము.

ఈయనంతసృష్టికి సమవాయికారణమని వ్యవహరింపబడు కారణము పరమాణువులనియు తత్సంఘాతములగు ద్వ్యణుకత్ర్యణుకాదులనియు సువిదితము. పరమాణువులలో ఆద్యకర్మనాబడు స్పందనము 'అణూనాం ఆద్యకర్మాదృష్టకారితం' (వై. సూ. 5.2.13) అదృష్టమను కారణమున జరుగుచున్నది. ఈ యదృష్టము 'మణిగమనం సూచ్యభిసర్పణమిత్యదృష్టకారణం' (వై. సూ. 5.1.15) మణినామక స్వర్ణ జలకలశము చోరాభిముఖముగా నడచుట, అయస్కాంతాభిముఖముగా సూది గమనముచేయుట, 'అగ్నేరూర్ధ్వజ్వలనం వాయోస్తిర్యక్పవన మణూనాం మనసశ్చాద్యకర్మాదృష్టకారితం' (వై.సూ. 5.2.13) అగ్నిఊర్ధ్వముగ జ్వలించుట, వాయువు పార్శ్వములకు వీచుట, అణుపుంజము మనస్సు తొలుత ప్రవృత్తమగుటయు, 'తద్విశేషేణాదృష్టకారితం' (వై. సూ. 5.2.2) విపరీతకర్మలనబరగు భూకంపనాదులును 'వృక్షాభిసర్పణమిత్యదృష్టకారితం' (వై. సూ. 5.2.7) వృక్షము లందు రసమూర్ధ్వముఖముగా ప్రవహించుటయు, 'రాగద్వేషౌ' (వై. సూ. ఉ. 6.2.12) రాగద్వేషములు జనించుట మొదలగు అనేక అనిర్వాచ్యకర్మలకు 'అదృష్టాచ్చ' (వై. సూ. 6.2.12) అదృష్టమే కారణముగా చెప్పబడుచున్నది. మణియుదాహరణములో జోరుని పూర్వకృతకర్మయనబడి అసమవాయముగను, భూకంపనాది కార్యములలో దత్కార్యఫలభోక్తలగు ప్రజానీకముయొక్క పూర్వకర్మనాబడు అసమవాయికారణముగను, వృక్షదృష్టాంతమున పెంచువాని పూర్వకర్మనా అసమవాయము

గను నీటియొక్క సమవాయకారణముగను, అణుమనముల ఆద్యకర్మలో నాయాజీవుల పూర్వకర్మాభావముచే కేవలాసమవాయికారణముగను, రాగద్వేషాదులవిషయమున అనగా సర్పాదులపై అకారణద్వేషాదులందు నసాధారణకారణముగను, అదృష్టము అలరారుచున్నది.

మరియు, 'కారణబహుత్వాచ్చ' (వై. సూ. 7.1.9) కారణబహుత్వమువలన అను సూత్రవివరణమున 'తచ్చ బహుత్వమీశ్వరాపేక్షా బుద్ధిజన్యం' (వై. సూ. ఉ. 7.1.9) ఆబహుత్వము ఈశ్వరాపేక్షాబుద్ధివలన గలుగుచునుచు, 'తద్బుద్ధేరనేకవిషయత్వేప్యదృష్టవిశేషోపగ్రహో నియామకః' (వై. సూ. ఉ. 7.1.9) ఈశ్వరబుద్ధిలో నానావిషయత్వము అదృష్టవిశేషమున జరుగును అని తీర్మానింపబడుచున్నది. కాన యదృష్టమున జీవకృత పూర్వకర్మఫలమని సాధారణార్థముగ స్వీకరింపనగును. అట్లు అదృష్టము సృష్టికి అసమవాయికారణముగ నేర్పడ ఈశ్వరబుద్ధి యనబడు సంకల్పము నిమిత్తకారణముగా నగుచున్నది. అనగా నదృష్ట మచేతనమైయుండుటచేత జేతనుడగు నీశ్వరుడు నిమిత్తకారణుడై పరమాణుస్పందనజన్య సృష్టికి బరనుకారణ మగుచున్నాడనుటకు నవకాశమేర్పడుచున్నది.

అంతియకాక 'కారణే కాలః' (వై. సూ. 7. 1. 25) సూత్రమునకనుసరించి 'సర్వోత్పత్తిమన్నిమిత్తకారణత్వం కాలస్య ప్రతీయతే' (వై. సూ. ఉ. 7.1.25) ఉత్పాద్యములగు సర్వమునకు గాలము నిమిత్తకారణమై యొప్పొందుచున్నది. అనిత్య వస్తుసంచయమునకు గాలము నిమిత్తకారణముగా 'కాలస్య సర్వో

త్పత్తిమన్నిమిత్తకారణత్వం' (వై.సూ.ఉ.2.2.9) అను సూత్రి వ్యాఖ్యగూడ వివరించియున్నది.

పై మీమాంసయందు సృష్టికి గారణములైన సమవాయములగు బరమాణువుల జర్చించి వానికి స్పందనహేతువుగ నున్న అదృష్టవిచారణము గావించియుంటిమి. ఇందుమూలమున సృష్టియొక్క ఉత్పత్తిరహస్యము చాలవరకు గ్రహింపబడినట్లు అగుచున్నది.

---

ఈశ్వరప్రశంస

వైశేషికమున నీశ్వరున కెట్టి స్థానమీయబడియున్నదో పూర్వము క్లుప్తముగా చూచియున్నాము. ఆవిషయమింక సుమంత పరిశీలించెదముగాక. శ్రీకణాదప్రోక్త సూత్రపాఠములలో యెచ్చోటనైనను నీశ్వరునినామము ప్రత్యక్షముగ నగోచరము. కాని వైశేషికసూత్రములకు 'పదార్థధర్మసంగ్రహ' నామమున భాష్యమును నిర్మించిన ప్రశస్తపాదుడు ఈశ్వరునకు బ్రాధాన్యతనొసంగి, అచేతనములగు బరమాణువులలో సృష్ట్యాదినిజరుగు స్పందనమునకు నీశ్వరునే నిమిత్తకారణముగ జేసెనని కొందరి అభిప్రాయము. ఉపస్కారనామక వ్యాఖ్యకర్తయగు శంకరమిశ్రులుగూడ అవసరమునుబట్టి ఉచితరీతి సూత్రములలో నాపదము లేకున్నను, తనవ్యాఖ్యలో నీశ్వరపదము నుపయోగించియున్నారు. శ్రీకణాదమునీంద్రుని చిత్తమునకు నీ శాస్త్రము కేవలము పదార్థనిరూపణశాస్త్రమైయుండుటచేనీతడు ఈశ్వరప్రశంస అప్రస్తుతమని వదలివేసినను, తర్వాత సిద్ధాం

తులు, సూత్రముల గర్భితముగనున్న ఆఈశ్వరభావమును బహిర్గత మొనరించినట్లు తోచుచున్నది.

సాక్షాత్తు సూత్రములలో శాస్త్రారంభమునను, అంతమునను 'తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యం' (వై.సూ.1.1.3, 10.2.9)అనుచు తన శాస్త్రమునకు ప్రమాణము ఈశ్వరప్రోక్తమైన వేదమేయని శ్రీకణాదమహర్షి స్పష్టముగ వ్యక్తపరచెను. ఈ సూత్రముల 'తత్' అను పదమునకు 'తదిత్యనుపక్రాంతమపి ప్రసిద్ధిసిద్ధతయేశ్వరం పరామృశతి' (వై. సూ. ఉ. 1.1.3) విశ్వప్రసిద్ధిగా అనుమానితమగుచుండుటచే పూర్వప్రస్తావన లేకున్నను 'తత్' పదము ఈశ్వరునకే యన్వయమగునని శంకరానందుని తాత్పర్యము. ఈవిషయమునే ప్రస్తావించి గ్రంథసమాప్త సూత్రవ్యాఖ్యానమున 'తద్వచనాత్తేనేశ్వరేణ వచనాత్' (వై. సూ. ఉ. 10.2.9) ఈశ్వరవచనముకావుటచే వేదము ప్రమాణమనియు నతడు వివరించియుండెను. వేదములు శాసనములగుటచే శాసించు వాడొకడుండుట న్యాయము. కాని సహస్రాధిక శాఖోపశాఖలుగల నావేదకర్తృత్వము అస్మదాదులకలభ్యము. అంతియగాక వేదవిషయము నిర్విషయకముగ అతీంద్రియముగకూడ నున్నది. అతీంద్రియవిషయ వివరణము ఇంద్రియబద్ధులమగు మానవమాత్రులము కావింపనేరము. మరియు వేదము మహాజనపరిగ్రహణము నార్జించియుండుటచే నది సామాన్య పురుష నిర్మితము కానేరదు. కర్తృత్వము పస్ఫుటము వ్యక్తము కానంతమాత్రమున

దోషము లేదు. అనుశ్రుతముగ నీశ్వర కర్తృత్వము తెలియబడుచునేయున్నది. అంతియగాక సహస్రాధిక శాఖోపవిశిష్టమగు వేదకర్త స్వస్వతంత్రుడై సర్వజ్ఞుడై యుండవలెను. అది మానవులయెడ అభావము. అందుచే 'వేదే వక్తా యః స్వర్గాపూర్వాదివిషయకసాక్షాత్కారవాన్' (వై. సూ. ఉ. 10.2.9) వేదవక్త స్వర్గాదివిషయకపరిజ్ఞానశీలుడై యుండవలయునుగాన 'తాదృశశ్చ మహేశ్వరాదన్య ఇతి సుష్ఠు' (వై.సూ. ఉ. 10.2.9) అట్టివాడు ఈశ్వరునకన్యము కాదనియు నందుచే నీశ్వరుడే వేదకర్తయనియు శంకరానందుని సంపూర్ణవివరణము. ఇదేవిధముగ 'ఈశ్వరస్యాప్రకాంతత్వేపి ప్రసిద్ధార్థకేన తచ్ఛబ్దేన పరామర్శో భవతి' (వై. సూ. వి. 1.1.3) పూర్వమే ప్రసిద్ధమైన ఈశ్వరుడే 'తత్' పదమునకు నన్వయమని వివృత్తి కూడ ఉపస్కారమును బలపరచుచున్నది.

అట్లే 'సంజ్ఞాకర్మ త్వస్మద్విశిష్టానాం లింగం' (వై. సూ. 2.1.18) సంజ్ఞాకర్మలు మనకంటె విశిష్టుల సూచించును అనియు 'ప్రత్యక్షప్రవృత్తత్వాత్ సంజ్ఞాకర్మణః' (వై. సూ. 2. 1.19) సంజ్ఞాకర్మలు ప్రవృత్తములు అను సూత్రద్వయములో నీశ్వరప్రస్తావన గలదని వ్యాఖ్యాతల వాదము. అందు 'సంజ్ఞానామ కర్మ కార్యం క్షిత్యాది' (వై. సూ. ఉ. 2.1.18) అను సూత్రవ్యాఖ్యానము సంజ్ఞయన నామమనియు గర్మయన పృథివ్యాదిభూతకార్యములనియు వివరించి 'తదుభయమస్మద్విశిష్టానాం ఈశ్వరమహర్షీణాం సత్త్వేపి లింగం' (వై.సూ.ఉ. 2. 1.18) ఈరెండును మానవులకంటె విశిష్టులగు ఈశ్వరమహర్షిగణముల నిరూపించుననియు, ఉపస్కారము వాకొనెను. 'ఘట

పటాదిసంజ్ఞానివేశనమపి ఈశ్వరసంకేతాధీనమేవ' (వై. సూ. ఉ. 2.1.19) ఘటపటాదినామములుకూడ ఈశ్వరసంకల్పాధీనమే యగును. అంతియుగాని 'యః శబ్దో యత్రేశ్వరేణ సంకేతితః స తత్ర సాధుః' (వై. సూ. ఉ. 2.1.19) దేని కేది నామముగ నీశ్వరుడు సంకల్పము చేయునో అది దాని కన్వయమగును. 'తథా చ సిద్ధం సంజ్ఞాయా ఈశ్వరలింగత్వం' (వై. సూ. ఉ. 2.1.19) అట్లు నామములు ఈశ్వరాస్తికతకు నిరూపకములు. 'ఏవం కర్మాపి కార్యమపీశ్వరలింగం' (వై. సూ. ఉ. 2.1.19) అట్లే కర్మగూడ ఈశ్వర చిహ్నమే యని శంకరానందుడు వ్యాఖ్యానించియున్నాడు. ఇంతకంటె వివృత్తికారుడు 'ఇదానీమీశ్వరప్రకరణారబ్ధమితి భావః' (వై.సూ.వి. 2.1.18) ఇట ఈశ్వరప్రతిపాదనాప్రకరణ మారంభింపబడుచున్నదని యింక కొంచెము ముందుకు సాగెను. అనగా నీసూత్రములు ప్రత్యేకముగ నీశ్వరుని ప్రతిపాదించునని ధృవపరచుచున్నాడు. సంజ్ఞాకర్మలు 'సర్వజ్ఞైశ్వర్యసంపన్నానాం ఈశ్వరమహర్షీణాం' (వై. సూ. వి. 2.1.18) సర్వజ్ఞత్వాది ఐశ్వర్యసంపన్నులగు ఈశ్వరమహర్షుల తెలుపునని అతడు వ్రాసెను. అంతియగాక 'యద్యపీదం పూర్వముక్తం తథాపి దార్ఢ్యార్థమీశ్వరాద్యనుమానకథానార్థం చ పునర్వచనం' (వై. సూ. వి. 2.1.18) ఈవిషయము పూర్వోక్తమైయున్నను, ఈశ్వరాస్తికతా నిరూపణ దార్ఢ్యతకొరకు పునర్వచనము చేయబడియున్నదని సుదృఢము చేసియున్నాడు. 'అతః నిఖిలసాధుసంజ్ఞాకర్తృత్వాదృశసంజ్ఞిప్రత్యక్షస్య క్షిత్యాదికార్యకర్తుస్తదుపాదానప్రత్యక్షస్య చావశ్యకత్వాత్ సర్వజ్ఞత్వమర్థవశసంపన్నమేవ' (వై.

సూ. వి. 2.1.19) సామసంజ్ఞాకర్తృత్వ ముపపన్నమగుట చేతను, కార్యములగు పృథివ్యాదిక కర్తృత్వము సంగతమగుట చేతను, సంజ్ఞార్థపదార్థములను, క్షిత్యాదికముయొక్క ఉపాదానత్వము నెరింగియుండవలసి వచ్చుటచేతను, ఈశ్వరునికి సర్వజ్ఞత్వము అవశ్యముగ నుండవలయునని వివృత్తికారుడు సువిస్పష్టవచనముల దీర్మానించియున్నాడు. ఇట్టే పదములకు వానియర్థములకు గల సంబంధము ఈశ్వరప్రేరితమనియు (వై.సూ. 6.1.3) నామములుగూడ ఈశ్వరసంకల్పమాత్రము లనియు (వై.సూ. 4.2.8) ననేకసూత్రముల వ్యక్తమగుచున్నది. కాన నవ్యక్తముగ కణాదసూత్రములలో నీశ్వరప్రశంసగూడ గోచరమే కాన దానిని వ్యాఖ్యాతలు వెలిబుచ్చినంతమాత్రమున సిద్ధాంతద్రోహమును వారు గావింపలేదనియే నిశ్చయము. అందుచే నెట్లు పరిశీలించిచూచినను, అనగా నీశ్వరవ్యతిరేకమనిగాని, ఈశ్వర తాటస్థ్యమనిగాని, 'నాస్తికో వేదనిందకః' (మను స్మృతి 2.11) అనునట్లు వేదనిందాపరముగగాని అవైదికప్రశంసచేగాని కాణాదమునాబరగు వైశేషికము నాస్తికము కానేరదని సువిస్పష్టము.

---

## జీవప్రస్తావన

పూర్వగ్రంథమున ప్రస్తావింపబడిన ఆత్మయే జీవునకాధారమై యున్నది. ఇచట ఏకాత్మగాక 'ప్రవృత్తినివృత్తీచ ప్రత్యగాత్మని దృష్టే పరత్ర లింగం' (వై. సూ. 3.1.19)

ప్రత్యగాత్మలో గోచరమగు ప్రవృత్తినివృత్తులే యితరాత్మల యునికిని సూచించును అను సూత్రార్థము ననుసరించి, సర్వత్రః ఒకేయాత్మయుండు వో, స్వీయాత్మగత ప్రవృత్తినివృత్తులుగూడ సర్వత్ర సర్వజీవులందు నుండవలయునను నెపమున నేకాత్మ వాదము ఖండింపబడి అనేకాత్మవాదము వైశేషికము సిద్ధాంతము చేయుబడియున్నది. 'ఆత్మేంద్రియమనోఽర్థసన్నికర్షాత్ సుఖ దుఃఖం' (వై. సూ. 5.2.15) అనునట్లు ఆత్మ, ఇంద్రియ మన స్సుల సంయోగమే సుఖదుఃఖానుభూతికి గారణమగుచున్నది. మనస్సు 'ఆత్మస్థే మనసి' (వై.సూ. 5.2 16) సూత్రార్థమురీతి ఆత్మలో సంస్థితమై యుండును. అట్టి మనోవిశిష్టమైన ఆత్మకు 'సుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్నాశ్చ చాత్మనో లింగాని' (వై. సూ.3.2.4) సుఖదుఃఖఇచ్ఛాద్వేషప్రయత్నములు లక్షణములై యుండ వాని నాత్మ కనుభవమునకు దెచ్చుటకై మనస్సు 'ప్రసిద్ధా ఇంద్రియార్థాః' (వై.సూ.3.1.1) ప్రసిద్ధమైన యింద్రి యార్థముల (శ్రోత్రత్వక్చక్షుజిహ్వాఘ్రాణరూపముననున్న యింద్రియసహాయమునకై శరీరమున బ్రవేశించుచున్నది. ఈ ఆత్మేంద్రియమనోయుక్తమగు శరీరమును సమిష్టిస్వరూపమును 'తత్ పునః పృథివ్యాదికార్యద్రవ్యం త్రివిధం శరీరేంద్రియవిష యకసంజ్ఞకం' (వై. సూ. 4.2.1) పృథివ్యాది కార్యద్రవ్యము మరల శరీర, ఇంద్రియ, విషయరూపమున త్రివిధమగుచున్న దనురీతి, భోక్తృభోగ్యభోగములుగా నగుచున్నది. అందుచే ఆత్మేంద్రియమనోసమాయుక్తుడై దేహస్థుడై యుండువాడే జీవు డనబరగుచున్నాడని వైశేషిక తాత్పర్యము.

గ్రంథారంభముననే వచింపబడియున్నట్లు వైశేషికము పదార్థనిరూపణశాస్త్రము మగుటచేత, ఇందు ఈశ్వరపదమేగాక, జీవపదముకూడ కానరాదు. అయినను ఈశ్వరునివలెనే జీవుడును యిందంతర్గతముగ అన్వయించుకొనుచున్నారు. ఈశ్వరునికంటె జీవనిర్వచనము అధికభాగమును గలిగియున్నది.

జీవుని ప్రవృత్తివిషయమున 'హస్తకర్మణా మనసః కర్మ వ్యాఖ్యాతం' (వై. సూ. 5.2.14) బాహ్యేంద్రియములద్వారా మానసికకర్మ వ్యక్తమగుచు, విషయార్థములతో ఇంద్రియముల సంధానపరచి తజ్జనిత సుఖదుఃఖానుభూతిని మనసు ఆత్మకందజేయును. జీవుని ప్రవృత్తిప్రవృత్తులును, 'అభిషేచనోపవాస బ్రహ్మచర్యగురుకులవాస వానప్రస్థయజ్ఞ దాన ప్రోక్షణ దిక్ నక్షత్ర మంత్ర కాల నియమాశ్చ' (వై. సూ. 6.2.2) అభిషేచనము, ఉపవాసము, బ్రహ్మచర్యము, గురుకులవాసము, వానప్రస్థము, యజ్ఞదానప్రోక్షణనియమాది సత్కార్యములవలనను, గలిగి, 'చాతురాశ్రమ్యముపధా అనుపధాశ్చ' (వై. సూ. 6.2.3) సక్రమాశ్రమాద్యనుష్ఠానము ఉపధా యనబడు శ్రద్ధామలచేత 'యతోఽభ్యుదయనిఃశ్రేయసిద్ధిః స ధర్మః' (వై. సూ. 1.1.2) అనబడు ధర్మమును దాని ననుసరించు పుణ్యప్రాప్తియు జీవునికి ప్రాప్తించును. 'ఇచ్ఛాద్వేషపూర్వికా ధర్మాధర్మప్రవృత్తిః' (వై. సూ. 6.2.14) ఈ ధర్మాధర్మప్రవృత్తియు ఇచ్ఛాద్వేషజనితములై యొప్పారును. ఆప్రవృత్తి బరిశుద్ధము చేయుగా నది ధర్మప్రవృత్తిగా బరిణమించుచున్నది. అంతియుగాక 'ఆత్మన్యాత్మమనసోః సంయోగవిశేషాదాత్మప్రత్యక్షం' (వై. సూ. 9.1.11) ఆత్మకును మనస్సునకును, ఆత్మలో ఒక విశిష్ట

సంయోగముచేత ఆత్మ ప్రత్యక్షమగుననురీతి ఆ సంయోగవిశేష మును జీవుడు సాధింపవలెను. అట్లు సాధింపగా బర్యవసాన మున 'అసమాహితాంతఃకరణా ఉపసంహృతసమాధయ స్తేషాం చ' (వై. సూ. 9.1.13) అంతఃకరణశుద్ధి కలిగి, సమాధిస్థితి ప్రాప్తించి, ఆత్మానుభూతి కలుగును. అప్పుడు 'ఆత్మగుణ కర్మసు మోక్షో వ్యాఖ్యాతః' (వై. సూ. 6.2.16) ఆత్మగుణ కర్మలమీద నాధారపడునట్టియు, 'తదనారంభ ఆత్మస్థే మనసి శరీరస్య దుఃఖభావః సంయోగః' (వై.సూ. 5.2.16) ఆత్మస్థమగు మనస్సులో గర్భాభావమేర్పడి దేహములో దానివలనకలుగు దుఃఖాభాసము నాబడు సంయోగము గలుగును. అదియే మోక్షమని వైశేషికమతము. అందు జీవు డంతర్హితుడై యాత్మయే నిలచియుండును అనిగూడ తాత్పర్యము.



## మోక్షము

పూర్వభాగమున నింతవరకు జీవునియొక్క స్వరూపము అతని సాధనగూర్చి వివరియున్నాము. ఇక తత్సాధనామూలా ముగ సాధకు డేస్థితిని బొందునో యావిషయముల నొకించుక తిలకించెదముగాక.

వైశేషికసిద్ధాంతతాత్పర్యము 'కాణాదం పాణినీయం చ సర్వశాస్త్రోపకారకం' అను ఆర్యోక్తిననుసరించి శబ్దార్థపరిజ్ఞాన రూపమున పాణినీయ వ్యాకరణశాస్త్రమును, పదార్థపరిజ్ఞాన రూపమున కాణాదవైశేషికమును సర్వేతరశాస్త్రముల కత్యం

తోపయుక్తమనురీతి వైశేషికప్రాశస్త్యము ద్రవ్యగుణాదికషట్కము ద్వారా పృథివ్యాది ఆత్మపర్యంత నవద్రవ్యములయొక్క పదార్థనిరూపణమే అయియున్నను, 'నిఃశ్రేయసమాత్యంతికీ దుఃఖనివృత్తిః' (వై.సూ.ఉ 1.1.4) దుఃఖముయొక్క అత్యంత నివృత్తియే నిశ్శ్రేయసమగుచుండును పరమకారుణికుడై అజ్ఞ జనోద్ధరణ దీక్షాదక్షుడై 'శ్రూయతే హీశ్వరనియోగప్రసాదా దధిగమ్య కణాదో మహర్షిః శాస్త్రం ప్రణీతవానితి' (వై. సూ. ఉ. 1.1.4) ఈశ్వరప్రసాదసిద్ధియు నియోగమును బొంది కణాద మహర్షి వరేణ్యుడు యీ వైశేషికశాస్త్రమును నిర్మించెనని సంప్రదాయము కలుగుటచేతను, 'తత్ర షట్పదార్థతత్త్వజ్ఞాన మాద్యమాత్మకర్మ' (వై. సూ. ఉ. 6.2.16) షట్పదార్థతత్త్వ జ్ఞానమే ఆత్మయొక్క ముఖ్యకర్మ యనురీతి షట్పదార్థతత్త్వ జ్ఞానమే 'తత్త్వజ్ఞానాన్నిఃశ్రేయసం' (వై.సూ. 1.1.4) అనురీతి నిశ్శ్రేయసప్రాప్తిని గలిగించుటయు, ఆతత్త్వజ్ఞానము 'ఏతా దృశం తత్త్వజ్ఞానం వైశేషిక శాస్త్రాధీనం' (వై.సూ.ఉ. 1. 1.4) వైశేషికశాస్త్రాధీనమైయుండుటచే నీశాస్త్రము పదార్థ తత్త్వజ్ఞానమును నిఃశ్రేయసరూపమోక్షప్రాప్తికే ఉపదేశించి నట్లు స్పష్టమగుచున్నది.

అందుచే మోక్షప్రాప్తికై ఆత్మగుణములనబడు 'శ్రవణం మననం యోగాభ్యాసో నిదిధ్యాసనమాసనం ప్రాణాయామః శమదమసంపత్తిః ఆత్మపరాత్మసాక్షాత్కారో దేహ దేశాంతరోపభోగ్యపూర్వోత్పన్నధర్మాధర్మపరిజ్ఞానం' (వై.సూ. ఉ.6.2.16) మొదలైన సాధనమార్గములకంటె షట్పదార్థతత్త్వ జ్ఞానమే ప్రధానముగా తెలియబడుచున్నది. ఇక తత్త్వజ్ఞానము

'ధర్మవిశేషప్రసూతాత్ ద్రవ్యగుణకర్మసామాన్యవిశేషసమవాయానాం పదార్థానాం సాధర్మ్యవైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానాన్నిఃశ్రేయసం' (వై.సూ. 1.1.4)అనుకొని ద్రవ్యాదిక షట్పదార్థములయొక్క సాధర్మ్యవైధర్మ్యజ్ఞానమే అందు దానివలన నిఃశ్రేయసనసిద్ధియనియు, కాని ఆజ్ఞానము ధర్మవిశేష జన్యమనియు వాకొనబడినది. మరల ధర్మనిర్వచనము సేయుచు 'యతోఽభ్యుదయ నిఃశ్రేయసనసిద్ధిః స ధర్మః' (వై.సూ. 1.1.2) 'అభ్యుదయః స్వర్గః' (వై. సూ. వి. 1.1.2) అభ్యుదయమనగ స్వర్గమగను 'అభ్యుదయస్తత్త్వజ్ఞానం' వై.సూ. ఉ. 1.1.2) అభ్యుదయమన దత్త్వజ్ఞానమనియు నెరింగింపబడిన అభ్యుదయమే, 'నిఃశ్రేయసం మోక్షః' (వై. సూ. వి. 1. 1. 2) నిశ్శ్రేయసముచు మోక్షమనియు, 'నిఃశ్రేయసమాత్యంతికీ దుఃఖనివృత్తిః' (వై. సూ. ఉ. 1.1.2) నిశ్శ్రేయసమన సంపూర్ణదుఃఖనివృత్తియనని వచింపబడిన నిశ్శ్రేయసము దేనివలన గలుగునో యది ధర్మముగా జెప్పబడియున్నది. కాన 'తథా చ స్వర్గాపవర్గరూపపరమపురుషార్థసాధనతయా బుభుక్షూణాం ముముక్షూణాం చోపాదేయత్వాద్ధర్మస్య వ్యాఖ్యానం యుక్తం' (వై.సూ.వి. 1.1.3) స్వర్గాపవర్గరూప పరమపురుషార్థముల గలిగించునది యగుటచే బుభుక్షు ముముక్షువులచే నవశ్యమవలంబనీయమగుటచే దాని ధర్మమని వ్యాఖ్యానించుట యుక్తమని వివృత్తికారుని వాదము. పైనసూత్రమున అభ్యుదయ నిశ్శ్రేయసపదద్వయ ముపయోగింపబడియున్నను యథార్థమునకు 'అభ్యుదయద్వారకం నిఃశ్రేయసం' (వై.సూ.ఉ. 1.1.2) అభ్యుదయ

ముద్వారా నిఃశ్రేయసమగుటచే, ధర్మమువలన అభ్యుదయము దానివలన నిఃశ్రేయససిద్ధియు గలుగునని తాత్పర్యము. అందుచే ధర్మమున తత్త్వజ్ఞానమును, తత్త్వజ్ఞానమూలమున నిఃశ్రేయసము ప్రాప్తించునని భావము.

ఇట్లు తత్త్వజ్ఞానసిద్ధి ప్రసాదించు ధర్మవిశేషము 'ధర్మవిశేష ఈశ్వర నియోగప్రసాదరూపః' (వై. సూ. ఉ. 1.1.4) ఈశ్వరానుగ్రహరూప నియోగమునే ధర్మవిశేషమని ఉపస్కారకర్తయు, 'ధర్మవిశేషః ఐహికో జన్మాంతరయోవా సుకృతవిశేషః' (వై. సూ. వి. 1.1.4) పూర్వవర్తమాన జన్మకృత సుకృతవిశేషమే ధర్మవిశేషమని వివృత్తికారుని నిర్వచనము. అందుచేతనే 'సుకృతవిశేషేణ ద్రవ్యాదిపదార్థానాం సాధర్మ్య వైధర్మ్యాభ్యాం తత్త్వజ్ఞానం జాయతే తత ఆత్మమననం అనంతరం నిధిధ్యాసనే నాత్మసాక్షాత్కారో జాయతే తదనంతరం మిథ్యాజ్ఞానాదినాశక్రమేణ మోక్షో భవతి' (వై. సూ. వి. 1. 1. 4) సుకృతవిశేషమున షట్పదార్థజ్ఞానరూప తత్త్వజ్ఞానము, అంత ఆత్మమననము, దానివలన నిధిధ్యాసనము, దానిచే నాత్మసాక్షాత్కారము, అందుచే మిథ్యాజ్ఞాననాశము, అంత మోక్షము సిద్ధించునని వివృత్తి వివరించియున్నది. కాన నిఃశ్రేయసనిఃశ్రేణి నధిరోహింప ధర్మమను సుకృతవిశేషము ముఖ్యమని భావము. ధర్మవిశేషమున పూర్వజన్మసుకృతమును, ఈశ్వరానుగ్రహజనితము లెట్లున్నను, వర్తమాన జన్మకృతముగూడ ప్రధానమగుటచే సర్వదుఃఖముకార్యరూపమై కారణాధీనమై 'కారణాభావాత్ కార్యాభావః' (వై.సూ. 1.2.1) అనునట్లు కార్యనివృత్తికి గారణనివృత్తియే పరమోపాయ మగుచున్నది. అందుచే

'దుఃఖాభావార్థం జన్మాభావే జన్మాభావార్థం ప్రవృత్త్యభావే తదర్థం చ దోషాభావే తదర్థం మిథ్యాజ్ఞాననివృత్తయే తదర్థం చాత్మసాక్షాత్కారాయ ముముక్షూణాం ప్రవృత్తిః ప్రయోజనం' (వై సూ. ఉ. 1.2.2) దుఃఖనివృత్తికొరకు జన్మనివృత్తియు, జన్మరాహిత్యముకొరకు ప్రవృత్తినివృత్తియు, దానికొరకు దోషాభావస్థితి అందుకొరకై మిథ్యాజ్ఞాననివృత్తియు, దానికై ఆత్మసాక్షాత్కారమును బొందుటకై ముముక్షువులు ప్రవృత్తులగుట యుపయుక్తమని వివరింపబడియున్నది. అనగా ముముక్షుకోటి ఆత్మసాక్షాత్కారమునుబడసి మోక్షమునొంద ప్రవృత్త్యాదుల దోషవివర్జితముగా సేయవలయును. ఇట్టి ధర్మప్రవృత్తికి గారణభూతముగా ఆత్మేంద్రియమనోఽర్థసన్నికర్షమున (వై. సూ. 5 2.15) ఆత్మేంద్రియార్థముల సంబంధము గలుగజేయు మనస్సు స్వాధీనమయి యుండవలయును. కాని 'మనశ్చేత్ చంచలస్వభావం తదా తస్య నిరోధో న సంభవతి' (వై. సూ. వి. 5.2.16) మనస్సు చంచలస్వభావము గలది యగుట దాని నిరోధించుట అసంభవమని సందేహింపవచ్చును. ఈసంశయనివృత్తికై 'ఆత్మస్థే మనసి షడంగయోగేన ఇంద్రియాదికం పరిత్యాజ్య మనో యదా ఆత్మమాత్రే తిష్ఠతి తదా తదనారంభః తస్య మనః కర్మణ అనారభ్య అనుత్పాదః తదా మనో నిశ్చలం భవతి' (వై. సూ. వి. 5.2.16) షడంగాభ్యాసముచేత మనస్సు ఇంద్రియాదిక పరిత్యాగముచేసి, ఆత్మస్థితముకాగా అప్పుడు మనోప్రవృత్తులుడిగి మనస్సు నిశ్చలమగును. ఇట్టి మనోనిశ్చలత్వసాధనకు ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులను షడంగయోగముచే

మనస్సు స్వాధీనమగును. దీనిననుసరించియే మనోజయము గాంచుటయొక్క ప్రాధాన్యతను వివరించుచు 'అసమాహితాంతః కరణా ఉపసంహృతసమాధయస్తేషాం చ' (వై. సూ. 9.1.13) ఎవరి అంతఃకరణము సమాహితముకాదో, మరియు నెవరి అంతః కరణము సంపూర్ణ సమాధులనొందెనో అట్టివారికి ఆత్మప్రత్య క్షము గలుగును అని సూత్రకారుడు వచించెను. అనగా అసమాహితమన, సమాధిరహితస్థితినొంది, ఉపసంహృతయన సఫలీకృత సమాధినొందిన సాధకునకు 'ఆత్మానాం అన్యేషాం ద్రవ్యాణాం చ ప్రత్యక్షం భవతి' (వై. సూ. వి. 9.1.13) ఆత్మయొక్కయు, ఇతరద్రవ్యములయొక్కయు ప్రత్యక్షము సిద్ధించును. అట్టి స్థితిలో నింక 'ధ్యానాపేక్షా...ధ్యానాత్మక సమాధ్యపేక్షా నాస్తీతి భావః' (వై.సూ.వి. 9.1.13)ధ్యానము సమాధియు నావశ్యకములేదని భావము.

పైవిధాన మనోసాధనరూప ధర్మప్రవృత్తులచే మనో ప్రవృత్తుల నిశ్చలముగావింపగ 'అయమేవ శరీరవిభాగః' (వై. సూ. ఉ. 6.2.16) దేహాత్మవిభాగ మేర్పడి 'ఆత్మగుణకర్మసు మోక్షో వ్యాఖ్యాతః' (వై. సూ. 6.2.16) ఆత్మగుణములే ఆత్మయందు భాసించి ద్రవ్యాదిలక్షణములు అదృశ్యముకాగా దానిని మోక్షమనియందురు. ఇట్లు మనోప్రవృత్తు లడుగంటు టయేగాక, మనోప్రవృత్తులకు ధర్మాధర్మ ప్రవృత్తులకు కారణ భూతమై పూర్వసంస్కృతమైయొప్పు అదృష్టముగూడ 'తదభావే సంయోగాభావోఽప్రాదుర్భావశ్చ మోక్షః' (వై. సూ. వి. 5.2.18) అను సూత్రమనుసరించి 'అదృష్టాస్యాఽభావే సతి' (వై. సూ వి. 5 2.18) అదృష్టముయొక్క అభావముకూడ

ఏర్పడగా 'ప్రారబ్ధేతరాదృష్టానాత్మసాక్షాత్కారేణ ప్రారబ్ధానాం చ భోగేన క్షయే సతి' (వై.సూ.వి. 5.2.18) ఆత్మసాక్షాత్కారమున ఆగామిసంచితరూప అదృష్టమును, భోగముచేత ప్రారబ్ధముగూడ నశింపబడుచు, 'యావత్ సంయోగాభావః దేహప్రవాహసంబంధస్య విచ్ఛేదస్తంతరశ్చ అప్రాదుర్భావః' (వై. సూ. వి. 5.2.18) సర్వసంయోగ మదృశ్యమగుటచే జననమరణప్రవాహము విచ్ఛేదమై జన్మరాహిత్యము ప్రాప్తించును. అంత 'దుఃఖస్య అనుత్పత్తిర్దేహరూపస్యాదృష్టరూపస్య చ కారణస్య విరహితాదితి తదానీమేవ మోక్షః' (వై.సూ.వి. 5.2.18) దుఃఖస్రోత అనుత్పన్నస్థితినొంద, అదృష్టదేహాదులను కారణవిరహితత్వముచేత మోక్షము కలుగును. ఈ రీతి ప్రత్యక్షఫలభూతముగ నేర్పడిన మోక్షము 'నాపి వర్గస్య శశవిషాణసమానతేతి భావః' (వై. సూ. వి. 5 2.18) అను వివృత్తికార వచనసరళి శశవిషాణమువలె భ్రాంతిరూపముగాని అభావరూపముగాని లేక ఆ అపవర్గము సద్రూపవిశిష్టమై అనుభవైకయోగ్యమై విరాజిల్లుచున్నదని విస్పష్టము.



## ముక్తుడు

మోక్షనిర్వచన మెప్పుడు గావింపబడినదో అప్పుడే ముక్తునిలక్షణములు నందే యంతర్గతము. అతనికి శరీరాద్యపేక్ష యుండదుగాన, తదాధారమగు కర్మగుణాదులులేక, దుఃఖనివృత్తస్థితి నుండును. దుఃఖనివృత్తితో ఆత్మధర్మమగు సుఖ

లక్షణముగూడ సదృశ్యమగునేమో యెచటను విదితముకాదు. అట్లే మోక్షము నాము క్తస్థితిలో ఆనందముండునను భావనయు ఎందును గోచరింపదు. కాన ఆత్మగుణములు నాశను సుఖ దుఃఖాదికసర్వమున కతీతుడై ఉదాసీనత ముక్తుడుండునని శోచెడిని. 'ఆత్మగుణకర్మసు మోక్షో వ్యాఖ్యాతః' (వై.సూ.౬.2 16) సూత్రమున మోక్షము ఆత్మగుణ కర్మాధీనమున తెలియుచుండుటచే మోక్షము ఆత్మగుణకర్మవిశిష్టమనుటగాక ఆత్మగుణకర్మఫలితము మోక్షముగా సమన్వయముచితము. అపవర్గమున ఆత్మ తన పూర్వగుణకర్మవిరహితమై యుండుననిన యుక్తము. కాన ముక్తుడును సుఖదుఃఖాతీతమై నిర్వికార భూయిష్టమై యొప్పారునని తాత్పర్యము.



## మహర్షులు

కణాదుడు సిద్ధుల యొక్కయు ఈశ్వరునియొక్కయు కలిమిని ప్రస్తావించుచు, 'సంజ్ఞాకర్మత్వస్మద్విశిష్టానాం లింగం' (వై. సూ. 2.1.8) అస్మదాదులకంటె విశిష్టులగు సిద్ధులును ఈశ్వరుడును సంజ్ఞాకర్మలద్వార నిరూపితము అను సూత్రమున 'సర్వజ్ఞైశ్వర్యసంపన్నానాం ఈశ్వరమహర్షీణాం లింగం' (వై. సూ.వి. 2.1.18) సర్వజ్ఞత్వఐశ్వర్యాది సంపద్విశిష్టులగు ఈశ్వర మహర్షిగణము అనుటచే, మహర్షిగణమునకుగూడ ఈశ్వరునకు వలె సర్వజ్ఞత్వాదులు వ్యక్తము. మరియు మహర్షిగణము సామాన్యులవలెగాక, 'తత్ర శరీరం ద్వివిధం యోనిజమయో

నిజం చ' (వై. సూ. 4.2.5) యోనిజాయోనిజరూపముగ శరీరములు ద్వివిధములై అందు 'అయోనిజం చ దేవానామృషీణాం చ' (వై.సూ.ఉ. 4.2.5) దేవతలకు మహర్షులకు అయోనిజశరీరమును అనగా 'శ్రూయతే హి బ్రహ్మణో మానసా మన్వాదయ ఇతి' (వై.సూ.ఉ. 4.2.5) బ్రహ్మమానసపుత్రులకును మన్వాదులకును అయోనిజత్వమే చూపి వేదప్రమాణముగా వచింపబడియున్నది. అందుచే మహర్షిగణమునూ ఆత్మవిదులు 'శుక్రశోణితానపేక్షత్వ' (వై. సూ. ఉ. 4.2.5) విభాసితమైన అయోనిజదేహధారులై యుందురు. అయినచో సామాన్యమానవులై పదార్థతత్త్వజ్ఞానపరులై సిద్ధులైన వారుకూడ అయోనిజులే యగుదురా అను సంశయము కలుగును. ఇట్టి సిద్ధుల శరీరములు ప్రారబ్ధజనితములుకాన శరీరతత్త్వమునందు మార్పులేకున్నను, వారును అయోనిజ సిద్ధులవలె 'ఆత్మన్యాత్మమనసోః సంయోగవిశేషాదాత్మప్రత్యక్షం' (వై. సూ. 9.1.11) ఆత్మలో ఆత్మమనోసంయోగమువలన ఆత్మప్రత్యక్షజ్ఞానస్థితులై విరాజిల్లుదురు. ఆత్మమనోసంయోగవిధానము ననుసరించి 'ద్వివిధాస్తావద్యోగినః' (వై. సూ. ఉ. 9.1.11) యోగులు ద్వివిధము. 'సమాహితాంతఃకరణా యే యుక్తా ఇత్యభిధీయంతే అసమాహితాంతఃకరణాశ్చ యే వియుక్తా ఇత్యభిధీయంతే' (వై. సూ. ఉ. 9.1.11) మనస్సును ధ్యానించి దాన గలసినవారు యుక్తులనియు అట్లుగావింపనివారు వియుక్తులనియు నందురు. అందు యుక్తులు మనస్సుద్వారా ధ్యేయమునందు స్థిరధ్యానమున నుండువారికి 'ఆత్మని స్వాత్మని పరాత్మని చ జ్ఞానముత్పద్యతే' (వై. సూ. ఉ.9.1.11) ఆత్మలో

స్వాత్మ పరాత్మ విషయజ్ఞానము కలుగును. అందుచే సమాహితాంతఃకరణసంయుక్తులగు వారి కాత్మజ్ఞానము కలుగునని అర్థము. అంతియగాక అట్టివారికి 'తథా ద్రవ్యాంతరేషు ప్రత్యక్షం' (వై.సూ.9.1.12) అట్టి ద్రవ్యాంతరప్రత్యక్షజ్ఞానము గూడ జనించును. ఇచ్చట 'ద్రవ్యాంతరేషు' అనగా వీరు యోగజధర్మానుగృహీతమైన మనసుచే ద్రవ్యాంతరములగు స్థూలద్రవ్యములుగాక 'చతుర్వణుషు మనసి వాయుదిక్కాలాకాశేషు' (వై. సూ. ఉ. 9.1.12) పరమాణుద్రవ్యములగు వాయుదిక్కాలగగనములయొక్కయు వాని గుణకర్మాదిక జ్ఞానమంతయు ప్రత్యక్షముగ నొందుదురు. అట్లు వీరికి కలుగు ద్రవ్యాదికజ్ఞానము దూరత్వాది రూపవిషయదోషాది జ్ఞానాటంకముననతీతమై 'ఆర్ష మృషీణాం యోగజధర్మేణ జనితం యత్ సిద్ధదర్శనం సిద్ధానాం సతాం సర్వేషాం వస్తూనాం దర్శనం తద్ధర్మేభ్యో జాయతే' (వై. సూ. వి. 9.2.13) యోగజధర్మమువలన జనించిన సిద్ధదర్శనము, సర్వసద్వస్తు దర్శనజ్ఞానము ధర్మమువలన కలిగెను. అట్టి 'యోగినాం జ్ఞానం తు ధర్మమాత్రాధీనం ప్రమారూపమేవ భవతి' (వై. సూ. వి. 9.2.13) యోగుల జ్ఞానము ధర్మాధీనము అగుటచే ప్రమారూపమే అయియున్నది. అనగ భ్రాంతి కానేరదు. అందుచేతనే పూర్వము 'న శశవిషాణసమాపతేతి' (వై. సూ. వి. 5.2.18) శశవిషాణతుల్యము కాదనియు వ్రాసియున్నాడు. అట్టి నిర్దుష్ట జ్ఞానభూయిష్టులు కావుటచే 'అచింత్యోహి యోగజధర్మప్రభావః' (వై. సూ. వి. 9.1.14) యోగజధర్మప్రభావ మంచిత్యమునుమా అని హెచ్చరించుచు 'యద్దలేనాగస్త్యమునిః పారావారం పపౌ,

సౌభరిశ్చ కాయవ్యూహం పరిగృహీతవాన్, వశిష్ఠశ్చ దిలీపస్య సురభిశాపం జ్ఞాతవాన్' (వై. సూ వి. 9. 1.14) అపరిభావ మున అగస్త్యమహర్షి సాగరు మ్రింగెను, సౌభరిమహర్షి అనేక దేహముల ధరించెను, వశిష్ఠమహర్షి దిలీపుని సురభిశాపమును గ్రహించెను అని విస్తృతికారుడు వివరించెను. ఈజ్ఞానులు ఆత్మజ్ఞానసిద్ధులై యుండుటచే 'కిం యోగినాం లౌకికప్రత్యక్షం న భవతి' (వై. సూ. వి. 9.1.15) యోగులకు లౌకికప్రత్యక్ష మభావమా అను సందేహము కలుగగా 'యోగినాం లౌకికమానసప్రత్యక్షం భవతి' (వై.సూ. వి. 9.1.15) యోగులకు లౌకిక ప్రత్యక్షము కలుగుననియు 'ఆత్మగుణేషు స్వాత్మవృత్తిసుఖాదిగుణేషు' ఆత్మ గుణములకు సుఖాదుల ప్రత్యక్షము కలుగుననియు సంశయ నివారణ మగుచున్నది.

అందుచే గాణాదవైశేషికమున నాత్మజ్ఞానులు కేవలము జడులైయుండక, లౌకికజ్ఞానపరులై ఆత్మగుణానుభూతిగలిగి, సగుణులై అష్ఠాలనుగు నాయుదిక్కాలాకాశజ్ఞాన తత్పరులై చాలవరకు ఈశ్వరలక్షణోపేతులై విరాజిల్లుచుందురని ముఖ్యాశయము.

---

## పరిసమాప్తి

ఇంతవరకు వైశేషికసిద్ధాంతమును సమగ్రముగ చర్చించి యున్నాము. దీనివలన 'శాస్త్రనిఃశ్రేయోస్యోస్య హేతుమద్భావః, శాస్త్రతత్త్వజ్ఞానయోర్వ్యాపారవ్యాపారిభావః, నిఃశ్రేయసతత్త్వ

జ్ఞానయోః కార్యకారణభావః, ద్రవ్యాదిపదార్థశాస్త్రయోః ప్రతిపాద్యప్రతిపాదకభావః సంబంధోఽవగమ్యతే' (వై సూ.ఉ.1.1.4) అను వచనమురీతి చతుర్విధసంబంధములు నుండుటచే, 'ఏతేషాం చ సంబంధానాం జ్ఞానః నిఃశ్రేయసార్థినామిహ శాస్త్రే ప్రవృత్తిః' (వై.సూ.ఉ.1.1.4) ఈలోకమున మోక్షకాములు యీసంబంధ జ్ఞానముగలిగి, యీ వైశేషికశాస్త్రమునందు ప్రవృత్తులగుచున్నారు. మోక్షహేతువగు 'తత్త్వజ్ఞానం వైశేషికశాస్త్రాధీనం' (వై. సూ. ఉ. 1.1.4) తత్త్వజ్ఞానము వైశేషిక శాస్త్రాధీనమై యుండుటయు, 'తస్యాఽపి నిఃశ్రేయస హేతుత్వం' ఆశాస్త్రము వల్లనే నిఃశ్రేయసమగు ముక్తి లభించుటయు సుప్రసిద్ధము సుస్పష్టమని విదితమగుచున్నది. కాన శ్రీకణాదమునివరప్రోక్తమైన వైశేషికము దర్శనషట్కములోనేగాక సర్వతత్త్వశాస్త్రమున బ్రధానస్థాన మలంకరించి యున్నదనుట కెట్టిసందేహమును లేదు. అట్టి సుప్రశస్త శాస్త్రమును మానవకోటికి బ్రసాదించి ప్రపంచమును జ్ఞానసంపన్నము గావించిన ఆమునిలోకవంద్యునకు ఎల్లరు కృతజ్ఞులగుదురుగాక.

హరిః ఓం తత్ సత్

ఓం

# న్యాయదర్శనము

## ఉపోద్ఘాతము

### న్యాయదర్శనరూపము—జననము

అనంతరం చ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిఃసృతాః।
మీమాంసా న్యాయవిద్యా చ ప్రమాణాష్టకసంయుతా॥

మత్స్యపురాణ 3. 2.

అనంతరము చతుర్ముఖుని వక్త్రమునుండి వేదము, మీమాంసాశాస్త్రము, ప్రమాణాష్టకసంయుతంబగు న్యాయవిద్యయు బహిర్గతమయ్యెను అని మత్స్యపురాణముచేత సనాది విద్యగ బరిగణింపబడి కీర్తింపబడుచు, 'బుద్ధ్యా యద్ ఉత్పన్నం తత్ సర్వం న్యాయమతం' యుక్తిద్వారా నిశ్చయింపబడునది యథార్థమను సూత్రమురీతిగను, Discussion or Vada is the breath of intellectual life1. విజ్ఞానజీవితమునకు వాదము ప్రాణము వంటిది కావునను, 2. Nyaya was pure logic unconnected

1. Prof. S. Radhakrishnan: Iudian Philosophy Vol 2 33
2. Nyaya Sutras of Gotama. M. A, Satis chandra Vidyabhushana xiv

with the scriptural dogma 2. మతగ్రంథసిద్ధాంతముల సంబంధములేని తర్కశాస్త్రమే న్యాయదర్శనమని ప్రశస్తి నార్జించియున్నది. మరియు 'దృశ్యతే తత్త్వమనేన దర్శనం' తత్త్వార్థదర్శనలాభమును కలుగజేయుటచే దర్శనములని ప్రఖ్యాతి గడించిThe six systems in which the Philosophical thought of India has found its full realisation3. వేనిలో భారతీయాధ్యాత్మికవిజ్ఞానము సంపూర్ణత్వమును బొందియుండెనో ఆషడ్దర్శనములనాబడు న్యాయవైశేషిక సాంఖ్యయోగ మీమాంసావేదాంతములలో. In obedience to custom....we shall start with the Nyaya and the Vaiseshika theories 4. ఆచారమననుసరించి న్యాయ వైశేషికములతో బ్రారంభించెదముగాక యనియు, గాంచెదమేమన which give us an analysis of the world of experience 4. అవి మనకు అనుభవవివరణము నొసంగునని రాధాకృష్ణపండితుని వచనసరణి తన ధీవిశాలతచేత నగ్రస్థానము నలంకరించియున్న న్యాయదర్శనమీమాంసకు నిట నొకించుక గావించుదముగాక. ఇయ్యది పాశ్చాత్యశాస్త్రవాదములెంత కనగన, సర్వశాస్త్ర సర్వసిద్ధాంతములకనసరమగు దర్కవిధానమును, యోచనాపద్ధతిని, సిద్ధాంతసరళిని నిర్మించి బోధించుటచే సర్వవిధముల గణనీయమైThe system of Nyaya which studies the general plan and method of critical inquiries, may be called the science of sciences 5. పరిశీలనావిధానమునకుగల సామాన్యపద్ధతుల బరిశీలించు

3. F. Max Muller : The Six Systems of Indian Philosophy vi
4. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 28
5. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 33

సూత్రవ్యాఖ్యాతయగు గార్బె (Prof. Garbe) కొనియాడి యున్నాడు.

---

## న్యాయకర్తలు – గౌతముడు

ఆదిశ్లోకార్థము ననుసరించిచూచినచో న్యాయవిద్య చతుర్విద్యలయందొకటియై ప్రథమమున వేదములతో సహోత్పన్నమని తెలియుచున్నది. అందుచే దీనికి బ్రథమకర్త బ్రహ్మదేవుడనియే తాత్పర్యము. ఇదియే యుపనిషత్కాలమున 'వాకోవాక్యం' (ఛాం. 7.1.2) అనబడుచుండినట్లుల ఛాందోగ్య ప్రమాణము గోచరించుచున్నది. దానికి భాష్యకర్తలగు శ్రీశంకరులును 'వాకోవాక్యం తర్కశాస్త్రం' అని వివరించి యుండుటచే బ్రహ్మప్రతిపాదిత న్యాయవిద్య ఉపనిషత్తులలో వాకోవాక్యమనుపేర వ్యక్తము. పిమ్మట అది కాలప్రవాహమునబడి పరంపరాగతమై ఆఙ్గిరోవంశముల మహానుభావులని పేరెన్నికగాంచిన మహర్షి దత్తాత్రేయ, పునర్వసు ఆత్రేయ, అనసూయాత్ర అష్టావక్రి, సన్న్యాసిని సులభాల మొదలగు శేముషీధురంధరులచే బోధింపబడుచు నభివృద్ధి గాంచుచు నడచెను. కాని దానికొక స్వరూపమునొసంగి, క్రమత్వము బ్రసాదించి, ప్రసరింపజేయుటకు దగు ధీమంతుడును, 'ముక్తయే యః శిలాత్వాయ శాస్త్రమూచే మహామునిః। గోతమం తమవేక్ష్యైవ యథా విత్థ తథైవసః'(నైషధచరితం.17.75) అను వాక్యమున మహాముని గోతముడని శ్రీహర్షునిచే సంస్తుతి

గాంచినట్టియు, 'గౌతమస్య నరశ్రేష్ఠ' (వాల్మీకిరామాయణం. ఆదికాండ. సర్గ. 48) నరశ్రేష్ఠుడైన గౌతముడని రామాయణ మహాగ్రంథమున విశ్వామిత్రమహర్షిచే నుతింపబడినట్టియు, వాయుపురాణముచే 'తపోధనః అక్షపాదః' (వాయుపురాణము. 23. అ) అనుచుండము తపోధనుడగు అక్షపాదుడని బ్రశంసింపబడినట్టియు 'దీర్ఘతపసః' (రఘువంశః. 11. సర్గః) దీర్ఘతాపసి యని కాళిదాస మహాకవిచే గొనియాడబడిన గౌతమమహర్షి పుంగవునకు ఆ భాగ్యము లభించెను. అందుచేతనే The authors of the Sutras are not the founders or originators of the systems' but only their compilers and formulators 8. సూత్రకర్తలు సిద్ధాంతకర్తలుకాక, వాని సంకలనకర్తలుమాత్రమే అని రాధాకృష్ణపండితులును, No Philosopher owes everything to himself. He grows from a soil that is ready-made for him and he breathes an intellectual atmosphere which is not his own making 9. ఏతత్త్వవేత్తయు సర్వమును తనదిగా నన్వయింపజాలడు. తనకు సంసిద్ధపరుపబడిన క్షేత్రమున నతడు అభివృద్ధిగాంచును. తనదికాని విజ్ఞానవాతావరణమును అతడు ఆస్వాదించును అనియు మాక్సుముల్లరు Max Muller వచించియున్నాడు. ఈవిషయమునే The Sutras cannot represent the very first attempt at a systematic treatment 10. క్రమవిధానమునరచింప నీసూత్రములు ప్రథమయత్నములు కావనియు They are rather the lost summerings up of what had been growing up during many generations of isolated

8. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2. 23
9. Prof. F. Max Muller: The Six systems of Indian Philosophy. 1

thinkers 10. అంతవరకు ననేక తరములనుండి వ్యక్తిగతముగ ధీమంతుల కృషిఫలితముగ నభివృద్ధిగాంచిన విషయమును గ్రోడీకరించుటయే [illegible]గునని యు నాతని వచనము. Macdonell మాక్డొనెల్ కూడ యిదే అభిప్రాయమును The basic sutras which form the starting point of a system, in reality, represent the end of a long and exentensive literary development that has been lost 11. దర్శనప్రారంభమునకు మూలమగు సూత్రములు, యథార్థముగ, దీర్ఘమై, సువిశాలమై, ప్రస్తుతమలభ్యమైన వైజ్ఞానికాభివృద్ధియొక్క పరిసమాప్తిని సూచించునని వెలిబుచ్చియున్నాడు. శ్రీరాధాకృష్ణుడును They are not the work of one thinker or of one age, but a succession of thinkers spread over a number of generations 12. ఆసూత్రగ్రంథములు ఒక ధీమంతునివి, ఒక కాలమునకు జెందినవిగాక, అనేకతరముల ధీశాలుర పరంపరలకు జెందినవై యున్నవని చెప్పియున్నాడు. పైవాక్యతాత్పర్యముల నాలోచించినచో న్యాయవిధాన మతిప్రాచీనమనియు, గురుశిష్యపరంపరాగతమై ప్రవాహరూపమై ప్రసరించుచు గౌతమమహర్షి హస్తస్పర్శమహామహిమచే నజేయమును, అకుంఠితమును అగు శాస్త్రరాజమై సర్వశాస్త్రముల కాధారమగు శాస్త్రమై యొప్పారినది యనియు సుస్పష్టము. ఈయభిప్రాయమును ఆధునికపండితలోకమేగాక 9వ శతాబ్దికిజెందినవాడై 'న్యాయాలంకారవృత్తి' యను సుప్రసిద్ధగ్రంథమును విరచించిన

---

10. Prof, F. Max Muller : the Six Systems of Indian Philosophy. 75
11. Dr. A. A Macdonell: India's Past.
2. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2. 22

జయంతుడును, న్యాయశాస్త్రమునకు గౌతముగ్రంథమే పరమ ప్రమాణమై సంతుష్టమైనదనియు, కాని గౌతమునకు బూర్వము కూడ దర్శ-శాస్త్రము గలదనియు స్పష్టపరచియున్నాడు.



## గౌతమ మీమాంస

న్యాయదర్శనకారుడైన యీ గౌతమమునిచంద్రు డెవరో ఎందుండెనో జీవితాంశము లెట్టివో మొదలగు విషయముల గ్రహింప యత్నించెదముగాక. Who this Gotama was and in what time and country he flourished are questions to which no satisfactory answer can be given. Scholars have ofcourse attempted to offer an answer, but all in different ways. 13. ఈగోతముడెవరో ఏకాలమున ఏదేశమున వాసంబుండెనో, అను ప్రశ్నలకు ఉచితసమాధానములు వచింపబడజాలవు. పండితులు సమాధానమొసంగ యత్నించిరి కాని అవియన్నియు వివిధములుగ నున్నవి అని పండిత గోపీనాధకవిరాజ్ వ్రాసినట్లు, After all, the importance of that literature, more particularly of its philosophical portions is quite independent of age 14. ఆ వాఙ్మయముయొక్క ప్రాముఖ్యత ముఖ్యముగ దాని తాత్త్వికవిషయ రహస్యములు కాలమునకు అతీతమగుటచేత మన ప్రాచీన

13. Dr Ganganath Jha : Introduction by Pandit Gopinath Kaviraj Gautama's Nyaya Sutras

14. F. Max Muller : The Six Systems of Indan Philosiphy 121

ఋషిపరేఙ్ఖ్యాలు కాలమునకును మరితర ఐహికవిషయములకు గాక తాత్త్వికవిషయములకే ప్రాధాన్యత నొసంగియుండుటచేత Dates are the weak points in the literary History of India 15. భారతీయవిజ్ఞానచారిత్రమున కాలనిర్ణయము లోప ముగనున్నదని మాక్సుముల్లరు Max Muller వచించినట్లును, పూర్వోక్తరీతి గౌతమముని విషయనిర్ధారణము పండితుల కందరానిదై పరిణమించినది.

అంతియగాక The Rig Veda, the first of the Vedas, is probably the earliest book that humanity possesses 16. వేదములలో మొదటిది ఋగ్వేదము. బహుశః అదియే మానవ కోటికిగల గ్రంథములలో ప్రథమము అని జవహరిలాల్ నెహ్రూ పండితుడు అన్నట్టుల సర్వప్రపంచమున క దిగ్రంథమని పాశ్చాత్యపండితలోకముచేత బ్రస్తుతిగాంచిన ఋగ్వేదము నుండిగూడ గౌతమనామము సుప్రసిద్ధముగ గోచరించుచున్నది. గౌతమమహర్షి వంశమునకు జెందిన వారెల్లరు గౌతములనబడుటయు యీసమస్యను క్లిష్టతరమొనర్చినది. ఋగ్వేదసంహితయందు గోతమనామధేయుడగు మేధాతిథియను కణ్వమహర్షి పుత్రుడొక డును (ఋ. 1 1.12.111). గౌతమకులసంజాతుడైన నోధాఋషి యొకడును (ఋ. 1.4.22.55), గోతమనామకుడైన మరొక డును (ఋ 1 5.5.9). రహూగణుడను ఋషికొడుకులు గోతములును (ఋ. 1.5.20 75.1, 1 5.25–78.5), ఋగ్వేదీయ మగు రహూగణపుత్రులగు గౌతమఋషుల విషయమే శతపథ

15. F. Max Muller: The Six Systems of Indan Philosophy 364
16 Pandit Jawaharlal Nuhru: Discovery of India 55

కృష్ణయజుర్వేదీయ బృహదారణ్యకములో 'గౌతమాత్ గౌతమః' (బృ. 1. 2. 3) గౌతమనామధేయులగు గురుశిష్యులిరువురు గోచరము. కృష్ణయజుర్వేదీయ కఠోపనిషత్తులో యముని మెప్పించి వరముల బడసిన నచికేతుడును (కఠ. 5. 6) గౌతముడనబడెను. గౌతమధర్మసూత్రమనబడు ప్రాచీన ధర్మశాస్త్రమునకుగూడ గౌతమనామధేయుడే కర్తయైయున్నాడు. వ్యాసునకు బూర్వము ఆరుణేమి మహర్షితోగూడ వేదముల బ్రసరింపజేసిన గౌతముడను 'బ్రహ్మ దేవానాం పరమతాపసః ఇంద్రస్య కౌశికస్య వేదార్థాన్ వాచయతి స్మ।ఇంద్రః కౌశికో ఽరుణేమిగౌతమే వేదాన్ వాచయతి।ఆరుణేమిగౌతమౌ శ్వేతకేతుం వేదాన్ వాచయతః।శ్వేతకేతుః శుకం పండితం వేదాన్ వాచయతి।శుకః పండితశ్చతుర్థా వేదాన్ విభజతిస్మ' (దివ్యావదాన. 33. ప్ర) బ్రహ్మదేవుడు దేవతలలో బరమతాపసియయిన యింద్రునికి గౌశికునకు వేదముల దెలిపెను. వారిరువురు ఆరుణేమిగౌతములకు వానిని బోధించిరి. మరల వారు శ్వేతకేతున కుపదేశించిరి. శ్వేతకేతువు పండితుడైన శుకునకు వేదముల బోధించెను. పండితుడైన శుకుడు నాలుగువేదముల విభజించెను అని దివ్యావదానమనియు మాతంగసూత్రమనియు బేరొందిన బౌద్ధగ్రంథము తెలుపుచున్నటుల పండితుల భావము. మరియు ప్రస్తుతము జరుగుచున్న వైవస్వతమన్వంతరమున సప్తమహర్షులలో నొకగౌతమమహర్షికి ప్రథమస్థానమీయబడియున్నది.

మరియు బ్రపంచమునకంతటికి నపూర్వవిధానముగ జ్ఞానభిక్షనిడియున్న ప్రఖ్యాత బుద్ధభగవానుడును గౌతముడే యనియు మనము మరువరాదు. అదే కాలమున జైనమత

కృష్ణయజుర్వేదీయ బృహదారణ్యకములో 'గౌతమాత్ గౌతమః' (బృ. 1. 2. 3) గౌతమనామధేయులగు గురుశిష్యులిరువురు గోచరము. కృష్ణయజుర్వేదీయ కఠోపనిషత్తులో యముని మెప్పించి వరముల బడసిన నచికేతుడును (కఠ. 5. 6) గౌతముడనబడెను. గౌతమధర్మసూత్రమనబడు ప్రాచీన ధర్మశాస్త్రమునకుగూడ గౌతమనామధేయుడే కర్తయైయున్నాడు. వ్యాసునకు బూర్వము అరుణేమి మహర్షితోగూడ వేదముల బ్రసరింపజేసిన గౌతముడను 'బ్రహ్మా దేవానాం పరమతాపసః ఇంద్రస్య కౌశికస్య వేదార్థాన్ వాచయతి స్మ। ఇంద్రః కౌశికోఽరుణేమిగౌతమే వేదాన్ వాచయతి। అరుణేమిగౌతమా శ్వేతకేతుం వేదాన్ వాచయతః। శ్వేతకేతుః శుకం పండితం వేదాన్ వాచయతి। శుకః పండితశ్చతుర్ధా వేదాన్ విభజతిస్మ' (దివ్యావదాన. 33. ప్ర) బ్రహ్మదేవుడు దేవతలలో బరమతాపసియయిన యింద్రునికి గౌశికునకు వేదముల దెలిపెను. వారిరువురు అరుణేమిగౌతములకు వానిని బోధించిరి. మరల వారు శ్వేతకేతునకుపదేశించిరి. శ్వేతకేతువు పండితుడైన శుకునకు వేదముల బోధించెను. పండితుడైన శుకుడు నాలుగువేదముల విభజించెను అని దివ్యావదానమనియు మాతంగసూత్రమనియు బేరొందిన బౌద్ధగ్రంథము తెలుపుచున్నటుల పండితుల భావము. మరియు ప్రస్తుతము జరుగుచున్న వైవస్వతమన్వంతరమున సప్తమహర్షులలో నొకగౌతమమహర్షికి ప్రథమస్థానమీయబడియున్నది.

మరియు ప్రపంచమునకంతటికి నపూర్వవిధానముగ జ్ఞానభిక్షనిడియున్న ప్రఖ్యాత బుద్ధభగవానుడును గౌతముడే యనియు మనము మరువరాదు. అదే కాలమున జైనమత

సంస్థాపకుడైన మహావీరుని శిష్యులలోగూడ ఇంద్రభూతిగౌతము డనువాడొకడుండెను. ఇట్లు వేదకాలమునుండి గౌతమబుద్ధుని కాలమువరకు గౌతమాఖ్యులేమి గౌతమవంశీయులగుటచేగౌతము లనియేమి అసంఖ్యాకములుగ గౌతమనామధేయులు భారతీయ విజ్ఞాన లోకమున అనేకగ్రంథముల దోచుచునేయున్నారు.అందు యే గౌతము డీన్యాయశాస్త్రకర్తయో గ్రహింప దుస్సాధ్యమై యొప్పారుచున్నది. ప్రఖ్యాతులైన గౌతములే యిందరుండ నిక గ్రంథములరాని సంప్రఖ్యాతులింకెందరుందురో ఎవరు వచింప గలరు!

---

## గౌతముడు - అహల్యానాథుడు - చరిత్ర

పై వివరింపబడినవారుకాక శ్రీమద్వాల్మీకిరామాయణ మున నొక సుప్రసిద్ధ గౌతమమహర్షినిగూర్చి తెలుపబడి యున్నది. ఈ గౌతమునిమీదికే పండితలోకముయొక్క దృష్టులు ప్రసరించి అతని న్యాయకర్తగా దీర్మానింపజేసినవి. అదెట్లనిన యోకించుక విచారించెదముగాక.

వేదకాలమున రహూగణమహర్షి చంద్రుని పుత్రరత్నమై కురుసృంజయులను రాజులకు బురోహితుడై, తన ప్రభువు యుద్ధమున విరోధులకు లొంగుసమయమున ఇంద్రు నుపాసించి అనుగ్రహమునుపొంది, తన ప్రభువునకు జయము చేకూర్చి, ఋగ్వేదమున యశస్కాయుడై సమకాలీనులకును తర్వాతివారి కిని ఆదర్శమూర్తియై ప్రకాశించిన గౌతమమహర్షియే

గౌతమవంశమునకు ఆదిపురుషుడనియు, ఆవంశమునకే రామాయణమున అహల్యాగాథలో బ్రస్తావింపబడిన గౌతముడుగూడ చెందినవాడనియు సతీశచంద్ర విద్యాభూషణుని అభిప్రాయము. అహల్యానాథుడైన గౌతముడే న్యాయదర్శనకర్తయని The Nyaya philosophy was, on the authority of the tradition prevelent in Mithila, founded by Gautama, husband of Ahalya 17. మిథిలప్రాంతములగల వాడుకను అనుసరించి విద్యాభూషణుడు తీర్మానించెను. న్యాయదర్శనకర్తగ బ్రఖ్యాతిగన్న గౌతముడు was ancient Rishi refered in Ramayana as the husband of Ahalya 18. రామాయణములో అహల్యానాధుడుగా సూచింపబడిన ప్రాచీనమహర్షి యే యనియు రాధాకృష్ణుని సమ్మతము.

'మిథిలోపవనే తత్ర ఆశ్రమం...గౌతమస్య పూర్వమాసీన్మహాత్మనః। ఆశ్రమో దివ్యసంకాశః సురైరపి సుపూజితః॥' (రామాయణ. ఆది. 6. అ) మిథిలానగర వనప్రాంతముల మహాత్ముడగు గౌతముని ఆశ్రమము పూర్వముండెను. అది దివ్యమై సురాదిగణములకుగూడ బూజ్యమై యుండెను అను వాల్మీకముయొక్క వచనముగల అహల్యానాథుడైన గౌతమ మహర్షి చంద్రమడే న్యాయసూత్రకర్తగ బండితలోకము సమ్మతించుటచే గౌతముడు మిథిలాదేశవాసుడనియు సమ్మతింపవలయును. కేవలము దేశవాసుడుమాత్రమేగాక గౌతముడు he was born at Gautama Sthana in Mithila on the river

17. M. M. Satis chandra Vidyabhushana: Nyaya Sutras of Gotama. viii
18. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 39

Kshirodadhi 19. మిథిలలోగల క్షీరోదధియొడ్డునగల గౌతమ స్థానమున అతడు జనించెను అను ప్రతీతియు గలదని విద్యాభూషణాది పండితుల అభిప్రాయము. ఈ గౌతముడు అహల్యానాధుడే యని నిరూపించుటకు, గౌతమస్థానమునకు సుమారు రెండుమైళ్లదూరమున అహల్యాస్థానమను గ్రామమున అహల్యాశాపగ్రస్థరూపమగు పాషాణము నేటికిని అందు గలదట. కాన నేటివరుక ఆగ్రామముల చైత్ర శుద్ధ నవమి శ్రీరామచంద్రుని జన్మదినమున గొప్ప యాత్ర, ఉత్సవము జరుగును. అహల్యాశాపకారణము, శ్రీరామచంద్రపదపంకజ రజోలేశ స్పర్శకారణమున తత్ శాపనివారణము మొదలైన వివరము లన్నియు భారతావనియంతయు ప్రసిద్ధములు. పై విధానముగ సంప్రదాయసిద్ధమైన గాథ యిట్లుండుటచే గౌతమస్థానము గౌతమజన్మస్థానమేకాక ఆశ్రమస్థానమునుగూడ అగునని కొందరి అభిప్రాయము.

శ్రీరామచంద్రుని చారిత్రము పునర్వచింపబడిన అధ్యాత్మ రామాయణమున బూర్వోక్తగాథయే గ్రహింపబడుచు, 'గంగా సమీపగం గౌతమాశ్రమం పుణ్యం యత్రాహల్యా శిలామయీ' (అధ్యాత్మరామాయణ. ఆది. 6. అ) అని వచించుచు గంగా సమీపమున గౌతమాశ్రమమనియు అచ్చటనే అహల్య శిలా స్వరూపమున గలదనియు వచింపబడియుండుటచే గౌతమస్థాన నిర్ణయమున భేదభావములు పండితలోకమున నుత్పన్నమయ్యెను.

---

19. M. M. Satish Chandra Vidyabhushana: Nyaya Sutras of Gotama

అందుచేతనే కానగును, గంగా, సరయూ సంగమస్థానమున గోధ్నా యను గ్రామమున నీగౌతము డుండెడివాడను ప్రతీతి యుండుటచే అచ్చట గౌతమథామ్సన్ పాఠశాల Gautama Thomson School అను నామమున ఒక సంస్కృత కళాశాల స్థాపింపబడియున్నదని కొందరి వాదము. కాని గంగాశబ్ద దర్శనమాత్రముననే అనేకవిధముల ప్రామాణికమగు గౌతమ స్థానమును త్యజించి గోధ్నాకరుదెంచుట భావ్యము కాదేమో. 'యాం కాంచిదపి నదీం గంగాశబ్దేన వ్యవహారన్త్యార్యాః' ఆర్యులు చిన్నదైన నదులనుగూడ గంగాశబ్దముచేతనే వ్యవహరించిరి; కాన 'సర్వాః గంగాః సరస్వత్యః సర్వాఃగంగాః సముద్రగాః' అన్నియుగంగలే సరస్వతులే సర్వగంగలును నదులే అను వాయు పురాణప్రమాణము ననుసరించిచూడ గౌతమస్థానమున సంతత ప్రవాహమైయొప్పు క్షీరోదధియు గంగాశబ్దమున వ్యవహరింప బడియుండుటయం దాశ్చర్యమేమియు లేదు. అందుచే గౌతమ స్థానము జన్మస్థానమై ఆశ్రమస్థానమైయుండ గోధ్నా గ్రామము గంగాసరయూసంగమస్థానమగుటచే బవిత్రమై గౌతమునాకర్షించి అందు గొంతకాలము వాసంబుండునట్లు ఒనరించియుండవచ్చును. గౌతములు మైథిలీయులే యనుటకు మరికొన్ని తార్కాణముల బండితులు ప్రదర్శించెదరు. ఋగ్వేదసంహితలో నొక గాథ గలదు. ఒకదినమున గౌతముడనుమహర్షి పిపాసాపీడితుడై ఉదకమునుగానక మరుద్గణముల బ్రార్థింప వారనుగ్రహించి ఎటనుండియో పుష్కలమును మధురమును అగు జలములుగల నొక కూపమునుదెచ్చి గౌతమునకు ముందుంచిరట. ఆకూపోద కము కేవలము గౌతమునితృష్ణ దీర్చుటయేగాక అందుండి పొంగి

పొరలుచు నొక నదివలె ప్రవహించి గంగలో నాడు లయించు టయేగాక నేటికిని అదియట్లే ప్రవహించుచున్నదట. ఆకూపము గౌతమస్థానమునగల్గి, 'గౌతమకుండు' నాపేరనుండుటయు, దాని నుండి సంతతస్రవంతియై 'క్షీరోదధి' నామక నదము ప్రవహించు చుండుటయు గౌతమస్థానవాదులకు బలముచేకూర్చినది. అంతియగాక గౌతమవంశజులే గౌతములనియు, వారు చాల మేధావులై మేధాతిథులని ప్రఖ్యాతిని బడసిరనియు, వారిభక్తికి మెచ్చి అగ్నిదేవుడు వారికి పశుధాన్యసమృద్ధి నొసంగెనను ఋగ్వేదసంహితాపరిశీలనము ననుసరించియే ప్రస్తుత గౌతమ స్థానప్రాంతమంతయు సస్యశ్యామలమై సిరిసంపదల కాలవాలమై యున్నదనియు గొందరుపండితు లన్వయించిరి. పైవిధానమున విచారించినచో ప్రథమమునుండి గౌతమవంశజులందరికి మిథిలా దేశమే జన్మస్థలమనియు అదియే వాసస్థానమనియు దోచును.



## గౌతముడు - న్యాయదర్శనము.

'కణాదేన తు సంప్రోక్తం శాస్త్రం వైశేషికం మహత్। గౌతమేన తథా న్యాయం సాంఖ్యం తు కపిలేన వై॥' (పద్మ పురాణము-ఉత్తర. 263. ప) కణాదునిచేత మహత్ శాస్త్రమైన వైశేషికమును, అటులనే గౌతమునిచే న్యాయము, కపిలునిచే సాంఖ్యము ఏర్పడినట్లు పద్మపురాణము గౌతమునకు న్యాయ శాస్త్రకర్తృత్వము దెలుపుచున్నది. మరియు 'గోతమస్స్వేన తర్కేణ ఖండయన్ తత్ర తత్ర హి' (వాయుపురాణము-కాళిక.

**17.** అ) గోతముడు తనతర్కముచే నక్కడక్కడఖండించెను అనుచు వాయుపురాణమును, 'మహాముని: గోతమ:' అని నైషధచరిత్రముగూడ గోతముడే న్యాయకర్తయని నిర్ధారించు చున్నవి. ఇట్లు న్యాయకర్తృత్వమున గోతమనామము మాత్రమే గాక 'యదక్షపాదః ప్రవరో మునీనాం' (న్యాయవార్తిక-1) అని ఉద్యోతకారుడును 'యోఽక్షపాదమృషిం న్యాయః ప్రత్యభా ద్వదతాం వరం।' (న్యా భా. 5 2.25) అని న్యాయభాష్యకారు డగు వాత్స్యాయనుడును, 'నమామి ధర్మవిజ్ఞానవైరాగ్యైశ్వర్య శాలినే।నిధయే వాగ్విశుద్ధీనామక్షపాదాయ తాయినే॥' (న్యాయ సూచీనిబంధః) ధర్మవిజ్ఞానవైరాగ్యైశ్వర్యశాలినియు, వాగ్వి శుద్ధులనిధియు రక్షకుడును అగు నక్షపాదునకు ప్రణమిల్లుచున్నా డ ననియు, 'అక్షపాదప్రణీతానాం సూత్రాణాం సారబోధికా। శ్రీవాచస్పతి మిశ్రేణ మయా సూచీ విధాస్యతే॥' అక్షపాదప్రణీత సూత్రములకు సారబోధికయను సూచికను వాచస్పతిమిశ్రనగు నేనురచించితినను శ్లోకద్వయద్వారమున తన గ్రంథారంభప్రార్థన శ్లోకములలో నక్షపాదనామమును న్యాయకర్తగ స్మరించిరి. తన న్యాయసూచీనిబంధ గ్రంథాంతమునగూడ బూర్వోక్త అక్షపాద నామస్మరణముతో దృష్టిగాంచక 'యదలంభి కిమపి పుణ్యం దుస్తర కునిబంధపంకమగ్నానాం।శ్రీగౌతమసుగవీనామతిజరతీనాం సముద్ధరణాత్॥'అనుచు గౌతమనామస్మరణమును గావించి గ్రంథ మును వాచస్పతి ముగించెను. అంతియగాక 'సప్తవింశతి మే ప్రాప్తే పరివర్తే క్రమాగతే।జాతూకర్ణ్యో యదా వ్యాసో భవి ష్యతి తపోధనః॥తదాహం సంభవిష్యామి సోమశర్మా ద్విజోత్తమః। ప్రభాసతీర్థమాసాద్య యోగాత్మా లోకవిశ్రుతః॥ తత్రాపి మను తే

పుత్రాః భవిష్యంతి తపోధనాః। అక్షపాదః కణాదస్తు ఉలూకో వత్స ఏవ చ ' (వాయు. అ. 23) అను వాయుపురాణవచనము గూడ సోమశర్మశిష్యులలో గణాదునితో నక్షపాదుని జేర్చి యున్నది. అందుచే బూర్వోక్తచందము గౌతమనామమునసే అనేక విభిన్నాభిప్రాయములు ప్రబలియుండ నక్షపాదశబ్దము గూడ గొంత కలవరము నేర్పరచియున్నది.

---

గౌతముడు-అక్షపాదుడు

మరియు ప్రథమమున తన న్యాయసూత్రపీఠికలో నహల్యానాథుడే అక్షపాదుడను గౌతముడనియు నతడే న్యాయసూత్రకర్తయనియు వ్రాసిన విద్యాభూషణుడు తర్వాత ప్రచురింపబడిన తన History of Indian Logic భారతీయన్యాయశాస్త్రచరిత్ర అను గ్రంథమున Medhatithi Gautama was the founder of Anvikshiki par excellence. He was quite different from Akshapada. While one lived in Mithila the other flourished at Prabhasa in Kathiawar 20. ఆన్వీక్షికీనిర్మాత మేధాతిథిగౌతముడు. ఇతడు అక్షపాదునకు అన్యుడు. ఇతడు మిథిలలోనుండ నతడు కథియవాడులోని ప్రభాస తీర్థమున నుండెనని వ్రాసెను. అనగా మేధాతిథియను నామము గౌతమునకు నన్వయించి గౌతమునుండి అక్షపాదనామము దూరముగావించి విద్యాభూషణుడు కొంచెము కలవరము కలుగజేసెను. ఏ. బి. కీత్ A. B. Keith కూడ మేధాతిథి గౌతమశబ్దములకు మేళనముగావించుచు The identification

---

20. M. M. Satish Chandra Vidyabhushana: History of Indian Logic

of the Nyaya Sastra of Medhatithi mentioned in the Pratima Nataka with Medhatithi's commentory on Manu is clearly due to forgetfulness that Medhatithi is obviously Gautama, the famous author of the Nyaya Sastra 21. ప్రతిమానాటకమున సూచింపబడిన మేధాతిథివిరచిత న్యాయ శాస్త్రమునకును, మేధాతిథియొక్క మనుధర్మశాస్త్రవ్యాఖ్యానమునకును నేకత్వమును దెలుపుట, న్యాయశాస్త్రమునకు ప్రఖ్యాతకర్తయయిన గౌతముడే మేధాతిథి యనువిషయమును విస్మరించుటవలననే యని విదితము అని వ్రాయుచు, మేధాతిథి గౌతముడే న్యాయసూత్రకర్తయని స్పష్టపరచెను. మనుధర్మశాస్త్రవ్యాఖ్యాతయగు మేధాతిథినిగూర్చి యింకవివరించుచు తన కర్మమీమాంసాగ్రంథమున The first known commentator on Manu whose work has reached us is Medhatithi, who shows himself an adept in the Mimamsa Principles and whose date is most prefarably to be placed in the ninth or tenth century A. D. 22. మనుధర్మశాస్త్రమునకు మనకు లభించిన భాష్యములలో ప్రథమమైనది మేధాతిథి వివరించినది. అతడు కర్మమీమాంసావిషయములలో గొప్ప ప్రజ్ఞాశీలుడని వ్యక్తము. ఇతడు క్రీస్తుతర్వాత తొమ్మిది పదియవశతాబ్దము లకు జెందియుండునని కీత్ రచించెను. కాన న్యాయశాస్త్ర నిర్మాతకును మనుధర్మశాస్త్ర వ్యాఖ్యాతకును నెట్టి సంబంధ ముండనేరదని దీని వలన వ్యక్తము.

పై నుదాహరింపబడిన విషయములవలన గౌతమ, అక్షపాదనామములలోనే మిగుల తర్జనభర్జనలు గలవని తెలియు

---

21. Dr. A. B. Keith : Preface, A History of Sanskrit Literature
22. Dr. A. B. Keith: Karma Mimamsa

చున్నది. గౌతమ అక్షపాదు లొక్కరా యిరువురా అనువిష యము మీమాంస్యమగుచున్నది.

పరిభాసతీర్థవాసుడై శివావతారమని ప్రఖ్యాతి గడించిన సోమశర్మసన్నిధానమున 'తత్రాపి మమ తే పుత్రా భవిష్యంతి తపోధనాః। అక్షపాదః కణాదశ్చ ఉలూకో వత్స ఏవ చ॥' అను వాయుపురాణోక్త ప్రమాణము ననుసరించి చూడ అక్షపాద, కణాద ఉలూక వత్స యను శిష్యులుండిరనియు తెలియుచున్నది. 'యోఽక్షపాదమృషిం న్యాయః ప్రత్యభాద్వదతాం వరం। తస్య వాత్స్యాయన ఇదం భాష్యజాత మవర్తయత్॥' (న్యా.భా. 5.2.25) అను శ్లోకముద్వారమున న్యాయభాష్యకర్తయగు వాత్స్యాయనుడును, 'యదక్షపాదః ప్రవరో మునీనాం శమాయ శస్త్రజగతో జగాద। కుతార్కికాజ్ఞాననివృత్తిహేతూ కరిష్యతే మయా నిబంధః॥' (న్యాయవార్తిక) అను వచనరూపమున న్యాయభాష్యవ్యాఖ్యాతయగు ఉద్యోతకారుడును, 'నమామి ధర్మవిజ్ఞాన...అక్షపాదాయ తాయినే' అనియు 'అక్షపాద ప్రణీతానాం' అను వాక్యములో సర్వదర్శన వ్యాఖ్యానధురీణుడైన వాచస్పతి మిశ్రుడును, సర్వదర్శన సంగ్రహకర్తయై విద్యానిధియై ప్రశస్తిగాంచిన మాధవాచార్యుడు, న్యాయదర్శనమునకు అక్షపాదదర్శనమనియు, నామకరణమొనరించియు న్యాయదర్శనకర్తృత్వమును పరిభాసతీర్థనివాసుడును తపోధనుడునుఅగు అక్షపాదునకు నిస్సందేహముగ నొసంగియున్నారు

కాని 'కణాదేన తు......గౌతమేన తథా న్యాయం' అనుచు పద్మపురాణము, 'గోతమః స్వేన తర్కేణ' అనుచు స్కాందపురాణము, 'మహామునిః గోతమః' అని నైషధము,

గౌతమప్రోక్త 'శాస్త్రేష్వనిరతాః సర్వఏవ హి' అని గాంధార తంత్రము మొదలగు గ్రంథములనేకము గౌతముని న్యాయ కర్తగ వాకొనుచున్నవి.

ఈయవకాశమును గైకొనియే విద్యాభూషణుడు అక్షపాద గౌతముల విడదీసి Medhatithi Gautama was the founder of Anvikshiki par excellence 23. మేధాతిథిగౌతముడే ఆన్వీక్షికీశాస్త్రనిర్మాత అని తీర్మానింపజూచెను. కాని It is by no means easy to determine who was the real author of the Nyaya Sutra 23. న్యాయసూత్రరచయిత ఎవరో తీర్మానించుట అంత సులభముకాదని వెంటనే పలుకుచు, Gautama and Akshapada seem both to have contributed to the production of the work 23. గౌతమాక్షపాదులిరువురును న్యాయశాస్త్రనిర్మాణమునకు దోడ్పడిరని భావించెను. అనగా Akshapada is the real author of the Nyaya Sutra which derived a considerable part of materials from Anvikshiki Vidya of Gautama 23. గౌతముని ఆన్వీక్షికీవిద్యనుండి అధికముగ విషయముల గైకొనియున్న న్యాయసూత్రములకు యథార్థముగ అక్షపాదుడే కర్త అని విద్యాభూషణుడు తీర్మానించెను.

కాని న్యాయసూచీనిబంధకర్త వాచస్పతి గ్రంథప్రారంభమున బూర్వోక్తరీతి అక్షపాద నామమును బ్రస్తావించి, గ్రంథాంతమున 'శ్రీగౌతమసుగవీనామతిజరతీనాంసముద్ధరణాత్' అనుచు గౌతమనామమును సంస్మరించెను. అనగా వాచస్పతి దృష్టిలో నక్షపాదగౌతముల కభేదత్వమేగలదని విదితము. అది

---

23. M. M. Satish Chandra Vidyabhushana: Nyaya Sutras of Gotama

యనుగాక ఒకపురుషునిగూర్చి ప్రస్తావించుసమయమున అతనికి గల నామాంతరముల నన్నిటిని ప్రసంగింపవలసిన అవసరముండదుగాన, ఆపురుషునకన్వయించు యేయొక్క నామము నుచ్చరించినను అతనికే అన్వయమగునని స్పష్టము. అందుచే నితర నామప్రసక్తి అచట లేనంతమాత్రమున నామముల భేదింపజేసి వ్యక్తుల గల్పించి సమస్యల నధికమొనర్చుట సమంజసమనిపించదు. అందుచేతనే, There are doubts expressed even about Gautama's authorship of the Nyaya Sutras. Vatsayana, Uddyotakara and Madhava credit Akshapada with the authoɪship of the Nyaya Sutra, a view which is supported by Vachaspati and Jayanta. According to Padmapurana and Skanda Purana, Gautama is the author of the Nyaya Sutras. Hindu tradition identifies the two and holds that Gautama is called Akshapada 24. గౌతముని న్యాయశాస్త్రకర్తృత్వమును గూర్చి సంశయములు వ్యక్తపరుప బడుచున్నవి. వాత్స్యాయన, ఉద్యోతకార, మాధవులు న్యాయసూత్రకర్తృత్వమును అక్షపాదునకర్పింప దానిని వాచస్పతి జయంతులుగూడ అంగీకరించిరి. పద్మ, స్కాందపురాణముల ప్రకారము గౌతముడు న్యాయసూత్రకర్త యగుచున్నాడు. హైందవసంప్రదాయము యీయిరువురి యభేదమును జూచుచు, గౌతముడే అక్షపాదుడని తలంచును అని రాధాకృష్ణపండితుడును అన్వయించెను. అటులనే న్యాయసూత్ర ఉపోద్ఘాతకర్తయగు నందలాల్ సింహా విశ్వసించి The theory that Gotama and Akshapada are two different persons is

24. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 36

equally unsound 25. గౌతమాక్షపాదులు వేరువేరువ్యక్తులను సిద్ధాంతముకూడ అయుక్తము అని వాదించెను. మైథిలేయుడైన మేధాతిథిగౌతముడే చిరుప్రాయంబున ప్రభాసతీర్థమునకేగి విద్యాభ్యాసాదులగావించి తిరిగివచ్చి గౌతమస్థానమున గోధ్నా గ్రామమున ఆశ్రమంబుల నిర్మించుకొని యుండవచ్చునని యితని వాదము. అవును, అట్లగుటయు ఉచితమే యగును.

---

## అక్షపాదనామము

పై సిద్ధాంతమును బలపరచుటకు అక్షపాదపదముయొక్క పుట్టుపు తోడ్పడుచున్నది. అనగా అక్షపాదనామము గౌతమునకు బుట్టుకతోరాక కేవలము గౌతముడే అయియుండి, కాలక్రమమున తన మేధాప్రాదుర్భావావసరమున మేధాతిథి బిరుదమునలెనే అక్షపాదనామముగూడ అతనికి ప్రాప్తించినట్లు తెలియుచున్నది. ఒకదినమున గౌతముడు గురుసన్నిధి జ్ఞానము నార్జించి తన్నిమగ్నమానసుడై తీవ్రయోచనాగ్రస్థుడై బాహ్యస్మృతి చాలవరకు బాసి ముందుకు పయనమగుచు ముందుగల కూపమునబడెను. అందుండి అతనిని రక్షింప మిగుల శ్రమయగుట దిలకించి, ఆతని మేధాసంపత్తికి సంతోషించి అట్టి యసమానప్రజ్ఞానిధి నశించిన బ్రపంచము జ్ఞానధనమునుగోల్పోయి దరిద్రతపొందునని తలంచి పరమేశ్వరుడనుగ్రహించి, శరీరమునగల నేత్రద్వయమే గాక పాదద్వయమునగూడ అక్షిద్వయమును ప్రసాదించెను. అందుచే

25. **Nandalal Sinha: Nyaya Sutras : Introduction**

యోచనారతి ఊర్ధ్వమునగల నేత్రములు నిమీలితము లైనను, పాదములగల నేత్రయుగ్మము గౌతముని కెట్టి సంకటము సంప్రాప్తింపకుండ రక్షించుచుండెనట. అందుచే బాదములకు అక్షములుండుటచే, అతడు అక్షపాదుడయ్యెనట. మరియొక గాథయు గలదు. గౌతమశిష్యుడైయుండియు గౌతముబరిత్యజించి అన్యుల నాశ్రయించి మరల పశ్చాత్తప్తహృదయుడై గౌతముచెంతకరిగి వ్యాసనామక శిష్యుడు సాష్టాంగమాచరించెను. ఆసమయమున ధ్యాననిమగ్నుడైన గౌతముడు దీనిగ్రహించి, గురుద్రోహముగావించిన అతని ధ్యానమగ్నమగు నేత్రముల దిలకింప నొల్లక, దన పాదద్వయమునుండి చక్షుద్వయము నుద్భవింపజేసి ఆతని వీక్షించెనట. అందుచే అక్షపాదుడయ్యెనని యందురు. అదియునుగాక, అక్షపాద శబ్దమునకు మరియొక అన్వయముగూడ గోచరించును. శివావతారమైన సోమశర్మయొక్క తపోఫలమోయన్నట్టుల, తన శిష్యులు అక్షపాదకణాదులిరువురును సమానతంత్రములని ప్రఖ్యాతిగడించిన న్యాయవైశేషికముల నిర్మించి దర్శనశాస్త్రములకు నాందిపాడుటయేగాక సర్వతత్త్వశాస్త్రమునకును బునాది బిగించియుండిరి అంతియగాక, నితర దర్శనకర్తలు తమ సహజనామములతో బిలువబడుచుండ వీరిరువురుమాత్రము అన్వయనామములతో బిలువబడుచున్నారు. ఆనామములైనను తమ రూపాదులకు సంబంధింపక దాము నిర్మించిన సిద్ధాంతములకు సంబంధించి, ఆనామయుచ్చారణమాత్రమున సిద్ధాంత స్మరణము గలుగునట్లు ఏర్పడియుండుట ఆశ్చర్యకరము. కణములని వచింపబడు పరమాణువులే సృష్టికి ఉపాదాన కారణమని

బోధించి వైశేషికసిద్ధాంతమును బ్రతిపాదించిన ఉలూకమహర్షి కుమారుడగు కశ్యపుడు, తన నామకరణనామమును గోల్పోయి కణభుక్ అనియు కణాదుడనియు బిలువబడుట తెలిసినదే. అటులనే సోదరుడగు గౌతముడుగూడ తనచే బ్రతిపాదింపబడిన సిద్ధాంతబలమున తన గౌతమనామమునకు వెంట అక్షపాద నామమునుగూడ గడించెను. అక్షపాదశబ్దమునకు అమరకోశము 'నైయాయికః తు అక్షపాదః' అని నిర్వచించి, అక్షపాద యనగా ప్రమాణప్రమేయాది నిగ్రహస్థానపర్యంతము షోడశ పాదములుగల శాస్త్రమును బోధించెనుగాన అక్షపాదుడు. అనగా పదారు రజతమాషలుగల అక్ష నాబడు స్వర్ణనాణెమును బోలు వాడని తాత్పర్యమని వచించెను. పదునారుసోపానములుగల సిద్ధాంతమును బోధించి వానిద్వారా తత్త్వజ్ఞానమును నిఃశ్రేయసమును బ్రసాదించినవాడని అక్షపాదశబ్దమునకు అన్వయ ముండుటచే అక్షపాదనామము కాలాంతరజనితమనియు, అనగా గౌతముడు న్యాయదర్శనకర్త యయినపిమ్మటనే యీనామము, లేక బిరుదము లభించెననియు దోచెడిని. అంతియగాక అక్ష పాద, కణాద, శబ్దములు వాయుపురాణవాక్యముననే యుండు టచే, గురుశుశ్రూషానంతరము, కశ్యపగౌతములు నిర్మించిన వైశేషికన్యాయదర్శనముల దిలకించి, ఆనందించి, గురువర్యు డైన సోమశర్మయే వారి కా బిరుదప్రదానము జేసియుండు నేమోయనియు దోచుచున్నది.

---

## గౌతమకాలము

న్యాయదర్శనకర్త వ్యక్తిత్వమునుగూర్చియే యింత అలజడి పండితలోకమున జరిగియుండ నిక అతడు ఏకాలమువాడో నిర్ణయింప ఎంతయో కష్టమగుచున్నది. కాలనిర్ణయమున ప్రాక్పాశ్చాత్యపండితులలో ఒక పోరాటమున్నది. There is much dispute about the chronology of the Vedic period, European scholars usually giving later dates and Indian scholars much earlier ones 26. వేదకాలనిర్ణయమున గూడ నెక్కువ వివాదముగలదు. సామాన్యముగా యూరోపు దేశీయపండితులు యిటీవలికాలమును, భారతీయపండితులు అతిప్రాచీనకాలములను ఒసంగుచుందురు అని జవహారిలాల్ నెహ్రూపండితుడు వచించినట్లు ఆవివాదము నేటికి ప్రతివిషయమునను పొడచూపుచునేయుండును. మాక్సుముల్లరు వచించినట్లు భారతీయులకు గ్రంథములగల విషయప్రాధాన్యతయే దృక్పథమున గన్పింప గ్రంథరచనకాలముగాని గ్రంథకర్తయుగూడ అప్రధానమైయుండుటచే, కర్తను నిర్ణయించుట ఎంతకష్టమో గ్రంథరచనకాలమును నిర్ధారించుటయు, బహుకష్టముగా బరిణమించియున్నది. కాబట్టి The dates of none of these fundamental texts can be traced with certainity; nor is anything known about their authors, who are nothing but names, some of which seem to be actually mythical 27. ఈమూలగ్రంథములలో దేనికినికాలనిర్ణయము నిశ్చయముగ

---

26. Pandit Jawaharlal Nehru: Discovery of India 53

27. Dr. A. A. Macdonell: India's Past.

గనుగొనుట దుర్లభము. కేవలము నామమాత్రముగనున్న రచ యితలగూర్చి నెద్దియు తెలియరాదు. వీరిలో గొందరు యథార్థమున గల్పితములేయని Macdonell మాక్డొనెల్ వ్రాయుచున్నాడు. అందుచే నిరాధారపాత్రిపదికపై బండిత లోకము ఎట్లు ఊహాగానమొనరించెనో విచారించుటయు ముఖ్యావసర మగుచున్నది. Prof Stcherbatski షెర్బస్కీ అను రష్యా దేశస్థు డైనఆచార్యుడు న్యాయసూత్రి భాష్యగ్రంథముల బౌద్ధ విజ్ఞానవాదసంబంధమును సూచించు లక్షణముల బరిశీలించి సూత్రము భాష్యము రెండును క్రీ. త. 500 సంవత్సరములకు జెందునని వ్రాసియున్నాడు 28. బౌద్ధవిజ్ఞానసంపర్క-వాదమును Prof. Jacobe జకోబి పండితుడును గ్రహించి సూత్రగ్రంథము భాష్యగ్రంథము క్రీ. త. 2వ శతాబ్దికి జెందిన శూన్యవాదము నకు దర్వాతను, క్రీ. త. 5వ శతాబ్దికి జెందిన విజ్ఞానవాదము నకు బూర్వమును ఏర్పడియుండుననియు సూత్రి భాష్యములకు మధ్యకాలము ఒక తరముకంటె అధికము అనవసరము లేదనియు రచించెను 28. Prof. Suali సౌలి పండితుడు మూలవిషయముల జకోబి పండితునితో సమ్మతించి వాత్స్యాయన కాలనిర్ణయ మెట్లున్నను గౌతమకాలనిర్ధారణమును సందేహించెను. One generation is too short an interval to be placed between the Bhashya and the Sutra. He would suggest an interval of 100 years if not more, thus referring the Sutras to about 300 or 350 A. D. 28. భాష్య సూత్రిములకు మధ్య కాలమున ఒకతరము మిగుల స్వల్పమనియు, గనీసము నూరు

---

28. Dr Ganganath Jha : Introduction by Pandit Gopinath Kaviraj: Gautama's Nyaya Sutras

వత్సరముల మధ్యకాలముగ దాను సూచించెదననియు దెల్పి సూత్రగ్రంథము క్రీ. త. 300 లేక 350 సంవత్సరములకు జెందిన దని వాకొనెను. షడ్దర్శనములలో న్యాయము కడపటిదనియు క్రీస్తుశకమునకు బూర్వము ఎక్కడను దాని ప్రసక్తి జాడలు లేవనియు, తన విశ్వాసమునను సరించి శబరునకు సమకాలీను డగు బంచశిఖునకుమాత్రము యీదర్శనము తెలియుననియు, శబరునికాలము క్రీ. త. నూరు మూడువందల సంవత్సరముల మధ్యయగుటచే న్యాయదర్శనకాలముగూడ నిదియై యుండునని Prof. Garbe గార్బ్ అభిప్రాయపడియున్నాడు 28. **All that we really know is that the Nyaya Sutra, as it stands, a compilation no doubt representing earlier thought, takes cognizance of theNihilistic school of Buddhism,probably as it developed in the 1st century A. D. And even that result is uncertain** 29. ప్రస్తుతముగల న్యాయసూత్రము నిస్సందేహముగా తత్పూర్వభావముల బ్రతిబింబింపజేయు సంపుటమేయగుచు, బహుశః క్రీ.త. ఒకటవశతాబ్దములో నభివృద్ధి గాంచిన బౌద్ధశూన్యవాదమునుదనగ్రంథమునసూచించుచుండుట మనకు దెలియును. అదియునుగూడ అనిర్ధారణమే యగును అని Keith కీత్ తెలుపుచున్నాడు. అతనిఅభిప్రాయమురీతి న్యాయసూత్రము క్రీ. త. మొదటిశతాబ్దముతర్వాతనే అని తెలియనగును. అటులనే జకోబి Jacobi పండితుని పరిశీలనా ఫలితములప్రకారము న్యాయసూత్ర బ్రహ్మసూత్రములు బౌద్ధశూన్యవాదమునకు అనంతరమే యగునుగాని, విజ్ఞానవాదమునకు బూర్వమున నిర్మింపబడినటుల నమ్మకమును కలుగజేసినది.

---

**30. Dr. A. B. Keith ; Preface, A History Of Sanskrit Literature, 472**

అనగా క్రీ. త. 200, 400 సంవత్సరములమధ్య అయియుండు ననియు కీత్ మహాశయుని విశ్వాసము30. The sixth century B. C. when it was recognized as a special study, marks the beginning of systematic philosophy in India, and by the first century B. C. the Anvikshiki is replaced by Darsana 31. (ప్రత్యేకదృష్టితో గాంచిన భారతదేశమున క్రీ. పూ. ఆరవశతాబ్దము సక్రమతత్త్వవిచారణమునకు ప్రారంభమను సూచనలు గోచరించును, క్రీ. పూ. ఒకటవ శతాబ్దమునకే దర్శనముచే ఆన్వీక్షికీస్థాన మలంకరింపబడియున్నదనియు, The Sutras of Gotama, at any rate the earlier of them belong to the 3rd century B. C. 32. ఎట్లైనను గౌతమసూత్రములప్రథమ భాగమైనను క్రీ. పూ. మూడవశతాబ్దమునకు చెంది యుండునని రాధాకృష్ణపండితుని అభిప్రాయము. శ్రీనివాస అయ్యంగారుకూడ The earliest Nyaya book, the Sutras of Gautama are not much later than the age of Buddha 33. ప్రాచీన న్యాయగ్రంథమగు గౌతమసూత్రములు బుద్ధునికాలమునకు దర్వాత ఎక్కువ దూరములుగావనియు భావించిరి. తన తర్కసంగ్రహగ్రంథమున Bodas బోడస్ మహాశయుడు, కణాద సూత్రములు క్రీ.పూ.400 సం॥లకు పూర్వమునకుగాని క్రీ.త.500 సంవత్సరములకు తర్వాతగాని కావనియు, క్రీ.త.500 వాత్స్యాయనుని కాలమనియు చర్చించుచు, the Sutras of Gotama are older than those of Kanada.........Gotama's text belongs to 400 B. C. 34. గౌతమసూత్రములకు కణాదసూత్రములకు

---

31. Prof. S. Radhakrishnan:Indian Philosophy Vol 2 18
32. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 36
33. V. T. Srinivasa Iyangar: Out Lines Of Hindu philosophy 194
34. Pandit Gopinath Kabiraj: Introduction To Gautama Nyaya Sutras

ప్రాచీనములు. గౌతమగ్రంథము క్రీ. పూ. 400 సంవత్సరములకు చెందుననియు, ఎందుచేననగ, మీమాంసాభాష్యకర్త యగు శబరస్వామి ఉపవర్షునిగూర్చి ప్రస్తావించి ఉపవర్షునకు గౌతమన్యాయశాస్త్ర పరిచయముగలదని సూచించెననియు, అందుచే there is no inconsistency in placing Gotama in the 4th century B. C. or a little later 34. గోతముని క్రీ. పూ. నాల్గవశతాబ్దమునకుగాని కొంచెము తర్వాతకాలమునకుగాని నిర్ణయించుటయందు అసంబద్ధత యొకించుకయు లేదని వ్రాసియున్నాడు. చైనాదేశసాక్ష్యము నొందుగ్రహించి న్యాయనిర్మాతయగు అక్షపాదుడు బౌద్ధమతమునకు పూర్వాచార్యుడనియు, కాని The Sutras as we have them are comparitively modern being probably post- Mahayanic age 34. మనకు ప్రస్తుతము లభించు సూత్రములు అర్వాచీనములనియు బహుశః అవి మహాయానకాలము తర్వాతకాలమునకు చెందియుండుననని హరిప్రసాదశాస్త్రి నిర్ధారింప యత్నించెను. Katyayana, 4th century B. C., and Patanjali (whose great work was written about 140 B. C.) knew the Nyaya System 34. క్రీ. పూ. 4వ శతాబ్దమునకుచెందిన కాత్యాయనుడును, క్రీ. పూ. 140 సంవత్సరప్రాంతమున ఉద్గ్రంథమును రచించిన పతంజలికూడ న్యాయశాస్త్రమునువెరుంగుదురు అని పాణిని వ్యాకరణమును ప్రచురించిన Goldstucker గోల్డుస్టక్కరు వ్రాసెను. అనగా గౌతమసూత్రము క్రీ. పూ. 400 సంవత్సరములకు పూర్వమేయని అభిప్రాయము స్పష్టము.

---

34. Pandit Gopinath Kaviraj: Introduction to Gautama Nyaya Sutras

Sabara's quotations from Bhagavan Upavarsha, who is said to have written commentaries on both the Mimamsas, indicate Upavarsha's familiarity with Nyaya views 35. మీమాంసాద్వయమునకు వ్యాఖ్యానముల లిఖించినట్లు వాకొన బడుచుండు భగవాన్ ఉపవర్షునినుండి శబరస్వామి ప్రమాణములు, ఉపవర్షునకు న్యాయమున పరిచయము గలిగినట్లు స్పష్టపరచుచున్నవి. కావున We may, therefore, conclude that the Nyaya Sutra existed in the 4th century B. C. though not in the present form 35. ప్రస్తుతాకృతిని గాక పోయినను, న్యాయసూత్రము క్రీ.పూ. 4వ శతాబ్దమున గలదని మనము తీర్మానింపనగునని రాధాకృష్ణపండితుడు వచించెను. Of the antiquity of logic we have no real knowledge• efforts to find it early in Buddhism are ruined by the lateness of Buddhist texts and the attempts to ascribe the beginnings of the Nyaya Sutra to a Gotama (500B.C.) while the Nyaya ascribed to Akshapada(150 A.D.)rest on no adequate ground 36. న్యాయముయొక్క ప్రాచీనతనుగూర్చి మనకు యథార్థమగు ఆధారములు లేవు. బౌద్ధమత ప్రారంభ సమయముల దీని గాంచు యత్నములు, బౌద్ధగ్రంథముల అర్వాచీనత్వముచే కుంటువడెను. మరియు న్యాయసూత్రము యొక్క ప్రారంభదశ క్రీ. పూ. 500 సంవత్సరములకు జెందిన ఒక గౌతమున కన్వయించుచు, దర్వాత న్యాయశాస్త్రమును క్రీ. శ. 150 సంవత్సరములకు జెందియున్న అక్షపాదునకు అన్వయించుటయును దుర్బలాధారములతో గూడియున్నదని

35. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vcl 2. 36
36. Dr. A. B. Keith : Preface, A History of Sanskrit Literature. 482

Keith కీత్ పండితుడు వ్రాసెను. కాని న్యాయసూత్రములను గౌతమధర్మసూత్రములను, పితృమేధసూత్రములను వ్రాసిన గౌతము డొక్కడేయనియు and was an inhabitant of Mithila, lived in the 6th century B. C. and was a contemporary of Buddha. He was the author of the first chapter of the work, the later chapters being subsequent additon 37. అతడు మిథిలాదేశవాసియై క్రీ. పూ. 6 వ శతాబ్దమున గౌతమబుద్ధునకు సమకాలికుడనియు, అతడు గ్రంథముయొక్క ప్రథమాధ్యాయమును లిఖింప మిగిలినవి తర్వాత బ్రక్షిప్తములనియు సతీశచంద్రవిద్యాభూషణుని అభిప్రాయము.

All this is very discouraging to students accustomed to chronological accuracy 38. కాలక్రమనిర్ణయమున కలవాటుపడిన విద్యార్థుల నిదియంతయు చాల అధైర్యపరచును. పై మీమాంసా విషయముల నాలోచించినచో న్యాయసూత్ర కాలము బుద్ధపూర్వకాలమునుండి క్రీ. త. 600 సంవత్సరముల వరకు వ్యాపించియున్నది. అందుచే This wild confession is a sure indication of the fact that we are travelling on insecure ground. And as a matter of fact it is not possible to be quite precise, when the premesis is so shaky 39. మనము నిరాధారమగుభూమిపై బయనించుచున్నా మనుటకు నీకలవరమే ప్రత్యక్ష నిదర్శనము. యథార్థముగు ప్రమాణములు యింత బలహీనముగానున్నప్పుడు ఇదమిత్థమన

37. Pandit Gopinath Kaviraj Introduction to Gautama Nyaya Sutras
38. Prof F. Max Muller: The Six Systems of Indian Philosophy 120
39. Pandit Gopinath Kaviraj; Introduction to Gautama Nyaya Sutras

టయు దుర్లభము అని గోపీనాథ కవిరాజపండితుడు అభిప్రాయ పడుచు, The Sutras and the Bhashya does not seem to have yet been studied with the minuteness and thor_oughness which their nature demands. A critical edition of the Sutra Patha of Nyaya based upon a collection of all possible MSS of different rescensions and of Sutras as accepted by the 'various glosses and commentaries still existing, is the greatest disideratum of the day, and until this is done it is vain to endevour to determine the sutratwa of a particular aphorism 39. సూత్రము భాష్యము వానితత్త్వము ననుసరించిన విధానమున క్షుణ్ణముగను సూక్ష్మముగను నింకను బఠింపబడి యుండలేదు. వివిధ పాఠములకుజెందిన లిఖితగ్రంథముల నన్నింటిపైనను, ప్రస్తుతముగల వివిధవ్యాఖ్యానములు వృత్తులు స్వీకరించిన సూత్రములమీదను ఆధారపడిన సవిమర్శకమైన యొక న్యాయసూత్ర పాఠమును వెలువరించుట ప్రస్తుత మత్యంత వాంఛనీయము. ఇది జరుగనంతవరకు, సూత్రముల సూత్రత్వమును నిర్ణయింప యత్నించుట వ్యర్థమే యగునని గోపీనాథుడు వ్రాయుచున్నాడు.

యథార్థముగ సూత్రగ్రంథములు They are all the productions of Schools not of individuals 40. అన్నియు వ్యక్తులచేరచింపబడినవిగాక సంప్రదాయములచే నిర్మితములనియు అందుచే Even if we could determine the date of the Sutras, this would prove nothing regarding the time when the philosophical systems and schools came into

39. Pandit Gopinath Kaviraj : Introduotion to Goutama Nyaya Sutras
40. Dr. A. A Macdonell: India's Past

being 40. మనము సూత్రకాలనిర్ణయము గావింపగలిగినను యీ సిద్ధాంతములు ఎప్పుడు జనించినదియు నది తీర్మానింపజేయు జాలదనియు దానిననుసరించిచూచినచో The founder of the Nyaya System and author of Nyaya Sutra is by tradition unanimously reputed to have been Akshapada Gautama. It cannot be doubted that the Sutra attributed to him is the work of a school, not of an individual man 40. న్యాయసిద్ధాంతనిర్మాతయు, న్యాయసూత్రకర్తయు అక్షపాద గౌతముడే యని ఏకోన్ముఖముగా సంప్రదాయ ప్రశస్తిగలదు. కాని ఆతని కన్వయింపబడు సూత్రగ్రంథము ఒక వ్యక్తికర్తృ కముగాక ఆసిద్ధాంతవాదులదని సందేహింప నవసరము లేదనియు Macdonell మాక్డొనెల్ అభిప్రాయమును బ్రకటించి, గౌతము నకు సిద్ధాంతకర్తృత్వమునుమాత్రము ఒసంగి, సూత్రకర్తృత్వ బాధ్యతను దొలంగింప యత్నించెను. కాని యాతని వచనము లలో వ్యక్తమైయున్నటుల సంప్రదాయమునకు ఆతీర్మానము విరుద్ధము. కాన అనాదరణీయము.

అదియునుగాక, పూర్వవిచారణమున స్పష్టమైనటుల నొక సిద్ధాంతముయొక్క ప్రాచీనార్వాచీనత్వముల, అందును ఇతరసిద్ధాంతములందును సూచింపబడియున్న సిద్ధాంతములపై నాధారపడియు దీర్మానింపబడియున్నవి. ఆవిధానము దోష భూయిష్టమనియు ఆధునికభావముల ప్రాచీనపరిభాషతో గ్రహింప యత్నించుట హానికరమనియు తెలియనగును. If there is a passage illustrating an old theory which has died out but which survives in its developed form

40. Dr. A. A. Macdonell: India's Past.

in a recent but better known Vada, it is very likely that we shall understand it as representing the later 40. ప్రస్తుతము అదృశ్యమైయుండియు, యిటీవలగల ప్రఖ్యాతవాదముగా నభివృద్ధిగాంచియున్న సిద్ధాంతముగ ప్రస్తుతము సజీవమైయున్న ప్రాచీనసిద్ధాంతవాక్యమును దిలకించి, దాని ప్రాచీన సిద్ధాంతమునుగా మనము గ్రహించుట గలదు. కాని The early history of Indian thought being not known in detail it becomes really very hard at times to identify a particular doctrine 41. భారతీయ ప్రాచీనవిజ్ఞానచారిత్రము సవివరముగ లభింపకుండుటచే ఒకసిద్ధాంతమును గుర్తించుటయు గూడ గడుంగడు గష్టసాధ్యమగుచున్నదని గోపీనాథుడు వచించుచున్నాడు. అనగా సిద్ధాంతములు కాలవాహినిలోబడి ప్రవహించి యనేక రూపాంతరముల బొందుచుండుటచే నేదేని యొక్క వాదభావము మరొకదానిలో మనము గాంచినచో వెంటనే ఒకదానికి మరొకటి అర్వాచీనమని నిర్ణయించుట దోషభూయిష్టమని ఆతని నిశ్చయము. ఉదాహరణమునకు, గౌతమబుద్ధునకు బూర్వమే బౌద్ధమతసిద్ధాంతములు రూపాంతరముల వ్యాప్తమైయుండుట బ్రత్యక్షమే. అందుచే నొక సిద్ధాంతగ్రంథమున బౌద్ధసిద్ధాంతభావములయునికి గోచరించినమాత్రమున ఆ సిద్ధాంతము గౌతమబుద్ధుని తర్వాత విషయమైయుండునని నిర్ణయించుట దోషమనునదే యిందలి తాత్పర్యము.

---

40. Dr. A. A Macdonell: India's Past

41. Pandit Gopinath Kaviraj : Introduction to Goutama Nyaya Sutras

## శ్రీరామచంద్రుని కాలము

అందుచే, పైజర్మాంశములు బరిశీలించినపిమ్మట న్యాయసూత్రకర్త అక్షపాదగౌతముడే యను భావమేర్పడుటయు నతడు మైథిలేయుడనియు గ్రాహ్యమగుచున్నది. ఆగౌతముడు శ్రీరామచంద్రుని సమకాలికుడైన అహల్యానాథుడైన వాడనియు అభిప్రాయ మేర్పడుచున్నది. అట్లేయగుచో రామాయణకాలము నాటి గౌతముని గౌతమబుద్ధుని కాలమువాడనియు, ఇంకను క్రీస్తుకు దర్వాతివాడనియు భావింప యత్నించుటగూడ విచారకరము హాస్యాస్పదము. Bently relying on the same data has calculated 961 B. C. as the exact date of Rama's birth 42. శ్రీరామచంద్రుని జాతకచక్రవిచారణముగావించి బెంట్లి పండితుడు క్రీ. పూ. 961 సంవత్సరము సరిగా శ్రీరాముని జననకాలముగా నిర్ణయించెనని సూచించుచు, The horoscope of Rama and the positions of the planets at the time of the great civil war, as found in the Mahabharata, are said to point to a period of 5000 or 6000 B.C. 42. మహాభారతమున వ్రాయబడినట్లు, రామాయణయుద్ధకాలమున గల గ్రహకూటమును శ్రీరామచంద్రుని జన్మచక్రముల ననుసరించి యోచించుచో శ్రీరాముని జననకాలము క్రీ. పూ. 5000 లేక 6000 సంవత్సరములు అయియుండునని జ్యోతిష శాస్త్రప్రవీణతగూడ గడించి ప్రఖ్యాతిగనిన బాలగంగాధరతిలకు భావించియున్నాడు. ఇద్దరు జ్యోతిశ్శాస్త్రజ్ఞులకు ఒకే గ్రహకూటము వివిధకాలములలో సందర్భించియున్నట్లు గోచరించి

---

42. Bala Gangadhara Tilak: Orion

యున్నచో, అటులే విచారించుచుబోయిన యిదే గ్రహ సంపుటి అతిప్రాచీనకాలములగూడ గలిగి శ్రీరామచంద్రుని జననకాలమును అతిప్రాచీనమునకు గొంపోవునను తెట్టిసందేహమును అగుపడదు. అందుచే యుగపురుషులై యుగయుగములక్రితము జనించిన వారి కాలనిర్ణయమున బండితలోకము యిసుమంత జాగ్రతవహించి, ఆర్షసంప్రదాయమునననుసరించి, పురాణపురుషుల ఆధునికవాతావరణమునకు యీడ్వ యత్నింపకుందురుగాక! ఈక్లిష్టమగు సమస్యను విచారించి, హోరానుభవదర్పణశాస్త్రమును సంప్రదించి 'గౌర శంభు కథా తథా నపకథా సృష్ట్యాదికోహర్గణః' అనగా (71, 403, 67. 14-523) అనగా సృష్ట్యాది పైసంఖ్యాపరిమితకాలమున 24 వ మహాయుగ వైవస్వతమన్వంతరమున త్రేతాద్వాపర సంధికాలమున 24 సంవత్సరములు గడచినపిమ్మట శ్రీరామావతరణకాలముగా ములుకట్ల నృసింహావధాని నిర్ణయించెను 43. అనగా 24వ మహాయుగమున 30 వేలసంవత్సరములు మిగిలియుండగా శ్రీరామావతరణము. ప్రస్తుతము జరుగుచున్న కలియుగమునకు పూర్వము 1,18,47,000 వత్సరములకు పూర్వముగా నిర్ణయించిరి. అంత ప్రాచీనతను సూచించుచు, We read there in the Upanishads of an ancient king Janaka whose fame at the time when the Upanishads were composed had already spread far and wide. He was a king of the Videhas, his capital was Mithila, and his daughter Sita is represented to us in later times as the famous wife of

43. ములుకట్ల నృసింహావధాని: రామాయణ సారోద్ధారము

Rama 44. ఉపనిషత్తులలో ప్రాచీనుడగు జనకమహారాజును గురించి వినుచున్నాము. ఉపనిషద్రచనకాలమున ఆతని కీర్తి దిగంతముల నిండియుండెను. అతడు విదేహదేశ చక్రవర్తి, అతని రాజనగరము మిథిల. అతని పుత్రికయగు సీతయే రాముని ప్రఖ్యాతపత్నిగా దర్శాంత మనకు వ్యక్తమగుచున్నదని Max Muller మాక్సుముల్లరు వ్రాసియున్నాడు. అందుచే శ్రీరామచంద్రుడుగూడ ఉపనిషత్కాలమునకు జెందినవాడని దీనివలన స్పష్టము. అట్టి శ్రీరామచంద్రునకు విశ్వామిత్రమహర్షి గౌతమాశ్రమమును సూచించుచు, 'మిథిలోపవనే తత్ర ఆశ్రమం...గౌతమస్య పూర్వమాసీన్మహాత్మనః' మిథిలోపవనముల గౌతముని ఆశ్రమము పూర్వముండెనని చెప్పుటచే, శ్రీరాఘవుడు అచ్చోటున కేతెంచుకాలమునకు గౌతముడు ప్రాచీనుడగుచున్నాడు. మరియు అహల్యాదోషమును గ్రహించి శపింపనుంకించి, కమండలోదకమును గ్రహించి 'ఇహ వర్షసహస్రాణి బహూని త్వం నివస్యసి। వాయుభక్షా నిరాహార తప్యంత' ఇచ్చట బహుసహస్రవర్షములు వాయుభక్షణమున నిరాహారివై తపమున నుండుము అని గౌతముడు అహల్యను శపించినట్లు వ్యక్తము. అనగా దాశరథి అహల్యాశాపవిమోచన గావించునప్పటికే కొన్ని వేలవర్షములు గతించినట్లు విదితము. ఈవిషయమునే పైనుదాహరింపబడిన వాల్మీకి రామాయణమువలెనే అధ్యాత్మరామాయణముగూడ, 'ఏవం వర్షసహస్రేషు హ్యనేకేషు గతేషు చ। రామో దాశరథి

---

44. Prof, F. Max Muller: The Six systems of Indian Philosophy, 11

శ్రీమానాగమిష్యతి సానుజ॥' ఈవిధముగ అనేక వేలసంవత్సరములు దశరథరాముడు సానుజుడై యిట కరుదెంచువరకు శిలారూపమున నుండుమని గౌతముడు శపించినట్లు గలదు. అందుచే శ్రీరామునికాలమునకే అనేక సహస్రవర్షముల పూర్వమే గౌతముడు అట ఆశ్రమస్థాపనముగావించియుండెనని తాత్పర్యము. కాన గౌతముని శ్రీరామచంద్రునితో సంబంధింపజేసినను కాలాతీతముగ నున్నట్లు స్పష్టము.



## జాతుకర్ణ్యవ్యాసకాలము - గౌతమకాలనిర్ణయము

'సప్తవింశతి మే ప్రాప్తే పరివర్తే క్రమాగతే। జాతుకర్ణ్యో యదా వ్యాసో భవిష్యతి తపోధనః॥ తదాహం సంభవిష్యామి సోమశర్మా ద్విజోత్తమః। ప్రభాసతీర్థమాసాద్య యోగాత్మా లోకవిశ్రుతః॥ తత్రాపి మను తే పుత్రా భవిష్యంతి తపోధనాః। అక్షపాదః కణాదశ్చ ఉలూకో వత్స ఏవ చ॥' అను వాయుపురాణ ప్రమాణముననుసరించి అక్షపాదుడు ఇరువదియేడవ వ్యాసుడైన జాతుకర్ణ్యవ్యాసుని కాలమువాడని సువ్యక్తము. ఇక జాతుకర్ణ్యుని విషయమున సులభము గా నేరదు. శతపథబ్రాహ్మణములో మాధ్యందినశాఖలో 'జాతుకర్ణ్యో జాతుకర్ణ్యో భారద్వాజాత్ భారద్వాజో భారద్వాజా చ్చాసురాయణాచ్చ గౌతమాచ్చ గౌతమో ... పారాశర్యాత్ పారాశర్యో జాతుకర్ణ్యో జాతుకర్ణ్యో భారద్వాజాత్ భారద్వాజో భారద్వాజా చ్చాసురాయణాచ్చ యాస్కా-చ్చాసురాయణః' అనువాక్యము గలదు. ఆసురాయణునితో గౌత

ముడు విద్యాభ్యాస మొనరించియుండుటచే గౌతముడు జాతుకర్ణ్యవ్యాసకాలమునకు జెందినవాడుగాని లేక నతని శిష్యుడగు భారద్వాజుని కాలమువాడనిగాని తెలుపుచున్నది. మరల శతపథబ్రాహ్మణ మధుకాండ యాజ్ఞవల్క్యకాండములందు, ఆసురాయణ యాస్కులకు జాతుకర్ణ్యుడు శిష్యుడుగా రూపింప బడియున్నాడు. వీరందరును క్రీ. పూ. 550 సంవత్సరప్రాంతము వారని విద్యాభూషణుడు తలంచెను. జాతుకర్ణ్యుని ప్రస్తావన మహాభారతగ్రంథమునగూడ గలదు (భా. 11.30). అతడు వ్యాససన్నిధానమున పైలమహర్షికి బ్రాప్తించిన ఋగ్వేదమును వాత్స్య, మౌద్గల, శరీయ, గోముఖ, శశిరులనుండి యుపదేశింప బడియున్నట్లు అందు వ్యక్తము. జాతుకర్ణ్యుని ఉపదేష్టలగు ఆసురాయణ యాస్కులు సాంఖ్యకర్తయగు గపిలాచార్యుని శిష్యుడైన ఆసురియొక్క శిష్యులనియు వారిరువురికి జాతుకర్ణ్యుడు శిష్యుడనియు శతపథబ్రాహ్మణముయొక్క మరియొకవచనము తెలుపుచున్నది. అందుచే గపిలాచార్యుని దర్వాత మూడుతరముల వాడు జాతుకర్ణ్యుడగుటచే అతని సమకాలికుడగు బ్రిఖ్యాత సోమశర్మశిష్యులగు గౌతమ కణాదులుగూడ అదేకాలమునకు జెందినవారనుట కెట్టి సందియము లేదు. ఈవిషయమునే Kapila is stated in the Sankhya Karika 70 to have taught his philosophy to Asuri who is mentioned in శతపథబ్రాహ్మణ as a teacher ఆసురాయణ and యాస్క who followed Asuri were teachers of Jatukarnya a contemporary of Akshapada Gautama. Kapila therefore preceeded by at least three generations 45. 70వ సాంఖ్య

45. Nandalal Sinha: Nyaya Sutras of Gotama

కారికలో శతపథబ్రాహ్మణమున ఉపదేశకుడుగా దెలుపబడిన ఆసురికి తన సిద్ధాంతమును గపిలుడు బోధించినట్లు గలదు. అక్షపాదగౌతమునకు సమకాలికుడైన జాతుకర్ణ్యునకు, ఆసురి యొక్క శిష్యులగు ఆసురాయణ యాస్కులు గురువులైరి. అందుచే గపిలుడు గౌతమునకు గనీసము మూడుతరములు ముందుండవచ్చును అని నందలాల్ సింహో వాదించియున్నాడు. అట్లగుచో గపిలుడు సృష్ట్యాదినగల స్వాయంభువమనువు కాలము వాడగుటచే సృష్ట్యాది 195,58.85,056 సంవత్సరములలో నొక మన్వంతరమును 30,67,20,000 సంవత్సరముల మినహాయింపు గావింప కపిలాచార్యుడు సుమారు 164,91,65,056 వత్సరముల వాడని విదితమగుచున్నది. కావున గౌతముడుగూడ దాదాపు అదేకాలమునకు జెందియుండునని తాత్పర్యము.

---

## పాశ్చాత్యపండిత విమర్శనరూపము

గౌతమకాలనిర్ణయ సమస్య యింత క్లిష్టతరమగుటచే Dates are the weak points in the literary History of India భారతీయ విజ్ఞానచారిత్రమున గాలనిర్ణయము బలహీనమని Max Muller మాక్సుముల్లరు అనురీతి భారతీయవిజ్ఞానము యొక్క యీదుర్బలత్వమును హస్తగతమొనర్చుకొని, స్వోత్కర్షకొరకై European scholars usually giving later dates ఐరోపీయవిద్వాంసులు అర్వాచీనకాలనిర్ణయము సేయుచున్నారు. ఆకాలనిర్ణయముగూడ గౌతమబుద్ధుని ప్రసుక్తిస్తుని

ప్రధానముగాఁగైకొని వారికి యిరువైపులకు ప్రాచీన అతిప్రాచీన మహర్షి గణములనేగాక శ్రీరామాది అవతారపురుషులఁగూడ నన్వయింపజూచుట గడుంగడు విచిత్రము చింతనీయము, హాస్యాస్పదము. ఇట్టి అసందర్భనిర్ణయములకే పండిత యన్ భాష్యాచార్యులు కినిసి The discussions of several Orientalists, and their new theories based on untrustworthy records, have only tended to make the confusion worse confounded, and have resulted in this historical problem remaining as remote from a solution as ever 46. అనేక ప్రాచ్యపండితుల చర్చలు వారి వినూత్నసిద్ధాంతములు విశ్వసింపదగని ప్రమాణములపై నాధారపడుచు బూర్వపు కలవరమును మరింత సందేహములతో నింపి యీచారిత్రక సమస్యను యథాపూర్వముగ అనిర్ణీతపరిస్థితినే యుంచినవి యని వాకొని యున్నాడు. The writings of many of these Orientalists are often characterised by an imperfect knowledge of Indian literature, philosophy and religion and Hindu traditions 47. అనేక ప్రాచ్యపంతడితుల రచనలు సామాన్యముగ భారతీయవిజ్ఞానము, తత్త్వశాస్త్రము, మతము సంప్రదాయములగూర్చి సమ్యగ్జ్ఞానముయొక్క లేమిని సూచించుచున్నవి. కావుననే వేదభాగములోని వాక్యములు కాలాంతర ప్రక్షిప్తములనియు, దార్శనికవిషయ విచారణగ్రంథములన్నియు Every book treating of a philosophical subject must be considered as having been written after the time of Buddha or after the commencement of the

46. Pandit. N. Bhashyacharya: The Age of Sri Sankaracharya
47. Pandit. N. Bhashyacharya: The Age of Patanjali 33

Christian era 47. బుద్ధుని తర్వాతనో, లేక క్రీస్తుయుగమునకు బిమ్మటనో రచింపబడియుండునని వారిచే తీర్మానింపబడుచున్న వని భాష్యాచార్యులు చింతించిరి

---

## భారతదేశము - పాశ్చాత్యము - గ్రీసు

మరియు If there is one place on the face of the earth where all the dreams of living men have found a home from the very earliest days when man began the dream fo existence, it is India 48. మానవుడు జీవితస్వప్నమునుబ్రారంభించినఅనాదికాలమునసుండిమానవతృష్ణలనన్నిటిని యుపశమింపజేసిన ప్రదేశ మెద్దియేని భూమండలమున యున్న చో అదియే భారతభూమి అని Romain Rolland రోమెన్ రోలా అను పండితుడును, The East is grand and makes Europe appear the land of trifles 49. ప్రాగ్దేశము అద్భుతమై యూరోపుఖండమును అల్పప్రదేశముగా గనుపింపజేసెనను Emerson ఎమర్సన్ మొదలగు అనేక సద్విమర్శాపరులగు పాశ్చాత్యులేగాక, The importance of Indian literature as a whole consists in its originality 50. మొత్తమున భారతీయ విజ్ఞానవాఙ్మయ మంతటియొక్క ప్రాధాన్యత తన సహజత్వమున గలదని Macdonell మాక్డొనెల్ మొదలైన విద్వాంసులుగూడ భారతీయ విజ్ఞానప్రభవమును వేనోళ్ళ బ్రిక

---

47. Pandit. N. Bhashyacharya: The Age of Patanjali 33
48. Pandit Jawaharlal Nehru: Romain Rolland Discovery of India 64
49. Emerson: Vedanta Kesari 1928 June
50. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature 63

టించుచుండ, We see today that the logic of Aristotle, as compared with the logic of the Hindus, is very defective 51. భారతీయ తర్కశాస్త్రముతో బోల్చిచూచి నచో ఆరిస్టాటిలుయొక్క తర్కము దోషభూయిష్టముగ మనము గాంచెదమని, రామతీర్థస్వామి వచించినట్లు భారతీయ తర్కముతో గ్రీకుల తర్కము పోల్చరానిదైనను గొందరు గౌతమన్యాయశాస్త్రమునకు ఆరిస్టాటిలు తర్కము ఆధారమని వచించిరి. అందుచేతనే Of logical doctrine in its early stages there is no reason whatever to suspect a Greek origin. The syllogism of Gautama and Kanada alike is obbiously of natural growth 52. న్యాయసిద్ధాంతముయొక్క ప్రాథమికస్థితులగూర్చి, గ్రీసుదేశ సముద్భవమని అనుమానించుట కెట్టి కారణమును గన్పింపదు. గౌతమ కణాదుల 'అవయవి' తప్పక స్వాభావికమే యగునని Keith కీత్ వాదించెను. కాని ఆకాలమున కది అసంపూర్ణమగుటచే క్రీ. త 400 సంవత్సరములకు జెందిన దిజ్నాగ అను ఆంధ్ర బౌద్ధభిక్షువువల్ల అది సంపూర్ణత్వము గాంచెననియు, it is not unreasonable to hazard the suggestion that in this case again Greek influence may have been at work. But the possibility of a natural development is not excluded 52. ఈసందర్భమునగూడ గ్రీకు భావసంపర్కమున్నదని అనుచితముగ వచించుటయు అహేతుకముకాదు. కాని సహజాభివృద్ధికి అవకాశము లేకపోలేదని Keith కీత్ అదేసందర్భమున వాకొని యున్నాడు.

---

51. Swami Rama Tirtha: The Complete works Vol ii 104
52. Dr. A. B. Keith : Indian Logic and Atomism

గౌతముడు - అరిస్టాటిల్

అంతియగాక The roots of Greece and Rome are absolutely Oriental 53. గ్రీసు, రోముల వైజ్ఞానికాధారము లన్నియు సంపూర్తిగా ప్రాగ్దేశీయములే యని Victor Cousin విక్టరు కసిన్ వచించియున్నటుల చరిత్రకందని కాలమునుండి భారతవిజ్ఞానప్రవాహమే పశ్చిమదేశముల బ్రవహించి ఆదేశస్థులకు విజ్ఞానభిక్ష నిడినట్లు అనేక ప్రమాణములు గోచరించుచున్నవి. ఈవిషయమునే In the days of yore it (ocean of Vedanta) travelled westward and gave its impetus to the minds of the Greek, either in Athens or in Alexandria or in Antioch 54. ప్రాచీనకాలమున వేదాంతసాగరము పశ్చిమదిశకు పయనమై ఏథన్సు, లేక అలెగ్జాండ్రియా అంటియాక్ లలోగల గ్రీకుల చిత్తముల కుత్తేజమును బ్రసాదించెనని వివేకానందులు నుడివియున్నారు. చారిత్రాత్మక వైజ్ఞానిక విమర్శదృష్టితో బరిశీలించినచో The Philosophy of Kant also shows traces of the teachings of the Upanishads 55. కాంట్ సిద్ధాంతమునగూడ ఉపనిషద్బోధల చిహ్నములు గోచరించుచుండుటచేత He (Kant) is indebted to India 56. అతడు భారతదేశమునకు ఋణపడియున్నాడు. ఈతని పూర్వముగల ప్రఖ్యాత ఏసుక్రీస్తుగూడ, శర్వానంద స్వామివారి వచనములలో It is believed that Jesus belonged to a branch of the Brotherhood of

---

53. Victor cousin: Vedanta Kesari 1928 June
54. Swami Vivekananda: The Complete Works Vol iii 322
55 Swami Vivekananda: The Complete Works Vol iii 435
56 Swami Rama Tirtha: The complete works Vol vii 115

the Buddhists religion in Tibet by name HIMIS Monastary 57. టిబెట్టుదేశమునగల హిమిస్ మఠమునకు చెందిన బౌద్ధమతశాఖను జెందినవాడు. ఈవిషయమును రష్యామరచయిత Nicholas Notovitch నికలస్ నొటోవిచ్ అనువాడు టిబెట్టుదేశమును బర్యటించి, కొన్ని ప్రమాణముల గైకొని తన సిద్ధాంతమును వివరించుచు 'The unknown life of Jesus' 'ఏసుయొక్క అజ్ఞాత జీవితము' అను గ్రంథమును విరచించెను. ఆగ్రంథమును ప్రస్తావించుచు It gives you an account of the past of Jesus' life of which the Bible says nothing, from eighth to the thirtieth year of his life which was spent in India 58. బైబిలుగ్రంథము తెలుపనిదియు భారతదేశములో గడుపబడినట్టియు ఎనిమిదినుండి ముప్పది వర్షములవరకుగల ఏసు జీవితవిశేషముల నీగ్రంథము తెలుపునని రామతీర్థుడును బలికియున్నాడు. ఇట్లే క్రీస్తునుదర్యాత మాత్రమేగాక బూర్వముగూడ భారతీయవిజ్ఞాననిధులు పాశ్చాత్యములకేగి జ్ఞానవ్యాప్తి ఆదేశముల గావించియున్నట్లు ఆధారములు గలవు. Early Indian thought penetrated to Greece, through Iran and influenced some thinkers and philosophers there 59. పూర్వము హైందవవిజ్ఞానము గ్రీసుదేశమునకు ఇరానుదేశముద్వారా ప్రవేశించి, అచ్చటి ధీశాలురయొక్క మానసముల ప్రవేశించెనని జవహారిలాల్ నెహూ్రపండితుడు నుడువుచు, Much later Plotinus came to the

57. Swami Sharvananda: Vedanta Kesari 1926 Oct
58. Swami Rama Tirtha: The Complete Works Vol Vi 106
59. Pandit Jawaharlal Nehru: Discovery of India 66

East to study Iranian and Indian Philosophy 59. తర్వాత చాలకాలమునకు ప్లాటినసు అను గ్రీకుతత్త్వవేత్త పాశ్చాత్యదేశమునకు ఇరాను భారతీయ తత్త్వశాస్త్ర పఠనమునకై అరుదెంచెననియు, From Plotinus many of these ideas are said to have gone to St. Augustine, and through him influenced the Christianity of the day 59. ప్లాటినసునుండి అనేకములగు నీభావములు సిద్ధుడగు అగస్టైనుకుచేరి, అతని మూలమున నాటి క్రైస్తవలోకమును ఆక్రమించెననియు నెహ్రూ వచనము. అంతకు పూర్వము క్రీ. పూ. 384 లో ఆరిస్టోటల్ జనించి క్రీ. పూ. 367లో ఏథెన్సుపట్టణమునకు అరుదెంచి, అందు ప్రఖ్యాతుడైయున్న ప్లేటోమహాశయుని శిష్యుడుగా ఆశ్రయించెను. కారణాంతరముల గురువునుండి చీలినవాడై అతడు ప్రత్యేక తాత్త్వికసంస్థ నొండు స్థాపించి అనేకులకు ఉపదేశకుడై ప్రఖ్యాతి అనంతముగ గడించెను. అందుచేతనే Alexander tha Great అలెగ్జాండరు చక్రవర్తి తత్త్వ జిజ్ఞాసువగుటచే ఆరిస్టోటలు నాశ్రయించి శిష్యుడయ్యెను. ఈకాలమునగూడ భారతీయతత్త్వజ్ఞులు అటకేగి తమసిద్ధాంతముల బ్రబోధించుట గలదు. ఉదాహరణమునకు ఒకవిచిత్రగాథ నొండు చూతము. One of the gymnosophists or Digambara seems to have been the famous Kalanus who died a voluntary death by allowing himself to be burnt before the eyes of the Macedonean army 60. తరచు ఆదేశముల బర్యటించు దిగంబరతార్కికులలో బ్రఖ్యాతు

59. Pandit Jawaharlal Nehru: Discovery of India 66

60. Prof F. Max Muller : The Six Systems of Indian Philosophy 386

డగు కళ్యాణుడోకడు. అతడు మాసిడోనియను సేనాదళ సమ్ముఖముననే చితిలో స్వచ్ఛందమరణమును గాంచెను అని Max Muller మాక్సుముల్లరు వ్రాసెను. ఈతనివిషయమే 'A classical dictionary of Biography, Mythology and Geography' చరిత్ర, యితిహాస భూగోళశాస్త్రనిఘంటువులో William Smith విలియం స్మిత్ Calanus: An Indian gymnosophist followed Alexander the Great (325 B. C.) from India and having been taken ill burnt himself alive in the presence of the Macedoneans three months before the death of Alexander (323 B. C.) to whom he had predicted his approaching end 61. కళ్యాణః క్రీ. పూ. 325 వ సంవత్సరమున అలెగ్జాండరుచక్రవర్తితో భారతదేశము నుండి వెడలియుండిన దిగంబర తార్కికవేత్త. మూడుమాసములుముందుగా అలెగ్జాండరు మరణమును (క్రీ. పూ. 323) అలెగ్జాండరుకు తెలిపి, తనకు అనారోగ్యముగానుండుటచే ప్రజానీకము ఎదుట తన శరీరమును దహింపజేసికొనెనని స్మిత్ వ్రాసియున్నాడు. మరల స్మిత్ పండితుడే అదేగ్రంథమున Aristotle was suspected to have, poisoned Alexander 61. అరిస్టోటల్ అలెగ్జాండరును విషప్రయోగము చేసెనని అనుమానింపబడినదనియు వ్రాసెను. దీనిననుసరించిచూచినచో అలెగ్జాండరుచక్రవర్తి తనవెంట భారతదేశమునుండి తీసికొనివచ్చియున్న కళ్యాణుని, విద్యావైభవమునకు ఈర్ష్యాబుద్ధిచే గురువైన అరిస్టోటలు తన శిష్యుడైన అలెగ్జాండరును అంతమొందింప యత్నించుచుండ, కళ్యాణుడు గ్రహించి, యిన్నింటికి దానే

61. William Smith: Dictionary

కారణమని ఆత్మత్యాగము చేసియుంచుననియు, తర్వాత ఆరిస్టోటలు శిష్యుని జంపెననియు తెలియగలదు. దీనివలన ఆరిస్టోటలు వ్యక్తిత్వమేగాక, అతని సిద్ధాంతము లోపభూయిష్ఠమని కూడ విదితమగును. కావున It was readily admitted therefore by European scholars that the Hindu system of philosophy and particularly Indian Logic was more ancient than that of Aristotle and that the Greeks have borrowed their first elements of this philosophy from the Hindus 62. హిందూతత్వశాస్త్రము, ముఖ్యముగా భారతీయ తర్కశాస్త్రము ఆరిస్టోటల్ కంటె అతిప్రాచీనమనియు, భారతీయులనుండియే గ్రీకులు యీసిద్ధాంత ప్రథమసూత్రముల గ్రహించియుండిరనియు పాశ్చాత్యపండితులు సమ్మతింతురు అని Max Muller మాక్సుముల్లరు ఘంటాపథముగా వచించియున్నాడు.

---

## భారతదేశము - గ్రీసు

ఆరిస్టోటలునకు బూర్వచరిత్రను విచారించినను నటులే తెలియబడుచున్నది. ఆరిస్టోటలునకు గురువుగానుండిన Plato ప్లేటో రచనల గవేషించి, It cannot be denied that the similarity between Platos' language and that of the Upanishads is sometimes striking 63. ప్లేటో రచనకును ఉపనిషత్తులకును చాల సన్నిహితత్వము గల్గియుండుటేగాక

62. Prof F. Max Muller : The Six Systems of Indian Philosophy 386
63. Swami Asokananda: India and The West

గొన్ని ప్రదేశముల అత్యంతాశ్చర్యకరముగా నుండును అని Max Muller మాక్సుముల్లరు అభిప్రాయమును వెలువరించెను. అటులే E. J. Urwick ఇ.జె. యుర్విక్ పండితుడు 'The Message of Plato' 'ప్లేటో సందేశము' అను గ్రంథములో ప్లేటోయొక్క Republic రిపబ్లికు గ్రంథమున రచింపబడిన భావములన్నియు భారతీయవిజ్ఞానముయొక్క ప్రతిధ్వనులు అని వ్రాసియున్నాడు64. మీగ్రీకు దేశ తత్త్వవేత్తలు ప్లేటో సోక్రటీసు పైథాగొరసు మీా ప్లాటినసు Owe their inspiration to East, India ప్రాగ్దేశ ము భారతదేశమునుండి తమ ఉత్సాహమును గైకొనిరని రామతీర్థుడు పాశ్చాత్యదేశముల గర్జించెను. Every one is born either Platonist or an Aristotallian జనించిన పాశ్చాత్య తత్త్వవేత్తలెల్లరు ప్లేటోవర్గమునకో ఆరిస్టోటలు వర్గమునకో చెందినవారై యుందురని Colridge కోల్రిడ్జి సగర్వముగ వచించినను 65. ప్లేటోకు గురుపీఠము నలంకరించిన Socrates సోక్రటీసు పాశ్చాత్యతత్త్వజ్ఞానమునకు పితామహు డని చెప్పకతప్పదు. అతడుగూడ, నాడు గ్రీసుదేశము నావరించి The sophists were probably the most enlightened men of the day and did more than any others to awaken the intellectual life of the city 66. ఆకాలమున అత్యధిక ప్రజ్ఞాశాలురని ప్రతీతిగాంచి, యితరు లందరికంటె పట్టణముయొక్క వైజ్ఞానికజీవితమునకు మిగుల జాగృతిగలుగజేసిన Sophists సోఫీస్టులు అనబడు తార్కికులతో సన్నిహితసంబంధము గలిగి

---

64. Swami Asokananda: **India and The West** 37

65. Swami Rama Tirtha: **The Complete Works Vol vii 120**

66. John S. Mackenzee: **A Manual of Ethics** 149

యుండువాడు అంతియుగాక Brahmins used to visit Athens about the time of Socrates. On the other hand there seems to be some kind of evidence that an Indian philosopher had once visited Athens and had some parsonal inter-course with Socrates 67. సోక్రటీసుకాలమున బ్రాహ్మణులు ఏథెన్సునగరమునకు వచ్చుచుండువారు. మరియు ఒక భారతీయ తత్వజ్ఞుడు ఏథెన్సుకు వచ్చియుండి సోక్రటీసుతో సంభాషించెననియు నాధారములు గలవని Max Muller మాక్సు ముల్లరు సమ్మతించెను. గౌతమబుద్ధునకు సమకాలికుడని చెప్పబడుచున్న Pythogorus ... was very much influenced by Indian thought 68. భారతీయ విజ్ఞానముచే నెక్కువగ నాకర్షింపబడినట్లు తెలియుచున్నది. మరియు There is a belief that he himself came to India 68. ఆతడు భారతదేశమునకు వచ్చియున్నటుల నమ్మకముగలదనియు శర్వానందులు ఒకవ్యాసమున రచించిరి. ఈపైథాగొరసు బ్రాహ్మణమతమును మిగుల అవగాహన మొనరించియుండుటచే Clement of Alexandria had no hesitation in calling him a pupil of the Brahmanas 69. బ్రాహ్మణశిష్యుడని పిలుచుటకెట్టి సంశయ మవసరము లేదని అలెగ్జాండ్రియా మతాధిపతి వచించెను. పైథాగొరసు భారతదేశమున కరుదెంచి బ్రాహ్మణుల సన్నిధిని విద్యాభ్యాసముచేసెనని Apuleius అప్యూలియస్ పండితుడు వచించినట్లు వివేకానందుడు పాశ్చాత్యభూముల బ్రతిధ్వనింపజేసెను 70. It seems to me to be proved that

67. Swami Asokananda: India and The West 38
68. Swami Sharvananda: Vedanta Kesari 1926 Oct
69. Swami Vivekananda: The Complete Works Vol 1 402
70. Swami Vivekananda: The Complete Works Vol 4 210

Pythogoras was influenced by the Indian Sankhya 71.
పైథాగొరసు భారతీయ సాంఖ్యముచేత ఆకర్షింపబడుటయు వ్యక్తమే యని Prof. M. Winternitz యం. వింటర్నిట్జ్ తన వ్యాసములో వ్రాసెను.



## సోలమన్ - భరతవర్షము - విరోచనుడు

మరియు, నింక కొంచెము ముందుకేగి తిలకించు చో

At the time of Soloman there was a channel of communication open between India and Syria and Palastine, is established beyond doubt. I believe by certain sanskrit words which occur in Bible as names of articles of export from Ophir, articles such as ivory apes peacocks and sandalwood, which taken together, could not have been exported from any country but India 72.
సోలమన్ కాలమున భారతదేశమునకు సిరియా, పాలస్తీనాలకు మధ్య వ్యాపారాదులు రాకపోకలు సాగుచుండెననుటనిర్వివాదము. ఆఫీర్ అను దేశమునుండి ఎగుమతిపదార్థములుగా దంతము, కోతులు నెమళ్లు గంధము మొదలగు సంస్కృతశబ్దముల మొత్తమునకు మనము విచారించినచో భారతదేశమునుండియే అవి ఎగుమతి అయియుండునని నాకు నమ్మకమని Max muller మాక్సుముల్లరు ఉపన్యసించెను. Ophir ఆఫీర్ అను దేశమును గురించి పాతబైబిలుగ్రంథములో దరచుగా ప్రస్తావనముగల

71. Swami Asckananda : India and The West 35
72. Prof. F. Max Muller : India What it Can Teach us 9

దనియు, అప్పటికి సోలమన్ రాజుసహాయముతో ఒకయోడ సేనను బంపగా వారు బంగారము గంధపుకర్ర మణులను దెచ్చి యుండిరనియు, ఆఫీర్ హిందూమహాసముద్రముఒడ్డున గల దనియు వ్రాయుచు Among the most plausible conjuctures as to its site are that it was on the coast of India or a name for India itself 73. అది భారతదేశములో భాగముగాని లేక భారతదేశమునకు నామాంతరముగాని యుండియుండునని William Smith విలియం స్మిత్ వ్రాసెను. అట్లే Semiranus and Ninus సెమిరేనసు నైనసుల విషయము వ్రాయుచు, వారు అస్సీరియాసామ్రాజ్య సంస్థాపకులనియు, సెమిరేనసు అను రాజ్ఞి అనేకపట్టణముల నిర్మించెననియు, అనేక దేశముల నాక్రమించుటయేగాక, but was unsuccessful in an attack which she made upon India in about 2182 B.C. 73. క్రీ. పూ. 2182 సంవత్సరములలో జయముగాంచని దండయాత్ర భారతవర్షముపై గావించెననియు విలియం స్మిత్ వ్రాయుచున్నాడు. చరిత్రకందని విషయములవరకు మనము దృష్టిసారించిచూచిన, Virochana was the first great king of Asuras, possessing super-natural powers. Recent investigations in Assyrian mythology prove the existence of a tradition in Assyrian history about such a king called Berosus in certain ancient geneologies 74. విరోచనుడనువాడు అద్భుతశక్తులుగల అసురరాజు. అస్సీరియా ఇతిహాసముల నిటీవలజరిగిన పరిశీలనలలో బ్రాచీనవంశవృక్ష

73. William Smith: Dictionary

74. Swami Vivekananda: The Complete Works Vol iv 403

ములలో బెరోసస్ అనురాజు అస్సీరియాచరిత్రలోగల సంపి దాయము నిర్ధారణమైనదని వివేకానందుడు వచించెను. ఛాందోగ్యోపనిషత్తులో దేవాసురులిరువురు ప్రజాపతినుండి ఆత్మనర్థింప సంసిద్ధులై 'ఇంద్రో హైవ దేవానామభిప్రవవ్రజ విరోచనోఽసురాణాం' (ఛాం. 8.7.2) ఇంద్రుడు దేవతలనుండి, అసురులనుండి విరోచనుడును ప్రజాపతిని సమిత్పాణులై చేరి నట్లును, మొదట వారిరువురు ముప్పదిరెండువర్షములు బ్రహ్మ చర్యమున్న అనంతరము ప్రజాపతి వారెందులకై బ్రహ్మచర్య మును నెరపుచున్నదియు గ్రహించి, 'ఏషోఽక్షిణి పురుషో దృశ్యత ఏష ఆత్మేతి' అక్షిలోగల పురుషుడే ఆత్మయని బోధింప దానికి సంతృప్తమానసుడై విరోచనుడు తనదేశమున కేగి దానిని బోధింప వారు కేవలము దేహాత్మభావ భ్రాంతులై పోయిరనియు ఇంద్రుడుమాత్రము 'ఏకశతం హ వై వర్షాణి మఘవాన్ ప్రజాపతౌ బ్రహ్మచర్యమువాస' (ఛాం. 8. 11. 3) నూటఒకవర్షము ప్రజాపతిసన్నిధిని బ్రహ్మచర్యముండి దేహాత్మ విభిన్నత్వమును ఆత్మరహస్యమును గ్రహించి అజ్ఞానమును నశింపజేసికొనిపోయినట్లును ఉపనిషత్తుల దెలియుచున్నది.

కాన There must have been some kind of historical contact even at that early time between the religious thought of India and the philosophical thought of Greece 76. అతిప్రాచీనకాలమునుండి భారతీయాధ్యాత్మికవిజ్ఞాన

75. Swami Asokananda: India and The West 38

76. Pandit Jawaharlal Nehru: Discove y of India 84

మునకును, గ్రీసుదేశ తాత్త్విక భావజాలములకును జారిత్రిక సంబంధముండి తీరవలయునను Max Muller మాక్సుముల్లరు భావము యథార్థముగా యట్లు మనకు వ్యక్తమగుచున్నది. ఇంతియగాక There was a colony of Indian merchants living at Memphis in Egypt about the fifth century B. C. క్రీ. పూ. అయిదవశతాబ్దమున ఈజిప్టుదేశమునగల మెంఫిస్ నగరమున భారతీయవర్తకుల వలసప్రాంతముగూడ నుండినట్లు జవహరిలాల్ నెహ్రూ తన Discovery of India అను గ్రంథ మున వ్రాసియున్నారు. క్రీ. పూ. 401 సంవత్సరములకు చెందిన Ctesias టీషియస్ అను గ్రీసుదేశస్థుడు భారతదేశ మునుగూర్చి ఒక గ్రంథమునుగూడ విరచించెననియు ,విలియం స్మిత్ తన నిఘంటువులో తెలిపియున్నాడు.

---

## భారతి - జ్ఞానప్రదాత్రి

అట్లు ఆధ్యాత్మికవిజ్ఞానమునకేగాక, తార్కిక విద్య యందును, మరియు ప్రపంచమునంతటిని ఆకర్షింపగల ధనధాన్య సమృద్ధినిగల భాగతావని అతిప్రాచీనకాలముల స్వయంసమృద్ధమై సర్వేతర మానవులకు లౌకికాలౌకిక జ్ఞానప్రదాన మొనర్చి యున్నదనుట నిర్వివాదాంశమైయుండ పాశ్చాత్యమునుండి భారతి విజ్ఞానమును బొందినదనుట కేవలము సంకుచితము హ్రస్వమును అగు దృష్టివలన నేర్పడిన భావములని సువిదితము. దానినిగ్రహించిన William Jones విలియం జోన్స్, We cannot

help thinking that the Greeks derived their knowledge from the fountain-head of the Indian philosophy 77. నిత్యసత్యవంతియగు భారతీయతత్త్వశాస్త్రమునుండియే గ్రీకులు తమ జ్ఞానమును బడసియుండిరని మనము భావింపకతప్పదని వచించియున్నాడు. అదేవిధముగా Every thing is narrow in the west. Greece is a small and I stifle, Judia is dry and I pant. Let me look towards lofty Asia and the profound East for a little while 78. పాశ్చాత్యము సర్వము సంకుచితము. గ్రీసు దేశము సంకుచితము, నేను తడబడుదును, జ్యూడియా దేశము ఎడారి. నేను పిపాసాబాధ బొందుదును. విశాలమైన ఆసియాఖండమును, అద్భుతమైన ప్రాగ్దేశమును ఒకించుక నన్ను చూడనిండు. అని పరాసు చరిత్రకారుడు Michelet మిఖలెట్ వాపోయినాడు. దీనినిగ్రహించి భారతీయులు పెద్దపలుకుల వర్జించి ప్రాచీనాధునిక భారతీయాధ్యాత్మిక విద్యావైభవమును అవగాహన మొనరించి తద్విజ్ఞాన తేజోపుంజముయొక్క సహాయమున వేయిమడుంగుల అభివృద్ధి గాంచి, సర్వవిశ్వమునకు గురుపీఠమునందు భారతి నధిష్టింప చేయుదురుగాక! The greatest contribution of the Nyaya to Hindu thought is in its organon of critical and scientific investigation 79. భారతీయవిజ్ఞానమునకు న్యాయ శాస్త్రము, సక్రమమును, సునిశితమును అగు అద్భుత గవేషణావిధానమును ప్రసాదించెనను రాధాకృష్ణవచనము నాలించి విశ్వసించి. శ్రమించి, గౌతమాది మహర్షి గణముల ధీప్రజ్ఞా

77. Swami Rama Tirtha: The Complete Works Vol Vii 105
78. Pandit Jawaharlal Nehru: Discovery of India 78
79. Prof. S. Radhakrishnan: Indian philosophy 173

విశేషములమూలమున The thinkers of the East seem to me again superior to most of the philosophers of the West 80. అనేక పాశ్చాత్య తత్త్వవేత్తలకంటె ప్రాగ్దేశతత్త్వచింతకులు అధికతములు అని నాకు తోచుచున్నదను Max Muller మాక్సుముల్లరు వాక్యరూపమున అఖండప్రఖ్యాతి అనాదికాలము నుండి గడించి భాస్వరరూపిణియై యలరారియున్న భారతమాతృ ఔన్నత్యమునకు తగిన వారసులమని గర్వింపదగురీతి ప్రజ్ఞావైభవమును ఆర్జించి భారతీయులు విజృంభించెదరుగాక!



## భాష్యకర్త - వాత్స్యాయనుడు

ఇంతవరకు న్యాయసూత్రముల వాని కర్తనుగూర్చి సమగ్రలీల విచారించియున్నాము. ఆసూత్ర ప్రాధాన్యతను గ్రహించి తదనుగుణమును సముచితమును అయిన 'తస్య వాత్స్యాయన ఇదం భాష్యజాత మవర్తయత్' (న్యా. భా. 5.2.25) అని అతడే లిఖించుకొనినరీతి భాష్యమును విరచించిన వాత్స్యాయనునిగూర్చియు నిసుమంత గ్రహించుట ఆవశ్యకము.

Vatsayana was the first commentator on the Nyaya Sutra and he lived sometime before the 6th century A. D. 81. న్యాయసూత్రములకు వాత్స్యాయనుడు ప్రథమభాష్యకారుడు. అతడు క్రీ. త. ఆరవ శతాబ్దమునకు

80. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy
81. V. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy 195

బూర్వముండెనని శ్రీనివాస అయ్యంగారు భావించెను. Jacobi places Vatsayana about the beginning of the 6th century or earlier '82. క్రీ. త. ఆరవ శతాబ్దమున బ్రారంభమునగాని యింక యిసుమంత పూర్వముగాని వాత్స్యాయనుని జకోబి పండితుడు నిర్ణయించెను. అదేసిద్ధాంతమును Suali సౌలికూడ ప్రతిపాదించెను. మహాయానయుగముతర్వాత నాగార్జున ఆర్యదేవులకు దర్వాత వాత్స్యాయన కాలముగా హరిప్రసాదశాస్త్రి భావించెను. క్రీ. త. ఆరవ శతాబ్ద ప్రారంభములో గలడను బౌద్ధాచార్యుడు దిఙ్నాగునకు ముందువాడగుటచే వాత్స్యాయనుడు క్రీ. త. 500 సంవత్సర ముల చివరకాలమువాడని Bodas బోడసు తలంచెను. Dr. Stcherbatskoes డాక్టరు స్టర్‌బాట్స్కీ కూడ క్రీ. త. 500 సంవత్సరములకు దర్వాతగా వాత్స్యాయనుని కాలమును నిర్ణయించెను. వాత్స్యాయనుడు దక్షిణభారతమువాడనియు, క్రీ. త. 400, 500 సంవత్సరములకు మధ్యవాడనియు, న్యాయ సూత్రములలో మాధ్యమికభావముల స్ఫురింపజేయు సూత్ర ములు ప్రక్షిప్తములనియు విద్యాభూషణుడు వచించెను 82. వాత్స్యాయనుడు క్రీ. త. 400 సంవత్సరములకు బూర్వము వాడని రాధాకృష్ణుడు వ్రాయుచు, వాత్స్యాయనుని వచనము లలో గౌతముడు అతిప్రాచీనమహర్షి యనియు తెలియబరచెను83. The Nyaya Sutra found an expositor in Pakshila Swami Vatsayana who wrote the Nyaya Bhashya before the

---

82. Pandit Gopinath Kaviraj : Introduction to Gautama Nyaya Sutras

83. Prof. S.Radhakrishnan: Indian Philosophy Vol 1 38

Buddhist logician Dignaga 84. బౌద్ధతార్కికునకు పూర్వమే న్యాయభాష్యమును నిర్మించిన పక్షిలస్వామి వాత్స్యాయనుని ద్వారమున న్యాయసూత్రమునకు ఒకవ్యాఖ్యాత లభించెను. His work resembles in style the Mahabhashya 84. అతనిభాష మహాభాష్యమును బోలియున్నది.but this is far from sufficient to justify us in assigning him to the 2 nd century B. C. 84. కాని దీనిమూలమున నీతని క్రీ. పూ. రెండవ శతాబ్దమునకు జెందినవాడని నిర్ణయింప సమర్థింప వీలు కాదనియు, అందుచే The 4 th century is more plausible, though a rather earlier is not excluded. 84. ఇంతకు పూర్వకాలము సాధ్యమైయున్నను క్రీ. త. 400 సంవత్సరము లని వాత్స్యాయనుని నిర్ణయించుట ఉచితమని Keith కీత్ పండితుడు అభిప్రాయమును ప్రకటించెను. కాని అదేభావమును స్వీకరించి Dr. Windisch has sought to prove that Nyaya Bhashya must be ascribed to the same period in which the Mahabhashya was written, ie. about 200 B. C. 85. క్రీ. పూ. 200 సంవత్సరప్రాంతమున రచింపబడిన మహాభాష్య రచనకాలమునకే న్యాయభాష్యముకూడజెందునని డాక్టరు విండిష్ నిరూపింపయత్నించియుండెను. Considering this fact a space of 300 or 400 years would not be an unreasonable interval to suppose between the Sutras and the Bhashya. In other words Vatsayana may be assigneed to the 2nd or 3 rd century B. C. 85. సూత్రములకును భాష్యమునకు మూడునాలుగువందల వత్సరముల అంతరముండుట అయుక్తి

84. Dr. A. B. Keith : A History of Sanskrit Literature 483
85. Pandit Gopinath Kaviraj: Introduction to Gautama Nyaya Sutras

కముకాదు. అనగా క్రీ. పూ. రెండు లేక మూడవశతాబ్దము నకు వాత్స్యాయనకాలము నిర్ణయింపనగునని పండిత గోపీనాథుని తాత్పర్యము. సుమారు క్రీ.పూ. 400 సంవత్సరములకు జెందిన అర్థశాస్త్రవేత్తయగు కౌటిల్యుడే యితడని కొందరందురుగాని దానికి గోపీనాథుడు సమ్మతింపలేదు. అయినను బూర్వోక్త చందము భాష్యమునగల మహాయానమునకు భావముల నాధార ముగగొని భాష్యకాలనిర్ణయముగావింప యత్నించుట దోష భూయిష్టము. మరియు సూత్రకాలమునకు భాష్యకాలమునకు అంతరకాలమును నిర్ణయింపయత్నించి, సూత్రకాలమునను సరించి భాష్యకాలమును నిర్ధారింపజూచుటయు లోపయుతము. కాల ప్రవాహమున అందును యిందును అనేకవిధములైన ప్రక్షిప్త ములు చేరియుండుటచే నిర్దుష్ట మూలసూత్రముల భాష్యరూప మును నిర్ణయింప గష్టసాధ్యము. కాన పతంజలికృత మహాభాష్య రచనమునకును వాత్స్యాయనభాష్యమునకును భాషావిధానమున బోలికయుండుటచే రెండును ఒకేకాలజనితములని తీర్మానించు కొనుట ఉచితము. అట్లగుచో Patanjali was the author of the Mahabhashya and also of the Yoga Sutras and that he lived without any doubt between the 9 th and 10 th centuries B. C. that is about the 10 th century B. C. 86. పతంజలి మహాభాష్యమునకును యోగసూత్ర ములకును కర్త. నిస్సందేహముగ నీతడు క్రీ. పూ. 9, 10 వ శతాబ్దములకుమధ్య అనగా బదవశతాబ్దమున యుండెనని 'The Age of Patanjali' 'పతంజలికాలము' అనుగ్రంథమున

86. Pandit N. Bhasahyaoharya: The Age of Patanjali

భాష్యాచార్యులు నిర్ధారణము చేసియుండుటచే వాత్స్యాయన కాలముగూడ క్రీ. పూ. పదవశతాబ్దముగా నిర్ణయింప నవకాశ మున్నది. అందుచేత Vatsayana is an ancient Rishi. By tradition he is regarded as Bhagavan, Muni, Mahamuni, and Maharshi. 87. వాత్స్యాయనుడు, ప్రాచీనఋషీశ్వరుడు, భగవాన్, ముని, మహాముని, మహర్షి శబ్దములచే సంప్రదాయము అతనిని సంబోధించుచున్నదని నందలాల్ సింహా విశద పరచెను.

వాత్స్యాయనభాష్యము బహుళ సందేహముల కాకరముగ నున్నది. అయిదు అధ్యాయములుగ పది ఆహ్నికములుగనున్న న్యాయసూత్రగ్రంథమునే పూర్తిగ అక్షపాదుడే వ్రాసెనో లేక కేవలము వాగ్రూపముననే పరంపరగ నది యరుదెంచెనో అనిర్ధారితము. It seems to me that it is only the first book of the Nyaya Sutra containing a brief explanation of the16 categories that we are justified in ascribing to Akshapada 88. షోడశతత్వముల క్లుప్తవివరణముతో గూడిన న్యాయసూత్ర ప్రథమాధ్యాయమే అక్షపాదునకు అన్వయించుట సమంజసమని తనకు తోచుచున్నదని విద్యాభూషణుడు పలుకుచు, తర్వాత నాలుగు అధ్యాయములలో బౌద్ధ మీమాంసాది సిద్ధాంత విమర్శనము గలదు గాన తర్వాతివారి కన్వయించుటుచితమని అతడు వాదించెను. వాత్స్యాయనుడు న్యాయసూత్రములకు ప్రథమభాష్యమును విరచించి, and harmonized the defferent and at times conflicting additions and interpolations by the ingenious introduction of Sutras

87. Nandalal Sinha: Nyaya Sutras of Gotama
88. M. M. Satish Chandra Vidya Bhushana: Nyaya Sutras ctema

of his own making fathered upon Akshapada. 88. పరస్పరవిరుద్ధములైన ప్రక్షిప్తవాక్యముల నన్వయింపజేయ వీచి త్రిముగ తానే కొన్ని సూత్రముల గల్పించి వానిని అక్షపాద రచనలుగా నన్వయించెనని విద్యాభూషణుని అభిప్రాయము. కాని ఆ అభిప్రాయమునకు వ్యతిరేకించి 'It is reasonable to conclude that all the originial of Gautama have been preserved in the Nyaya Bhashya of Vatsayana. 89. వాత్స్యాయనరచిత న్యాయభాష్యమున ఆదిమసూత్రములన్నియు గలవనుటయు క్షమని నందలాల్ సింహా పర్యాలోచించెను. ఇట్టి భేదభావముల కవకాశమిచ్చినది వాత్స్యాయన రచనావిధానమే యగును. 'సూత్రార్థో వర్ణ్యతే యేన పదైః సూత్రానుసారిభిః। స్వపదాని చ వర్ణ్యతే భాష్యం భాష్యవిదో విదుః॥' స్వీయకృత పదములద్వారా సూత్రానుసారముగా సూత్రార్థమును స్వీయ పదములను వర్ణించుటే భాష్యమని భాష్యవిదులు పలుకుదురు. ఈసూత్రమునను సరించి వాత్స్యాయనుడు తన భాష్యరచనమున బూర్వపక్ష సిద్ధాంతప్రతిపాదనమునకై స్వయముగ గొన్ని సూత్రముల నిర్మించియుండుటచే సూత్రకర్త సూత్రముల భాష్య కర్త సూత్రములనుండి విడదీయుట గష్టసాధ్యమగుటచే నీకలవర మేర్పడినట్లు తజ్ఞుల అభిప్రాయము.

---

88. M. M. Satish Chandra Vidya Bhushana: Nyaya Sutras of Gotama

89. Nandalal Sinha : Nyaya Sutras of Gotama

## న్యాయదర్శనము - వ్యాఖ్యాతలు

వాత్స్యాయనునిబిమ్మట వసుబంధునిశిష్యుడైన క్రీ. త. 400 సంవత్సరములకు చెందిన వాడై చైనాదేశమునుండి యరుదెంచిన హియాన్‌సాన్‌యొక్క గురువై ప్రఖ్యాతనలందా విశ్వవిద్యాలయ పరిషత్సభాపతియై యొప్పారిన ఆంధ్ర బౌద్ధభిక్షు దిఙ్నాగుడు వాత్స్యాయనభాష్యమును విమర్శించుచు, ఖండించుచు, వివరించుచు (1) ప్రమాణసముచ్చయ (2) న్యాయప్రవేశ (3) హేతుచక్రహమరు (4) ఆలంబనపరీక్ష (5) ప్రమాణశాస్త్రపరీక్ష యను జటిల గ్రంథరచనముల గావించి న్యాయశాస్త్రమును విజృంభింపజేసి తరువాతి పండితలోకమునకు ఆదర్శ స్థానము నలంకరించెను. ఆతనిరచనల ఖండించుచు వాత్స్యాయనభాష్యమును సమర్థించుచు క్రీ. త. 620 సంవత్సరమునకు చెందిన ఉద్యోతకారుడు ప్రశస్తమైన న్యాయవార్తికను వాత్స్యాయనభాష్యమునకు వ్యాఖ్యగ రచించెను. అదే కాలమునకుజెందిన బౌద్ధభిక్షు ధర్మకీర్తి తన న్యాయబిందు గ్రంథమున దిఙ్నాగుని సమర్థించెను. అంతట సర్వతంత్రస్వతంత్ర, షడ్దర్శనవల్లభ మొదలగు బిరుదములుగల్గు వాచస్పతిమిశ్రుడు, (1) న్యాయవార్తికాతాత్పర్యటీక (2) న్యాయసూచీనిబంధ (3) న్యాయసూత్రోద్ధార అను గ్రంథరాజములద్వారమున ఉద్యోతకారుని సమర్థించెను. తర్వాత క్రీ. త. 984 సంవత్సరమువాడగు ఉదయనాచార్యులున్యాయవార్తికాతాత్పర్య

టీకాపరిశుద్ధి అను గ్రంథమున న్యాయశాస్త్రమును అభివృద్ధి గావింపజేసిరి. ఈశాస్త్రమును వివరించుచు తాముపయోగించు కొనుటయందు వివిధ సిద్ధాంతవాదులేగాక, నాగార్జున, దిఙ్నాగ, ధర్మకీర్తి, ధర్మోత్తర, మొదలైన బౌద్ధాచార్యులును, భద్రబాహు, సిద్ధసేన, దివాకర, మాణిక్యనంది, ప్రభాచంద్రాది జైనమతాచార్యులును పాల్గొని న్యాయశాస్త్రమును బోషించి అభివృద్ధిపరచి ఒక మహాసాగరముగా నొనరించుటఁజూడ దీన న్యాయశాస్త్రముయొక్క ఉత్కృష్టత వ్యక్తమగుచున్నది.



# న్యాయశాస్త్ర ప్రశస్తి

## న్యాయశాస్త్రము

'ప్రమాణైరర్థపరీక్షణం న్యాయః' (న్యా భా. 1. 1. 1) ప్రమాణములద్వార అర్థమును బరీక్షించుటయే న్యాయమను నిర్వచనమునుసరించి, **We have in India one of the best logical developments of thoughts 90.** భారతదేశమున సర్వోత్తమ తర్క-శాస్త్రాభివృద్ధిగలదని **Max Muller** మాక్సుముల్లరు వచించినట్లు సుప్రశస్తినార్జించి. 'న్యాయవిద్ ధర్మతత్త్వజ్ఞః' (మహాభారత-శాంతి. 5అ) అని కీర్తిగాంచిన దేవర్షియు భక్తాగ్రేసరుండును అగు నారదమహర్షి చేతనే యవలంబింపబడిన న్యాయవిద్యను ఎట్లు నుతింపగలము! **The Nyaya on its logical side is popular 91.** న్యాయము తన తర్క-విధానమున బ్రసిద్ధమై అనేక అనుచరుల నాకర్షించి, **Logic which is the basis of all studies 92.** న్యాయము సర్వ విద్యలకాధారమైనదను రాధాకృష్ణుని వచనమురీతిగ భారతీయవిజ్ఞానమునకు సక్రమ శాస్త్రీయ పరిశీలనావిధానమును బోధించి 93. **serves as an introduction to all systematic philosophy 94.** సర్వశాస్త్రీయ తత్త్వశాస్త్రములకు అది ప్రాతిపదికమైయొప్పారుచున్నదని గాటిల్యాడు వచించెను. న్యాయము

---

90. **Prof. F. Max Muller :**
91. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 28
92. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 :0
93. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 166
94. Prof S. Radhakrishnan : Indian Philosophy Vol 2 32

Describes at great length the mechanism of knowledge 95. విజ్ఞానయంత్రమును బ్రిస్పుటక్రియ వివరించునని రాధాకృష్ణుడు వచించినట్లు, That which gives distinction to the Nyaya is its critical treatment of metaphysical problems 95. తత్త్వార్థసమస్యల సవిమర్శ్యపద్ధతి జర్పించుటయే న్యాయమునకు ప్రాధాన్యత నొసంగెనని వాత్స్యాయన, ఉద్యోతకారులు ప్రశంసించినట్లు, the purpose of Nyaya, as a critical examination of the objects of knowledge by means of the canons of logical proof 95. తర్కనిరూపణముల ద్వారా జ్ఞానవిషయముల దీవ్రపరిశీలనయే న్యాయశాస్త్రోద్దేశ్యమని వాచస్పతిమిశ్రుడు నుతించినట్లు న్యాయము అతి ప్రాధాన్యతను వివిధ సిద్ధాంతలోకమునుండి గడించియున్నది. అందుచేత Anvikshiki is a distinct branch of study over and above the other three of the Vedas, Vartha or commerce and దండనీతి of polity 96. వేద, వార్త, దండనీతి యనబడు విద్యాత్రయికంటె అన్వీక్షికీ ప్రత్యేకమును ప్రధానమును అని కౌటిల్యుడుకూడ న్యాయమును బ్రశంసించి యుండెను.



## న్యాయ - వైశేషికములు

ఆ న్యాయవిద్య is only a development and compliment of that of Kanada 97. కణాదశాస్త్రమునకు అభివృద్ధి

95. Prof S Radhakrishnan : Indian Philosophy Vol 2 30
96. Prof S. Radhakrishnan : Indian Philosophy Vol 2 18
97. Dr. A. A. Macdonell : A History of Sanskrit Literature 386

రూపమై పూరణమై యొప్పారునని Macdonell మాక్డొనెల్ అను చందము, Nyaya and Vaiseshika take up respectively the world within and the world without 98. న్యాయ వైశేషికములు అంతర బాహ్యముల గైకొనినవి. ఎట్లనిన While the Nyaya gives us an account of the processes and methods of a reasoned knowledge of objects, the Vaiseshika develops the atomic constitution of things which the Nyaya accepts without much arguments 98. విషయార్థములయొక్క సయుక్తికజ్ఞానమునకు విధానము న్యాయ మొసంగుచుండ, వైశేషికము పదార్థముల బరమాణుప్రయుక్త నిర్మాణమును అభివృద్ధి చేసెను. దానిని న్యాయ ఎక్కువ వాదములేకయే స్వీకరించెను అని రాధాకృష్ణ వివరణము. అనగా వైశేషికము బాహ్యగోచరప్రపంచ నిర్మాణవిషయ పరిశీలనముగావింప, న్యాయము తన్నిరూపణార్థము, ఉచిత యుక్తిని మానసిక పటుత్వమును ప్రసాదించును. అందుచేతనే ఆ రెండును సమానతంత్రములని పేర్వడసి యున్నవి. రెండును గూడ నానాత్మలను, సగుణద్వైతమును, పరమాణునిర్మిత విశ్వమును విశ్వసించి, ఒకేవిధమైన వాదవిధానము నవలంబించి యున్నవి. అవును, గౌతమ, కణాద ఋషిద్వయము ప్రభాస క్షేత్రమున శివావతారముగ ప్రఖ్యాతిగన్న పరమగురు సోమశర్మ చరణసేవాలబ్ధ జ్ఞానప్రతిపాదనమున ఒకరికొకరు తోడు నీడయై పరస్పరాపేక్షికత్వమున సమానతంత్రములగు న్యాయ వైశేషికముల నిర్మించి తాము కీర్తిగడించి, తమ గురుదేవుని

98. **Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 30**

యశస్సును దిగంతముల నిండజేసియుండుట అత్యంత సము చితమేగదా!

---

## న్యాయ ప్రశస్తి

పై కాగణమున Nyaya is so predominently dialectical 99. న్యాయము సంపూర్ణముగా తార్కికము అయి యొప్పారినది. కాన దాని సహాయములేక నిత్యజీవితవిధానమే దుస్తరమగుటచే బరిపాలకుడు న్యాయాధిగముడై యుండవలయునని (అ. 11) గౌతమధర్మసూత్రము ఆదేశించుచున్నది. న్యాయాధిపతి 'తర్కోభ్యుపాయః' తర్కము ననుసరించియే న్యాయనిర్ణయము గావింపవలెనని శాసించుచున్నది. రాజు 'ఆన్వీక్షికీం' (మనుస్మృతి 7. 43) అను న్యాయ విద్య యందు బ్రవీణుడై యుండి, ఆస్థానమున 'హైతుకస్తర్కనౌపకార్త్రి' (మను. 12.111) అనువిధంబున తార్కికపరిషత్తు ఉండవలెనని మనువుగూడ బోధించుచున్నాడు. అందుచే 'పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితాః। వేదాః స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ॥'(యాజ్ఞవల్క్యసంహిత. 1.3) మొదలగు పదునాలుగువిద్యలతో న్యాయవిద్యకు బ్రముఖ స్థానము యాజ్ఞవల్క్యునిచే నొసంగబడియున్నది. ఇదే విధముగ బ్రహ్మపురాణముగూడ 'అంగాని చతురో వేదాన్ పురాణ న్యాయవిస్తరాన్। మీమాంసాధర్మశాస్త్రం చ పరిగృహ్యాథ సాంప్రతం॥' చతుర్దశవిద్యలను శ్రీమహావిష్ణువు మత్స్యరూపమున

---

99. Dr. A. B. Keith : Indian Logic and Atomism 265

నుద్ధరించినట్లు తెలుపుచున్నది. 'అనంతరం చ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిఃసృతాః। మీమాంసా న్యాయవిద్యా చ ప్రమాణాష్టక సంయుతా॥' (మత్స్య. 3.2) అను శ్లోకార్థమున మత్స్యపురాణము న్యాయము వేదములతో చతుర్ముఖుని ముఖము నుండియే వెలువడెనని ఘోషించుచున్నది. ప్రాచీనకాలమున కశ్యపాదిమహర్షుల ఆశ్రమములుగూడ 'న్యాయతత్త్వాత్మవిజ్ఞాన సంపన్నైః వేదపారగైః' (మహాభారత. ఆది-70) న్యాయ, ఆత్మ విజ్ఞానవేత్తలచే సలంకృతమై యుండెననియు 'న్యాయతంత్రా ణ్యనేకాని తైస్తైరుక్తావాదిభిః। హేత్వాగమసమాచారై ర్యదుక్తం తదుపాస్యతాం॥ (మహాభారత. శాంతి. 70. అ) హేతువిద్యచేత ఆగమశాస్త్రముచేత ప్రామాణికమైనది న్యాయ మనియు అది ఉపాసింపదగినదనియు మహాభారతము తెలుపుచున్నది. మరియు నాటి సభారంగముల వర్ణించుచు, 'తస్మిన్ యజ్ఞే ప్రవృత్తే తు వాగ్మినో హేతువాదినః। హేతువాదాన్ బహూనాహుః పరస్పరజిగీషవః॥' (అశ్వమేధ. 85) పరస్పర పరాజయాపేక్షులై వాదప్రతివాదములసల్పు హేతువాదుల శబ్దములచే నిండియుండెనని భారతము వచించెను.

పై నుదాహరింపబడిన విధముగ న్యాయవిద్య అనన్యసామాన్య ప్రతిభాశీలమై, పండితజన మనోరంజకమై, మహర్షిగణ సంసేవితమై యొప్పారి, సర్వసిద్ధాంతముల కధిష్ఠానమై సర్వాదరణీయమై విరాజిల్లెననుట స్పష్టము. కావున Logic and Science, Philosophy and Religion are related organically 100. న్యాయ, భౌతిక విజ్ఞానములు, తత్త్వశాస్త్రము ఆధ్యాత్మిక

---

100. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 769

జీవనము అభేద్యముగ మిళితమైయున్నవని పండితాభిప్రాయము. ఆవిధముగ Nyaya points out that no stable philosophy can be built except on the foundation of logic 100. సుస్థిర తత్వార్థశాస్త్రము న్యాయాధిష్ఠానముమీదనే నిర్మింపబడగలదనురీతి సర్వసిద్ధాంత ప్రతిపాదనమునకు న్యాయ మాధారభూతమై సకలసిద్ధాంతముల నాకర్షించి ఆదరింపబడుటయం దాశ్చర్యము ఆవంతయు లేదు.

---

## న్యాయము - ఈశ్వరుడు

కాని దర్శనకారుని కాలమున గాకపోయినను, గాలాంతరమున న్యాయదర్శనమునకు గొందరు ప్రతిపక్షులు లేకపోలేదు. The idea of super-natural being may rouse to a certain extent the power of action in man, but it also brings spiritual decay 101. పరమాత్మయొక్క అస్తిత్వభావము మానవునిలో గొంతవరకు క్రియాకారకశక్తిని ఉద్భవింపజేసినను, ఆధ్యాత్మికక్షీణతనుగూడ బ్రోపిలజేయునను వివేకానందుని వచనమురీతి, కేవల మీశ్వరప్రతిపాదనము మానవోద్ధరణకార్యమున అసంపూర్తియగునని గ్రహించియుండనోపు, Nyaya and Vaiseshika lay stress on the practical side 102. న్యాయవైశేషికములు ప్రత్యక్షజీవితవిషయముల

100. Prof. S Radhakrishnan: Indian philosophy Vol 2 769
101. Swami Vivekananda : The Complete Works Vol 1 122
102. Sevaka Pratishta Tyagi Mahatma : The True Vedanta

స్వీకరించు నుద్దేశ్యమున నుండుటచే న్యాయసూత్రకర్తయగు అక్షపాదుడు ఈశ్వర ప్రతిపాదనము గావించియుండ లేదు. The empirical tendency and the dialectical interests of the Nyaya are responsible for its practical indifference to the question of the reality of God 103. న్యాయశాస్త్ర మునకు వ్యావహారికప్రవృత్తి తార్కికవిషయ శ్రద్ధయును ఈశ్వ రాస్తికవిషయములపై బ్రత్యేకనిర్లక్ష్యమునకు గారణభూత మైనవని రాధాకృష్ణుడును వచించెను. ఈవిషయమునే తన తర్కసంగ్రహమున Athalye అథేలి చర్చించుచు, Kanada and Gautama might have at first purposely excluded God from their systems not as being totally non- existent but as being beyond and above the phenomenal world with which their systems were chiefly concerned 103. తమ దర్శనములు భౌతిక మీమాంసామగ్నములుగాన, ఈశ్వరుడు సంపూర్తిగా నాస్తి యని గాక భౌతికమునకు అతీత మను భావమున దమ రచనములలో ఈశ్వరుని గణాద గౌతములు ప్రస్తావింపరైరి యనియు, Possibly the aphorisists confined themselves to a classification and dis cussion of subluminary things only, without minding the super-natural agency, while the commentators considering this to be a defect supplied the ommission by inserting God. 103. బహుశః అభౌతికకర్తృవిషయమును లక్షింపక, ప్రాకృతిక విషయములమాత్రమే మీమాంసించి విభజింప సూత్రకారులు తమ దృక్పథములనుంచి యుందురనియు,

103. Prof. S.Radhakrishnan: Indian Philosophy Vol 2 166

కాని అది లోపముగ నెంచి వ్యాఖ్యాతలు ఈశ్వరుని చొప్పించి యుందురని నాతనిఅభిప్రాయము. They never try to deceive us as to their principles and the consequences of their theories. 104. దర్శనాచార్యులు తను సిద్ధాంత విషయములను ఆసిద్ధాంతఫలితములను మరుగుపరచువారు కాకుండుటకెంతయో ఆనందము కలుగుచున్నదని Max Muller మాక్సుముల్లరు అనురీతి సిద్ధాంతప్రతిపాదన ఫలితములు గ్రహించియుండియు విశ్వసించిన సత్యముపకై వెన్నుజూపుట భీరువుల లక్షణమగు టచే గణాద గౌతములు యథాతథముగ దమ వాదముల బ్రతి పాదించియుండిరి. The belief in a super- natural agency which ordains every thing has led to a certain irresponsibility on the social plane, and emotion and sentimentality have taken the place of reasoned thought and inquiry 105. సర్వమును అనుగ్రహించు అప్రాకృతిక ఈశ్వరవిశ్వాసము సాంఘికముగ బాధ్యతారాహిత్యమును గలుగజేసి, సహేతుకభావపరిశీలనావిధానముల ఉద్రేకమూర్ఖత్వముల బ్రతిష్ఠింపచేసెనను జవహరిలాల్ నెహ్రూ మహాశయుని దృష్టి గౌతమాదులకుకూడ గలిగియుండునేమో అయినను In the Nyaya Sutra we find only a casual mention of God 106. న్యాయసూత్రములలో ఈశ్వరప్రస్తావన నామమాత్రము గలదనియు, పూర్వము న్యాయము నాస్తికముగ నుండియుండు నని రాధాకృష్ణుడు వచించెను. సర్వదర్శనముల ఖండించియున్న

104. Prof. F. Max Muller: The Six systems of Indian Philosophy x

105. Pandit Jawaharlal Nehru: Discovery of India 439

106. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 48

వ్యాసుడు బ్రహ్మసూత్రములలో న్యాయము ఖండింపకుండుట especially as it was agreeable to the admission of Iswara 107. న్యాయమునకు ఈశ్వరాస్తిత్వము అసమ్మతము కాకుండుటయే యిందుకు గొందరు విజ్ఞులు భావించిరి. The Iswara of the Nyaya Sutra concerned only with the adjustment of fruits of actions 108. న్యాయసూత్రములగల ఈశ్వరుడు కర్మఫలితము నేర్పరుచుటతో మాత్రము సంబంధించి యుండుననియు పండితులు తలంచిరి.

---

## న్యాయఖండనము

అయినను, గౌతమీయదర్శనమున సనాతనమును, వైదికమును, అగు ఈశ్వరప్రశంసయు తత్సంబంధమైన యజ్ఞయాగాది కర్మకలాపముల ప్రస్తావనయును బ్రస్ఫుటముగ గానరాకుండుటచే గొందరు వైదికపరులు కినిసి, న్యాయదర్శన ఖండనమును, దూషణమును బ్రబలముగ గావించిరి. 'అమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్యమతదర్థానాం' (పూ. మీ. 1. 2. 1) వేదము కర్మప్రవృత్తికముగాన తత్ప్రతిపాదనము గావింపనిశాస్త్రము నిరర్థకమని జైమిన్యాచార్యుడు మందలించెను. 'ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యమానేషు దుర్బుధాః । బుద్ధిమాన్వీక్షికీం ప్రాప్య నిరర్థకం ప్రవదంతి తే' (వాల్మీకి రామాయణము అయోధ్య 100) ముఖ్యమగు ధర్మశాస్త్రముల మార్గదర్శకములు

107. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 36
108. V. T. Srinivasa Iyangar: Outlines of Hindu Philosophy - 208.

కగ్రైకొనక, నిర్లక్ష్యముగ నిరర్థకమగు ఆన్వీక్షికీవిద్య నవలంబించువారు దుర్బుద్ధులని వాల్మీకిమహర్షి ఆన్వీక్షికిని నిరసించెను. ధర్మశాస్త్రకర్తయగు మనువుగూడ 'యోఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయాత్ ద్విజః। స సాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః' (మనుస్మృతి. 2 11) వేదశాస్త్రముల వర్జించి హేతువిద్యనాశ్రయించిన బ్రాహ్మణులు, నాస్తికులును వేదనిందకులును అగుటచే సాధుపురుషులచే బహిష్కరింపబడవలెను అని శాసించియున్నాడు. తర్కవిద్యాభ్యాసకులకు శృగాలత్వము ఉత్తరజన్మమున గలుగునని మహాభారతగ్రంథము శపించియున్నది. (మహాభారతము-శాంతి. 180అ) అట్లే తంత్రశాస్త్రముగూడ గౌతమప్రోక్త శాస్త్రార్థనిరతాః సర్వ ఏవ హి। శార్గాలీం యోనిమాపన్నాః సందిగ్ధాః సర్వకర్మసు॥ (గంధర్వతంత్రి) గౌతమప్రోక్తమైన న్యాయశాస్త్రనిరతులైన సర్వులును, సర్వకర్మసందిగ్ధులుగాన శృగాలయోని బొందెదరని నిందించుచున్నది. అందుచే 'స్నాతకానామిదం శాస్త్రం వాచ్యం పుత్రానుశాసనం। న తర్కశాస్త్రదగ్ధాయ తథైవ పిశునాయ చ' (శాంతి - 246అ) ఈవేదాంతశాస్త్రము బ్రహ్మచారులకు పుత్రులకుమాత్రమే బోధింపబడవలెను. తర్కశాస్త్రముచే దగ్ధమైనవారికి దుర్భాషులకు నిది అవాచ్యమని వేదాంతనిషేధమును వ్యాసులు మహాభారతమున గావించుచున్నాడు.



## న్యాయఖండన తాత్పర్యము

పైనుదాహరింపబడిన ఖండనవాక్యములలో ననేకములు న్యాయమును స్తుతించియున్న భారత, రామాయణ, మనుస్మృత్యాదులచే జేయబడియుండుట మిగుల విచిత్రము. అందుచే నాయాగ్రంథములు స్వమతవ్యాఘాతములై అసంబద్ధములై న్యాయవిషయమున బ్రవర్తించియుండునట్లు గానుపించును. అట్లు ఖండించుచున్నసమయమున నవి న్యాయమూలసిద్ధాంతమగు విచారణావిధానము నవలంబించుచున్నవి గాన ఆయాగ్రంథములు మరల నాన్యాయవిధానమునే పురస్కరించుకొని న్యాయఖండనముగావించుట గానఁబడును. న్యాయకర్త అహల్యానాథుడైన గౌతముడేయైయున్నచో 'మహాత్మనః ఆశ్రమో దివ్యసంకాశః సురైరపి సుపూజితః' (వాల్మీకిరామాయణము) అనియు, 'గౌతమస్యాశ్రమం పుణ్యం' 'దీర్ఘతపసః' అనియు గౌతమునేగాక ఆశ్రమమునుగూడ అధికముగ సంస్తుతించియున్న రామాయణగ్రంథము ఆగౌతమునే ఎట్లు నిందించునో ఆశ్చర్యము. అట్లగుచో రామాయణగాథలో గల గౌతముడు న్యాయశాస్త్రనిర్మాతకాడేమో అనియు సందియము కలుగకమానదు. మీదుమిక్కిలి రామాయణమున గౌతమునకు యితరవిశేషములతోసహా ఆన్వీక్షికీకర్తయనిగాని తార్కికుడనిగాని యెందును గానరాదు. వాల్మీకిమహర్షికి శాస్త్రకర్తృత్వము అప్రధానమై గౌతమునితపస్సు మొదలైనవే అకర్షణీయమై యుండవచ్చును. అదేవిధముగ ఉపనిషత్తుల వేదముల న్యాయసహాయమున విభజింపగల్గిన వ్యాసుడు, మద్ద

ర్శనముల నన్నింటిని ఖండించి న్యాయమును ఖండింపని వ్యాసుడు, పూర్వోక్తరీతి న్యాయనింద గావించుటయు నసందర్భము. కాన నీఖండన వాక్యములన్నియు నాయాగ్రంథముల గాలాంతర ప్రక్షిప్తములై చేర్పబడియుండనోపును. అట్లుగాక చో గౌతమప్రోక్త యుక్తివాదమును సక్రమరీతి నుపయోగింపనేరక ఆర్షధర్మమునకే ముప్పువాటిల్ల జేయు కొందరు యత్నింప 'ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా। యస్తర్కేణాను సంధత్తే స ధర్మం వేద నేతరః॥' (మనుస్మృతి 12. 106) వేద శాస్త్రానుకూలమైన తర్కముచే ఆర్షధర్మముల విచారింపగా ధర్మమగును, తద్వ్యతిరిక్తము అధర్మము అని మనువువివరించినట్లు కుతర్కవాదుల నిందించుటకై పూర్వోక్త నిందావాక్యము లుప యుక్తములేమో యని తోచును. అందుచేత 'న చాగమా దృతే ధర్మే । స్తర్కేణ వ్యవతిష్ఠతే' ఆగమశాస్త్ర బద్ధమైన ధర్మము తర్కముచే ఖండింపబడజాలదని ఆగమధర్మము యొక్క పటుత్వమును కుతర్కవాదనిరసనము చేయబడియున్నది. 'నైషా తర్కేణ మతిరాపనేయా' (కఠ 1.2.9) యీజ్ఞానము స్వబుద్ధిగత తర్కముచే బాధింపబడునదికాదు అనియు కఠో పనిషత్తు బోధించియున్నది. 'శుష్కతర్కస్యాత్మలాభస్సం భవతి' (బ్ర.సూ.భా.2 1.6.) శ్రుతినిరపేక్షికమైన తర్కమున కిట ఆత్మలాభము సంభవింపదనియు,కాన 'శ్రుత్యనుగ్రహీత ఏవ హ్యాత్ర తర్కోఽనుభవాంగత్వేనాశ్రియతే' (బ్ర. సూ. భా. 2 1.6.) శ్రుత్యనుగ్రహీతమగు తర్కమే అనుభవమున కంగ ముగ నంగీకార్యముగా శ్రీశంకరులును విస్పష్టము గ వించియు న్నాడు. మరియు 'ఏవంహి సావద్యతర్కపరిత్యాగేన నిరవ

ద్యస్త్వర్థః ప్రతిపత్తవ్యో భవతి' (బ్ర. సూ. భా. 2.1.11.) ఇట్లుండగా శుష్కతర్కపరిత్యాగముచే నిర్దుష్టతర్కములు గ్రాహ్యములనియు (శ్రీ)శంకరుల సమన్వయము. ఆకారణముననే 'అచింత్యాః ఖలు యే భావాః న తాం స్తర్కేణ యోజయేత్' (బ్ర. సూ. భా. 2.1.6) ఏవిషయములు నిశ్చయముగ అచింత్యములో వానిని తర్కముచేత సమన్వయింపరాదని స్మృతియుగూడ మనకు సలహా నొసంగుచున్నది. ఈకారణమువలన, గౌతమ న్యాయదర్శన ఖండనముగాని గౌతమఖండనముగాని గ్రంథములు లేక, శుష్కతర్కము. లేక కుతర్కమే ఆస్న గ్రంథముల నిరసింపబడియున్నట్లు సువిదితము. ఈగౌతమదర్శనము అట్టి కుతర్కవాదులకుకూడ నుపయుక్తమగుటచే సనాతనపరులకు కొంచెము బాధ గలిగించెనని He founded a rational system of philosophy called Nyaya which at its inception had no relation with the topics of the Vedic Samhita and Brahmana......This being the nature of Nyaya at its early stage it was not received with favour by the orthodox community of Brahmanas. 109. ప్రారంభమున న్యాయదర్శనమునకు వేద సంహిత బ్రాహ్మణములతో సంబంధము లేకుండునట్లు యుక్తిసహితముగ గౌతముడు నిర్మించెను. న్యాయతత్త్వమిట్లగుటచే మొదట సనాతనులగు బ్రాహ్మణసంఘముచే నది యంగీకరింపబడలేదు అని విద్యాభూషణుని వచనము. కాని దర్శనము నిరసింపబడక తర్కమే నిరసింపబడియుండుటచే కుతర్కమునే సనాతనులు నిందించిరనుట సమంజసముగ నుండును. Gradually however, this system of philosophy instead of relying entirely

---

109. M. M. Satish Chandra Vidyabhushana: Nyaya Sutras of Gotama

upon reasoning came to attach due weight to the authority of the Vedas 108. కాలక్రమమున యీసిద్ధాంతము కేవల తర్కముపై నాధారపడక వేదప్రమాణమునకుగూడ తగు ప్రాధాన్యత నొసంగుటచే the principles of Nyaya were assimilated in other systems of philosophy 109. న్యాయవిషయములు ఇతరసిద్ధాంతులచే స్వీకరింపబడినవనియు విద్యాభూషణుని అభిప్రాయము. కాని శ్రుతిబద్ధమగు తర్కము ప్రథమమునుండియు సర్వసిద్ధాంతులు స్వీకరించి తమ తమ సిద్ధాంత ప్రతిపాదనమున విరివిగా నుపయోగించుకొని రనుట కెట్టి సంశయము పొడగట్టదు. అటులే కుతర్కము నాటికి నేటికిని త్యాజ్యముగనే యున్నదనుటయు నిర్వివాదాంశమే. అందుచే గౌతమ అక్షపాదనిర్మిత న్యాయదర్శనము సర్వదా ఆదరణీయ స్థానముననేయుండ దాని కుమార్గముల వేదనిందకై యుపయోగించిన కుతార్కికనిందయే పూర్వగ్రంథముల గలద నుట కడుంగడు సముచితమైయున్నది.

---

## న్యాయము - ఆన్వీక్షికీ

న్యాయదర్శనమునగల పంచాధ్యాయములలో షోడశ తత్త్వ ప్రతిపాదనముగావించు ప్రథమాధ్యాయముమాత్రమే గౌతమ ప్రణీతమనియు, నీ తర్వాత మూడుఅధ్యాయములు పర

108. V. T. Srinivasa Iyangar: OutLines Of Hindu Philosophy 208
109. M. M. Satish Chandra Vidyabhushana: Nyaya Sutras of Gotama

కల్పితములై కాలాంతరమున జేర్చబడిననియు, అయిదవ అధ్యాయము భాష్యకర్తయగు వాత్స్యాయనమహాముని నిర్మాణమనియు విద్యాభూషణుని భావము. కాని విద్యాభూషణుడే ఆ అభిప్రాయమును సంస్కరించుకొని, మేధాతిథిగౌతముడు ఆన్వీక్షికీనిర్మాత యనియు తర్వాత అక్షపాదుడు దానిని న్యాయ దర్శనరూపమున పూర్తిగావించెననియు తెలిపెను. కాని The theory that Gautama and Akshapada are two different persons is equally unsound 110. గౌతమాక్షపాద విభేదకల్పనము అసంగతమని నందలాలుడు తీర్మానించుట మన పూర్వగ్రంథమున దిలకించియుంటిమి. అధిక సంఖ్యాకులగు పండితులు అట్లే విశ్వసింతురు.

---

## వాత్స్యాయన భాష్యరచన

భాష్యకారులైన వాత్స్యాయనుడు భాష్యరచనమున అచటచట సూత్రములవలె గొన్ని వచనముల రచించి వాని గౌతమున కన్వయించెనను అపవాదుగూడ గలదని పూర్వము వచించియుంటిమి. ఆవిషయమున పండితలోకమున భిన్నాభిప్రాయము లేర్పడినవి. అందు ప్రథమపక్షమునకు క్రీ.త. 820 సంవత్సరములకుజెందిన వాచస్పతి మిశ్రుడు నాయకుడు. వాచస్పతివ్రాసిన న్యాయవార్తికాతాత్పర్యటీకకు బరిశుద్ధి అనుగ్రంథమున క్రీ. త. 984 సంవత్సరములకుచెందిన ఉదయనాచార్యుడు

110. Nandalal Sinba : Nyaya Sutras of Gotama

వాచస్పతిని ఖండించి రెండవపక్షమునకు నాయకుడయ్యెను. న్యాయసూత్రార్థగ్రహణమున యిట్లు భేదభావములున్నను భారతీయ నిఖిల సంస్కృతవిద్యాస్థానములును భాష్యనిష్ఠశంకత్వమును విశ్వసించుచున్నవి. ఇదేభావము ప్రాక్ప్రతీచీపండితులకుకూడ నేడంగీకార్యముగా నున్నది. అందుచేత Keith కీత్ పండితుని వాక్యములలో The suggestion that Vatsayana is responsible for remodlling the Nyaya Sutra is wholly unsupported by evidence. 111. న్యాయసూత్రముల బరివర్తన కార్యమునకు వాత్స్యాయనుడు బాధ్యుడనుభావము సంపూర్ణముగా నిరాధారమని తెలియుచున్నది. కాన న్యాయదర్శనమునగల పంచాధ్యాయములును అక్షపాదగౌతమప్రణీతములే యనియు నిర్ధారణము.

---

## న్యాయరచన

గౌతమ న్యాయదర్శనము 'త్రివిధా చాఽస్య శాస్త్రస్య ప్రవృత్తిః-ఉద్దేశో లక్షణం పరీక్షా చేతి' (న్యా. భా. 1. 1. 3.) ఉద్దేశ, లక్షణ, పరీక్షారూప త్రివిధ ప్రవృత్తులు గలిగియున్నది. అందు 'తత్ర నామధేయేన పదార్థమాత్రస్యాఽభిధానముద్దేశః' పదార్థమునకు నామధేయముద్వారా నామకరణముగావించుట ఉద్దేశ్యమనియు, 'తత్రోద్దిష్టస్య తత్త్వవ్యవచ్ఛేదకో ధర్మో లక్షణం' అట్లు ఉద్దిష్టమైన దాని తత్త్వవిభాగధర్మనే లక్షణమనియు, 'లక్షి

---

111. Dr. A. B. Keith : Indian Logic and Atomism 25,27

తస్య యథా లక్షణముపపద్యతే నవేతి ప్రమాణైరవధారణం పరీక్షా' (న్యా. భా. 1.1.3.) అట్లు లక్షితమైనదాని కెట్లు లక్షణము గలుగునో దాని బ్రమాణపూర్వకముగ నిశ్చయించుటయే పరీక్షయనియు వాత్స్యాయనుడు వివరించి యున్నాడు. అట్టి తర్కశాస్త్రగ్రంథము, తర్క, ప్రమాణ, అవయవ, అన్యమత పరీక్షా నాబడు చతుర్విషయ మీమాంసచేసియున్నది. ఈదర్శనమున ఒక్కొక్కదానికి రెండు ఆహ్నికములచొప్పున అయిదు అధ్యాయములు గలవు. అనగా మొత్తమునకు దశాహ్నిక రూపమున విభజింపబడియున్నది. గౌతమమహర్షి యీగ్రంథము నంతటిని పదిదినముల పాఠమునకుగ పదిదినముల రచించి ముగించెనని కొందరి అభిప్రాయము. ఇందలి సూత్రసంఖ్య విషయమున విభిన్న భావములున్నట్లు పూర్వమే వచించి యుంటిమి. అగుటచే, మొత్తమునకు, 547 సూత్రముల మహామహోపాధ్యాయులు చంద్రకాంతతర్కాలంకారులును, 540 సూత్రములేయని వంగీయ ఏషియాటిక్ సొసైటీ వారును, 537 సూత్రములని మ. మ. భీమాచార్య ఝాల్కికార్ పండితుడును, 532 సూత్రములుగ మ. మ. గంగానాథఝా మహాశయుడును, 531 సూత్రములని మ. మ. గంగాధరశాస్త్రి తైలింగులును, 528 సూత్రములేయని వాచస్పతి మిశ్రయును తీర్మానించిరి. కాని అధిక సంఖ్యాకులు వాచస్పతినే ప్రమాణముగ నంగీకరించుచున్నారు.

---

## న్యాయవిషయము - మాధవాచార్యుడు

మాధవాచార్యుడు న్యాయదర్శన సమీక్ష గావించుచు ప్రతి ఆహ్నికవిషయముల క్రోడీకరించి విరచించెను. ప్రథమాధ్యాయ ప్రథమాహ్నికమున గౌతముడు నిశ్శ్రేయసమును అధిగమింపజేసి అపవర్గమును ప్రసాదింప తత్త్వజ్ఞానరూపమైన షోడశతత్త్వముల ప్రతిపాదించి అందు ప్రమాణాది నిర్ణయపర్యంతమగు తొమ్మి దింటచర్చించి, ద్వితీయాహ్నికమున, ఎనిమిదవ తత్త్వమగు వాద ముతో ప్రారంభించి నిగ్రహస్థానమువరకుగల మిగిలిన ఏడింటిని చర్చించెను. ద్వితీయాధ్యాయ ప్రథమాహ్నికమును సంశయ ముతో నుపక్రమించి, చతుర్విధ ప్రమాణముల చర్చించి, వాని పూర్వపక్షముల గౌతముడు ఖండించెను. రెండవ ఆహ్నికమున నైతిహ్యాదిక ప్రమాణముల చర్చించి అవి ప్రథమ చతుర్విధ ప్రమాణాంతర్గతములని తీర్మానించును. తృతీయాధ్యాయ ప్రథ మాహ్నికమున అక్షపాదుడు ఆత్మపరిశీలన గావించి శరీరేం ద్రియ విషయముల బరీక్షించి, ద్వితీయమున బుద్ధిమనముల మీమాంసించును. చతుర్థాధ్యాయమున మొదటి ఆహ్నికము ప్రవృత్తి, దోష, ప్రేత్యభావ, కర్మఫల, దుఃఖ, అపవర్గముల సమీక్షింప, రెండవ ఆహ్నికము, దోషకారణసత్యమును, అవ యవ అవయవులను సమాధిని జర్చించును. పంచమాధ్యాయమున ప్రథమాహ్నికమున దర్శనకారుడు వివిధరూప జాతిలక్షణములను విమర్శించి, ద్వితీయమున నిగ్రహస్థానావసర అవకాశముల సంపూర్తిగా చర్చించి గ్రంథపరిసమాప్తి గావించెను.

## న్యాయవిషయము – వాచస్పతి

ఈవిషయమునే వాచస్పతులు 84 ప్రకరణములుగా విభజించి వానివాని కనువగు సూత్రముల బొందుబరచి న్యాయదర్శనాభ్యాసమును సులభతరము గావించియున్నారు. ప్రథమాధ్యాయ ప్రథమాహ్నికమున దొలుత అపవర్గలాభము నొసంగు తత్త్వజ్ఞానప్రాప్తికై వలయు విషయ ప్రయోజన సంబంధరూప ప్రమాణాది నిగ్రహస్థానపర్యంత షోడశతత్త్వముల ప్రతిపాదనముతో బ్రారంభించి, విషయ, ప్రయోజన, సంబంధ (1–2) ప్రమాణలక్షణ (3–8) ప్రమేయలక్షణ (9–22) సిద్ధాంత పూర్వాంగలక్షణ (23–25) సిద్ధాంతలక్షణ (26–31) న్యాయ (32-39) న్యాయోత్తరాంగలక్షణము (40–41) లనబడు ప్రకరణములద్వారమున ప్రథమసూత్రమునగల షోడశకమున నిర్ణయవరకుగల తొమ్మిది తత్త్వములు ఏడు ప్రకరణములలో పరీక్షింపబడియున్నవి. అట ద్వితీయాహ్నికమున షోడశకములోని పదియవ వాదముతో కథాలక్షణ (1–3) హేత్వాభాస లక్షణ(4–9) ఛలలక్షణ(10–17)పురుషశక్తి లింగదోష సామాన్య లక్షణములు (18–20) నాబడు నాల్గుప్రకరణములలో నిగ్రహస్థానమనబడు పదునారవ తత్త్వమువరకు మీమాంసింపబడి యున్నది.

ద్వితీయాధ్యాయ ప్రథమాహ్నికమున సంశయపరీక్షతో (1–7) ప్రారంభమై, ప్రమాణ సామాన్య పరీక్షా (8–20) ప్రత్యక్షలక్షణ పరీక్షా (21–32) ప్రత్యక్షానుమానత్వ పరీక్షా (33–36) అనుమాన పరీక్షా (37–38) వర్తమానపరీక్షా (39–43)

ఉపమానపరీక్షా (44-48) శబ్దసామాన్యపరీక్షా (49-56) శబ్దవిశేషపరీక్షా (57-68) రూపమున అష్ట ప్రకరణములలో ప్రత్యక్షాది ప్రమాణచర్చ చేసియున్నది. ద్వితీయాహ్నికము ఐతిహ్యాది ప్రమాణచర్చార్థమై ప్రమాణచతుష్టయపరీక్ష (1-12) తో ప్రారంభమై శబ్దానిత్యత్వ (13-39) శబ్దపరిణామ (40-57) శబ్దశక్తిపరీక్షా (58-69) లేక పదార్థ నిరూపణములను ప్రకరణచతుష్టయమున ప్రమాణచర్చ గావించియున్నది.

తృతీయాధ్యాయ ప్రథమాహ్నికము ఆత్మేంద్రియ విభాగ విషయ ప్రతిపాదనమునకై సూక్ష్మేంద్రియ వ్యతిరిక్తాత్మా (1-3) శరీరవ్యతిరిక్తాత్మా (4-6) చక్షురద్వైతనిరాకరణ (7-14) ఆత్మమనోవ్యతిరేక (15-17) ఆత్మనిత్యతా (18-26) శరీరపరీక్షా (27-31) ఇంద్రియభౌతికత్వపరీక్షా (32-51) ఇంద్రియనానాత్వ (52-61) అర్థపరీక్ష (62-73) లనబడు ప్రకరణ నవకమూలమున ఆత్మవిశిష్టత వివరించినది. ద్వితీయాహ్నికమున, బుద్ధినిరూపణార్థము బుధ్యనిత్యతా (1-9) ఔపాధికం క్షణభంగ (10-17) బుద్ధిఆత్మగుణత్వ (18-41) బుద్ధిఉత్పన్నాపవర్గత్వ (42-45) శరీరగుణవ్యతిరేక (46-55) మనఃపరీక్షా (56-59) శరీరస్థాదృష్టనిష్పాద్యత్వ (60-72) విధ అష్టప్రకరణముల మనోబుద్ధినిరూపణము గావింపబడెను.

మరియు చతుర్థాధ్యాయ ప్రథమాహ్నికమున ప్రవృత్తి నిర్ణయముచేయదలచి, ప్రవృత్తిదోషసామాన్యపరీక్షా (1-2) దోషత్రైరాస్య (3-9) ప్రేత్యభావపరీక్షా (10-13) శూన్యతోపాదాన (14-18) ఈశ్వరోపాదానత (19-21) ఆకస్మికత్వ

(22-24) సర్వానిత్యనిరాకరణ (25-28) సర్వనిత్యత్వనిరాకరణ (29-33) సర్వపృథక్త్వనిరాకరణ (34-36) సర్వశూన్యతానిరాకరణ (37-40) సంఖ్యైకాంతవాదనిరాకరణ (41-43) ఫలపరీక్షా (44-53) దుఃఖపరీక్షా (54-57) అపవర్గపరీక్షా (58-67) యను చతుర్దశ ప్రకరణములలో పరమతనిరాసము అపవర్గ సూచనము చేయబడినది. ద్వితీయాహ్నికమున తత్త్వజ్ఞానోత్పత్తి (1-3) అవయవావయవి (4-17) జౌపోద్ధాదికంనిరవయవత్వ (18-25) బాహ్యార్థభంగనిరాకరణ (26-37) తత్త్వజ్ఞాన వివృద్ధి (38-49) తత్త్వజ్ఞానపరిపాలన (50-51) అను ప్రకరణముల తత్త్వజ్ఞాన వివరణము జరిగెను.

అయిదవ అధ్యాయమున మొదటి ఆహ్నికమున, వాద వివాదలక్షణముల వివరింప నుద్యమించి సాధర్మ్యాది కర్మ సమా పర్యంత చతుర్వింశతి ప్రతిషేధహేతువుల దర్శనకారుడు వివరించెను. ఈయిరువదినాలుగును నైజమున పదునారగుటచే షోడశప్రకరణముల వర్ణితములయ్యెను. అందు సత్ప్రతిపక్షదేశనాభాస (1-3) సాధ్యదృష్టాంత ధర్మవికల్పప్రభావోత్కర్ష సమాదిజాతిషట్క (4-6) ప్రాప్త్యప్రాప్తియుగనద్ధవాహివికల్పోపక్రమజాతిద్వయ (7-8) యుగనద్ధవాహిప్రసంగప్రతిదృష్టాంత సమ జాతిద్వయ (9-11) అనుత్పత్తిసమ (12-13) సంశయ సమ (14-15) ప్రకరణసమ (16-17) అహేతుసమ (18-20) అర్థాపత్తిసమ (21-22) అవిశేషసమ (23-24) ఉపపత్తిసమ (25-26) ఉపలబ్ధిసమ (27-28) అనుపలబ్ధిసమ (29-31)

అనిత్యసమ (32-34) నిత్యసమ (35-36) కార్యసమ (37-38) షట్పక్షరూపకథాభాస (29-43) అనబడు సప్తదశప్రకరణములు గలవు. ద్వితీయాహ్నికమున ద్వావింశతి నిగ్రహస్థానములు వివరింపబడియున్నవి. ప్రతిజ్ఞాహేత్వన్యతరాశ్రిత నిగ్రహస్థాన పంచకవిశేషలక్షణ (1-6) ప్రకృతోపయోగివాక్యార్థప్రతిపత్తి ఫలశూన్య నిగ్రహస్థానచతుష్క (7-10) స్వసిద్ధాంతానువాద రూప ప్రయోగభాస నిగ్రహస్థానత్రిక (11-13) పునరుక్త నిగ్రహస్థాన (14-15) ఉత్తరవిరోధ నిగ్రహస్థాన చతుష్క (16-19) శేషనిరూప్యమతానుజ్ఞాదినిగ్రహస్థానత్రిక (20-22) కథకాస్యోక్తి నిరూప్యనిగ్రహస్థానద్వయ (23-24) యనబడు ప్రకరణసప్తకములో నిగ్రహవిధాన వివరణము గావింపబడెను.

పైవిధాన పంచాధ్యాయ సంశోభితమైన న్యాయదర్శనము ప్రథమసూత్రముననే నిర్దుష్టముగ సూచింపబడిన నిఃశ్రేయసాధి గమనార్థమే అనగా అపవర్గార్థమే ప్రవృత్తమై చతుర్థాధ్యా యాంతమున అపవర్గవివరణముతో నంతమై తత్ఫలప్రాప్తి హేతువైన తత్త్వజ్ఞానసిద్ధికై యుపయుక్తములగు ప్రమాణాదికవిషయ ముల, ఆత్మానాత్మవిభేదము, ప్రవృత్తివిధానముల వివరించి యుండుటచే నది అసందిగ్ధరీతి నుత్కృష్టమై సర్వోపయుక్తమై యలరారినది. అందుల కెట్టి సంశయమును లేదు. అయి నను గ్రంథభాగమునం దధికభాగము ఈశ్వరేతర విషయప్రవృ త్తమై యున్నంతమాత్రమున నది కలుషితముగ పరిగణింప సమంజసముకాదు. అది మోక్షదూరమనుట కెట్టి యాధార

మును కానరాదు. కాన న్యాయదర్శనమును న్యాయబుద్ధితో పఠించి, న్యాయవిమర్శాబుద్ధితో దేహేంద్రియ మనోబుద్ధుల పరీక్షగావించి, అపవర్గ సంనివేశనప్రాప్తి నొంద నెల్లరు తమ చిత్తముల నియుక్తము గావించెదరుగాక ! తత్సిద్ధిబడయుదురు గాక !



## న్యాయదర్శన నామవిమర్శ

గౌతమమహర్షి సత్తమునిచే నిర్మింపబడిన యీదర్శనము నకు గౌతమదర్శనమనియు, అక్షపాద దర్శనమనియు, నామము గలదు. కాని సర్వేసర్వత్ర దీనికి న్యాయదర్శనమనియే ప్రతీతి. 'ప్రమాణైరర్థపరీక్షణం న్యాయః' (న్యా. భా. 1.1.3) ప్రమాణములచే అర్థమును పరిశీలించుటయే న్యాయలక్షణమని వాత్స్యాయన నిర్వచనము. అనగా 'సమస్తప్రమాణవ్యాపా రాదర్థాధిగతిః న్యాయః' (న్యాయవార్తిక. 1. 1. 1) సమస్త ప్రమాణ వ్యాపారద్వారమున అర్థగ్రహణమే న్యాయమని వార్తికకారుడైన ఉద్యోతకారుని వివరణము. 'ప్రత్యక్షాది ప్రమాణమూలాః ప్రతిజ్ఞాదయః పంచావయవాః ప్రమాణాని తైః అర్థస్య లింగస్య పరీక్షణం న్యాయః' (న్యాయవార్తికా తాత్పర్యటీక) ప్రత్యక్షాది ప్రమాణముల కాధారమగు ప్రతి జ్ఞాది అవయవపంచకముచే అర్థలక్షణ పరీక్షణమే న్యాయమని వార్తికాతాత్పర్యటీకాకారుడైన వాచస్పతిమిశ్రుని విపులీకర ణము. **Nyaya, a term which is the early disignation of Karma Mimamsa and points through its history in its**

generic sense of reasoning, while Nyaya philosophy proper borrows it and applies it more specially to denote the Syllogism 112. న్యాయశబ్దము ప్రథమతః కర్మమీమాంస కన్వయమై యుక్తివిధానపునుభావమును తన చరిత్రలో సూచించును. న్యాయసిద్ధాంతము దాని గ్రహించి, ముఖ్యముగ అనయవికి అన్వయింపజేసెను అని కీత్ పండితుడు వ్రాసెను. 'న్యాయ సత్త్వనిర్ణయం' (భాష్యచంద్ర 1. 1. 1) న్యాయమన తత్త్వనిర్ణయమని భాష్యచంద్రనిర్మాత రఘూత్తముడు వచించెను. 'నీయతే అనేన ఇతి న్యాయః' దేనిచే నియమితమై చిత్తముల తీర్మానించుకొనునో అది న్యాయమను వ్యుత్పత్తి గల్గుచున్నది. The Nyaya means in popular usage, right or just, and so the Nyaya becomes the science of right reasoning 113. సాంప్రదాయికముగ న్యాయమనగా ఉచితము, యథార్థము అని సామాన్యముగ అర్థము. అందుచే న్యాయము సద్యోచనాశాస్త్ర మగుచున్నది. It is thus becomes a science of demonstration of correct knowledge 113. అట్లు అది ప్రత్యక్షార్థశాస్త్రముగను, ప్రమాణశాస్త్రముగను అగును అని రాధాకృష్ణుడు వచించెను. ఇదేభావమును విద్యాభూషణుడును వెలిబుచ్చెను 114. Nyaya probably means 'method' applicable to any kind of argumentation 115. న్యాయము విధానమును సూచించుచు, ఏ విచారణాపద్ధతికైన నన్వయించునని Macdonell మాక్డొనెల్

112. Dr A B Keith : Karma Mimamsa 2
113. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 40
114. M. M. Satish Chandra Vidyabhushana: Nyaya Sutras of Gotama
115 Dr. A A. Macdonell : India's Past

పలుకును. Nyaya is derived from 'ని' into 'ఇ' to go 'ని' లోనికి 'ఇ' పయనించుట అను వ్యుత్పత్తినుండి న్యాయము జనితమని Max Muller మాక్సుముల్లర్ అర్థమును గ్రహించెను116. Nyaya becomes equivalent to an argument and the system which treats more thoroughly than others, comes to be known as the Nyaya System 117. న్యాయ యనగా వాదము. ఇతర సిద్ధాంతములకంటె నేది నీవాదపద్ధతిని నిగ్గుష్టముగ నవలంబించెనో అది న్యాయసిద్ధాంతముగ నయ్యెను అని పండిత వివరణము. కాని Technically the word Nyaya signifies syllogism and the Anvikshiki was called Nyaya Sastra where Nyaya constitutes its special topic 118. శాస్త్రీయముగ న్యాయమన అవయవి యగును. న్యాయము ప్రధానాంశముగనున్న ఆన్వీక్షికియే న్యాయ శాస్త్రముగ పరిగణింపబడినదని విద్యాభూషణుని భావము.

దీనినే ఆన్వీక్షికీ అనికూడ వ్యవహింతురు. 'ప్రత్యక్షాగమాశ్రితమనుమానం సాఽన్వీక్షా' (న్యా. భా. 1. 1. 1) ప్రత్యక్షాగమములద్వార అనుమానించుట లేక ఊహించుటయే ఆన్వీక్షా అనియు, 'ప్రత్యక్షాగమాభ్యా మీక్షితస్యాన్వీక్షణ మన్వీక్షా । తయా ప్రవర్తతే ఇత్యాన్వీక్షికీ - న్యాయవిద్యా-న్యాయశాస్త్రం' (న్యా. భా. 1. 1. 1) అట్టి ఆన్వీక్షచే ప్రవృత్తము ఆన్వీక్షికీ నాబడును. అదియే న్యాయవిద్యా, న్యాయ

---

116. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy 76
117. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2 40
118. M. M. Satish Chandra Vidyabhushana: Nyaya Sutras of Gotama

శాస్త్రము అని వాత్స్యాయన నిర్వచనము. 'ప్రత్యక్షాగమాభ్యా మవగతస్య వస్తునః అనుపశ్చాత్ ఈక్షణమన్వీక్షా, సా ప్రయోజనమస్యా ఇతి ఆన్వీక్షికీ' (అమరకోశ. 1. 161) ప్రత్యక్షాగమములచేత నవగతమైన వస్తువునకు వెనుకవిచారించుట అన్వీక్ష-అది ప్రయోజనముగాగలది ఆన్వీక్షికీ అని అమర వాక్యము. Again it is called అన్వీక్షా or investigation since it consists in the reviewing (అను-ఈక్షణ) of a thing previously apprehended (ఈక్షిత) by perception and verbal testimony 119. ప్రత్యక్షాగమ ప్రమాణములచే బూర్వమే యీక్షితమైన, అనగా గ్రహింపబడిన విషయమును ఈక్షణ అనగా మరల పరిశీలించుటనుగాన నది అన్వీక్షా యన బడెను అని రాధాకృష్ణ వివరణము.

మరియు నీశాస్త్రమునే 'ఇదానీం తర్కసంజ్ఞాపి ప్రదర్శితా' (న్యాయభాష్య 1. 1. 1) తర్కనామమునగూడ వ్యవహరించెదరు. 'తర్కశాస్త్రైవ న్యాయశాస్త్రత్వం' తర్కశాస్త్రమే న్యాయశాస్త్రముగా గ్రహింపబడియుండుటచే 'ఆన్వీక్షికీ దండనీతి స్తర్కవిద్యా అర్థశాస్త్ర' మని అమరకోశము తెలుపును. 'అవిజ్ఞాతతత్త్వేర్థే కారణోపపత్తిస్తత్త్వజ్ఞానార్థమూహః తర్కః' (న్యా. సూ. 1. 1. 40) అవిజ్ఞాతమైన అర్థగ్రహణార్థమై అన్యార్థ నిరాసముజేయుచు, యథార్థజ్ఞానమును తెలుపుటకై యూహించుట తర్క మనంబడును అని న్యాయ

---

119. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 20

సూత్రకారుని నిర్వచనము. 'అవిజ్ఞాయమానతత్త్వేర్థే జిజ్ఞాసా తావజ్జాయతే జానీయేయమర్థమితి' (న్యా భా. 1. 1. 40) అవిజ్ఞాతమై తత్త్వముయొక్క అర్థమును తెలియువరకు జిజ్ఞాస సేయుటే తర్కమని వాత్స్యాయనుని వ్యాఖ్యానము. అనగా 'తత్త్వజ్ఞానార్థ మూహస్తర్కః' (న్యా. భా. ఉద్యోత 1.1.40) తత్త్వజ్ఞానార్థమగు ఊహయే తర్కము నాబడునని గంగానాథ ఝూ మహాశయుని వివరణము. అందుచే నీశాస్త్రము తర్కశాస్త్రమనియు నామాంతరము గలిగియున్నది. పూర్వాధున గ్రంథావళిలో ఈనామత్రయము ఎక్కువగ గోచరించుటచే నీ మూడునామములును ప్రఖ్యాతములనియే వచింపనగును. కాని యీమూడింట న్యాయదర్శన నామము సుప్రశస్తము.

మరియు 'అధ్యాయ న్యాయోద్యావసంహారాశ్చ' (అష్టాధ్యాయి 3.3.122) అను సూత్రము ననుసరించి 'ని' అను ధాతు జనితము న్యాయమనియు, ఆ ధాత్వర్థము 'గమన' మనియు, కాన న్యాయ పంచాంగమగు అవయవిగొయొక్క పంచమ భాగమైన నిగమన (న్యా. సూ. 1.1.39) పదమున కన్వయ మియ్యదియే యనియు విద్యాభూషణుడు వచించియున్నాడు. అనగ నిగమనమునకు న్యాయము పర్యాయపదమే యని అతని అభిప్రాయము. 'హేత్వపదేశాత్ప్రతిజ్ఞాయాః పునర్వచనం నిగమనం' (న్యా. సూ. 1.1.39) హేతువును సూచించిన పిమ్మట ప్రతిజ్ఞను మరల వచించుటయే నిగమనమని సూత్రకారులు నిర్వచించియున్నారు. ఈ విధముగ శాస్త్రమునందు ఉపయోగింపబడియున్న ముఖ్యపదముల నన్వయించుచు నింక

ననేకవిధముల నీ శాస్త్రము పిలువబడుచున్నది. అవయవి యందు ద్వితీయభాగముగు హేతు (న్యా. సూ. 1.1.34) పదము గలదు. అనగా 'ఉదాహరణ సాధర్మ్యాత్సాధ్య సాధనం హేతుః' ఉదాహరణములోని సాధర్మ్యము ననుసరించి సాధ్యమును సాధించుట హేతువుగా న్యాయసూత్రము. దాని ననుసరించి దీనిని హేతువిద్య యనియు హేతుశాస్త్రమనియు అనుటగలదు. ఈ శాస్త్రవిచారణ మంతయు ప్రమాణాధార మగుటచే దీనిని 'ప్రమాణశాస్త్ర' మనియు, (న్యా. సూ. 1.1.1-8) తత్త్వబోధ సేయునుగాన తత్త్వశాస్త్రమనియు (న్యా. సూ. 1.1 1, 4.2.1) వాదవిధానమును నేర్పునుగాన 'వాదార్థ శాస్త్రమనియు (న్యా. సూ. 1.2.1) హేత్వాభాస, (న్యా. సూ. 1.2 4-9) ఛల (న్యా. సూ. 1.2.10-27) వాదవిధానముల నవలంబించునుగాన ఫక్కికశాస్త్రమనియు నామాంతరముల గలిగియున్నదీ న్యాయదర్శనము. ఇక్కడ 'ఫక్కిక' శబ్దము నకు నిరూపణయోగ్య ప్రతిజ్ఞావిషయమనియు, తార్కికవాద మనియు అర్థము.

All logical attempts to gather the floating conceptions of the world into some great general ideas were regarded as Darsana 120. సృష్టినిగూర్చి నానా విధంబులనున్న వాదముల నొక మహత్తర సామాన్య భావ పుంజముగా చేర్చుటకై గలుగు తార్కికవిధానమే దర్శనమని మాధవాచార్యుని దర్శన నిర్వచనము. 'దృశ్యతే తత్త్వమనేన దర్శనం' అనురీతి తత్త్వదర్శనప్రాప్తి గలుగజేయునది దర్శనము

120. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 18

గాన They all help us to see some aspect of the Truth
121. దర్శనములన్నియు సత్యముయొక్క ఒకభాగమును గాంచ మనకు తోడ్పడునను రాధాకృష్ణ వచనానుసరణి న్యాయదర్శనముగూడ 'తత్త్వజ్ఞానాత్ నిశ్శ్రేయసాధిగమః' (న్యా. సూ. 1.1.1) అను ప్రథమసూత్రము మూలముననే తత్త్వార్థదర్శనమున కుపయుక్తవిధానము నుపదేశించుచున్నదిగాన దీని దర్శనమనుట సముచితముగ నున్నది.



121. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2 18

# న్యాయదర్శన తాత్పర్యము

'బాధనాలక్షణం దుఃఖం' 'తదత్యంతవిమోక్షః అపవర్గః' (న్యా. సూ. 1.1.21-22) బాధించులక్షణముగల దుఃఖము, దానినుండి సంపూర్తిగ విడిబడుటకు అపవర్గమునాబడు విమోక్షము తత్ప్రాప్తికై 'జ్ఞానగ్రహణాభ్యాసస్తద్విద్యైశ్చ సహ సంవాదః' (న్యా. సూ. 4.2.47) జ్ఞానమునుగూర్చి బోధించు యీవిద్యను పఠించి, 'అప్రతీయమానేఽర్థే ప్రత్యయార్థస్య ప్రవర్తికా జిజ్ఞాసా' (న్యా. భా. 1 1.32) అవ్యక్తార్థ వ్యక్తత్వమునకే ప్రవర్తించుటయే జిజ్ఞాసయగుటచే జిజ్ఞాసబుద్ధి నభ్యసించుటయు, తద్విజ్ఞానులతో జర్చించుటయు నత్యవసరమగుటచే 'తత్త్వజ్ఞానం తు ఖలు మిథ్యాజ్ఞానవిపర్యయేణ వ్యాఖ్యాతం'(న్యా. భా. 1.1.2) మిథ్యాజ్ఞానరాహిత్యమే తత్త్వజ్ఞానమను అర్థముగాన తత్సిద్ధికై 'ప్రమాణ నిగ్రహస్థానానాం తత్త్వజ్ఞానాన్నిఃశ్రేయసాధిగమః' (న్యా. సూ 1.1.1) నిఃశ్రేయసస్థితికారణమగు ప్రమాణాది నిగ్రహస్థానపర్యంత షోడశతత్త్వముల జ్ఞానముగూడ ఆవశ్యకమగుచున్నది. దాని నార్జింప 'తం శిష్యగురు సబ్రహ్మచారి విశిష్టశ్రేయోర్థిభిరనసూయేభిరభ్యుపేయాత్' (న్యా. సూ. 4.2.48) అసూయారహితులగు శిష్యులు, గురువులు, సహపాఠిబ్రహ్మచారులు, శ్రేయోభిలాషులతో జర్చించుటయు ముఖ్యావసరము. అట్టి నిస్స్వార్థులు అనసూయాపరులు లభింపకున్నను, సత్యాపేక్షతో 'ప్రతిపక్షహీనమపి వా

ప్రయోజనార్థమర్థిత్వే' (న్యా. సూ. 4.2.49) ప్రతిపక్షులు లేకున్నను తనకు దానుగా చర్చించుకొనుట అవసరము. అట్టి వాదకాలమున భయలేశముగూడ లేక, 'తత్త్వాధ్యవసాయ సంరక్షణార్థం జల్ప వితండే బీజప్రరోహసంరక్షణార్థం కంటక శాఖా వరణవత్' (న్యా. సూ. 4.2.50) బీజాంకురసంరక్షణార్థమై కంటక శాఖావరణ మేర్పరచుటవలె, దత్త్వార్థరక్షణార్థమై జల్ప వితండ ములగూడ వినియోగింపనగును. 'తాభ్యాం విగృహ్య కథనం' (న్యా. సూ. 4.2.51) జల్పాదిచే పరపక్షకథనమును విగ్రహించి సత్యమును ప్రకటింపవలయును. అందుచేత సాధకుడు 'సమాన ధర్మోపపత్తిః సంశయః' (న్యా. సూ. ఖద్యోత.2.1.1) సమాన ధర్మముల సంయోగబలమున నేర్పడు సంశయమునుండి నైదొలగుటకై 'ప్రమాణైరర్థపరీక్షణం న్యాయః' (న్యా. భా. 1.1.1) ప్రత్యక్షాది ప్రమాణసహాయమున తత్త్వార్థమును బరీ క్షించుటయే న్యాయముగాన, తదంగములగు 'ప్రమాణప్రమేయ సంశయాది' (న్యా. సూ. 1.1.1) జ్ఞానము నార్జించి పరభావ విమర్శనైపుణ్యంబున స్వమతప్రాబల్యము గడించి, 'రాగ ద్వేషమోహాః' త్మక (న్యా. సూ. 4.1.3) దోషవివర్జితముగ 'ప్రవృత్తిః వాగ్బుద్ధిశరీరారంభ ఇతి' (న్యా. సూ. 1.1.17) మనో వాకాయరూప ప్రవృత్తుల బరిశుద్ధిజేసి 'దుఃఖజన్మప్రవృత్తి దోషమిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనంతరాపాయా దపవర్గః' (న్యా. సూ. 1.1.2) దుఃఖ జన్మ ప్రవృత్తిదోష మిథ్యా జ్ఞానములు క్రమక్రమముగా నశింప తత్ఫలితముగ గలుగు అప వర్గను పొంద యత్నింపవలెను అని న్యాయదర్శన ముఖమున గౌతమ మునివరేణ్యుడు మనల నుద్బోధించుచున్నాడు.

అందుచేత సాధకుని మోక్షసాధనాయోగ్యమగు బుద్ధిని సుస్థిరపరుప న్యాయదర్శన మెంతయు నుపయుక్తమగుటచే దీర్ఘ తాపసుడును, మేధాతిథియు, ప్రజ్ఞాధురీణుడును, అగు గౌతమ మహర్షి చంద్రుడు అజ్ఞలోకమునకు దారకముగ దీని ప్రసాదించి పరమ పూజ్య చరితు డగుచున్నాడు. కాన సర్వముముక్షుకోటికి నిది అవశ్య పఠనీయమును అనుష్ఠానయోగ్యమును అగు శాస్త్ర రాజమనుట కెట్టి సంశయమును లేదు. అందు తత్త్వశాస్త్రము నకు ముఖ్యావసరమగు జీవేశ్వరప్రకృతి విషయములగూర్చి అక్షపాదు డెట్లు వివరించి నిర్ణయించెనో చూచెదముగాక.

పూర్వము వచించినట్లుల న్యాయము విచారణావిధాన మునే బోధించు శాస్త్రమగుటచే నిందు తాత్త్వికవిషయ వివ రణము క్రమలీల నుండుటయేగాక తార్కికవిషయములుగను ఉదాహరణములుగను అచ్చటచ్చట గైకొనబడియుండుటచే ఇతర సిద్ధాంతశాస్త్రములవలె నిందు తాత్త్వికవిషయగ్రహణము సులభముకాదు. అందుచే ఆత్మేశ్వరప్రకృతుల పూర్వపూర్వో త్తరముల న్యాయశాస్త్రరీతిగ నవగాహన మొనరింప యత్నించు టయు నసమంజసము. అనుబంధచతుష్టయములగల విషయ మీశాస్త్రమున గౌతమమహర్షి ప్రథమసూత్రముననే వివ రించియున్నచందము తత్త్వజ్ఞానోపయుక్తమగు ప్రమాణాది నిగ్రహస్థానపర్యంత షోడశపదాంశములే సంపూర్ణ గ్రంథార్థ విషయములు. అవ్వానినే న్యాయదర్శనము సమగ్రలీల మీమాంసించి తీర్మానించియున్నది. అందుచే నిది తర్కశాస్త్ర మగునేగాని తత్త్వశాస్త్రము కాదని గ్రాహ్యము. అయినను

యీతర్కమైనను తత్ప్రయోజనముగ నిఃశ్రేయసమునే గైకొని యుండుటచే దత్త్వజ్ఞానమునే పర్యవసానముగా గల్గియుండుటచే దీనికి 'దృశ్యతే తత్త్వమనేన దర్శనం' అనురీతి తత్త్వదర్శన ప్రాభవము గలదిగానుండుటచే, దర్శనముల జేర్పబడియు, బహుళ ప్రాధాన్యతయు నీయబడియుండుట విదితము. ప్రధానాంశము తర్కమైయున్నను, అప్రధానముగనైన కొన్ని తత్త్వవిషయములు అందు జర్చింపబడియుండుటచే గౌతమ అక్ష పాదునకు ఈశ్వరాత్మసృష్టులగూర్చి ఎట్టి అభిప్రాయముగలదో గ్రహించుటయు నవసరము.

---

## ఆత్మ

'తన్నిత్యత్వాత్' (న్యా.సూ. 3.1.5.) ఆత్మ నిత్యమగుట వలన అనుసూత్రముచే నీయాత్మ 'న ఖలు నిత్యం కించిజ్జాయతే మ్రియతే వా ఇతి' (న్యా. భా. 4.1.10) ఏది జనించుచు నశించుచు నుండునో యది నిత్యముకానేరదుకాన అనగా 'అనుత్పత్తి ధర్మకం నిత్యం' (న్యా. భా. 1.1.35) ఉత్పత్తిలేని లక్షణము గలది నిత్యమగుటచే 'జన్మమరణయోర్నిత్యత్వాదాత్మనోనుపపత్తిః' (న్యా. భా. 4.1.10) జన్మమరణములు ఆత్మనిత్యమగుటచే నుండజాలవని గౌతముని భావముగ దేటతెల్లము. అనగ ఆత్మకు జననమరణాదివికారములు లేవనియు నందుచే నిత్యమనియు స్పష్టము. కాని 'యస్య కదాచిత్ భావస్తదనిత్యం' (న్యా. భా.4.1.25) ఏది ఒకకాలమునమాత్రముండునో అది అనిత్యమను

రీతి 'భౌతికం చ శరీరాది అభౌతికం చ బుద్ధ్యాది తదుభయ ముత్పత్తివినాశధర్మకం విజ్ఞాయతే' (న్యా. భా. 4.1.25) భౌతికమగు శరీరాదికము, అభౌతికమగు బుద్ధ్యాదికమును ఉత్పత్తి నాశధర్మములు గలవిగా తెలియబడుచుండ అనుత్పత్తిధర్మకమైన ఆత్మ అనిత్యపదార్థముల గలయుచుండుటచే 'సగుణద్రవ్యోత్పత్తివదుత్పత్తిః' (న్యా. సూ. 3 1.26) గుణాత్మకద్రవ్యముల నాత్మయు నుత్పాద్యమే యగునని సంశయించినచో 'న సంకల్పనిమిత్తత్వాద్రాగాదీనాం' (న్యా. సూ. 3. 1. 27) రాగాదులచే పూర్వానుభూత స్మృతిజనిత సంకల్పమున ద్రవ్యములు ఉత్పన్నములగునుగాని ఆత్మ అట్లు కాకపోవుటచే నిత్యమై ఉత్పాద్యము కానేరదు. అంతియుగాక 'కర్మకారితశ్చేంద్రియాణాం వ్యూహః పురుషార్థ తంత్రః' (న్యా. సూ. 3.1.40) పురుషుని కర్మకారితముల్తై ఇంద్రియాదిసమూహము పురుషార్థములు కావున అనగా నవి ఆత్మకొరకే యేర్పడియుండుటచే వాని కధిష్ఠాతయగు ఆత్మ నిత్యమై యుండవలెను. అందుచేత ఆత్మ నిత్యమై 'విభురాత్మా' (న్యా. భా. 3.2.20) విభువై ఉత్పత్తి నాశ ధర్మకములగు శరీరేంద్రియాదికము అనిత్యమైయున్నను వానితో సంబంధించియుండును.

స్థూలముగ గోచరించు శరీరమే ఆత్మయనుచో 'శరీరదాహే పాతకాభావాత్' (న్యా. సూ. 3 1.4.) శరీరము దహించుటలో జన్మకారణమైన పాతకముల అభావమువలన ముక్తి సిద్ధమగును. మరియు దేహనాశనమున నాత్మయు నశింపవలసియుండును. కాని అట్లు యెద్దియు జరుగుచుండుటలేదు. అందుచే దేహము ఆత్మయనుట అసంగతము. కాని దేహము 'కార్యా

శ్రయ’ము (న్యా. సూ. 3.1.6) కాన ఆత్మకాశ్రయమై ఆత్మకు అపవర్గసాధన కుపయుక్తమగును. మరియు నాత్మ ఇంద్రియములును కాదు. ఎందులకన ‘సవ్యదృష్టస్యేతరేణ ప్రత్యభిజ్ఞానాత్’ (న్యా. సూ. 3.1 7) వామనేత్ర దృశ్యము దక్షిణాక్షిచే గ్రహింపబడుచుండుటచే ననగా నీనేత్రద్వయమునకు నన్యముగ ఆత్మయుండి వాని సహకారమున దృశ్యముల గ్రహించుచుండునుగాన, అనగ విభిన్న నేత్రద్వయము విభిన్న దృశ్యముల గాంచకుండుట ఆత్మ అన్యమై నేత్రాధిష్ఠానమై యుండుటచే నగునుగాన, మరియు నట్లె ‘దర్శనస్పర్శనాభ్యామేకార్థగ్రహణాత్’ (న్యా. సూ. 3.3.1) దృష్టిస్పర్శముల రెండింటచే నొకే వస్తువు గ్రహింపబడుటచే నొకేకర్త రెండింద్రియముల కధిష్ఠానముగ నుండవలయును. అందుచే ఆత్మ యింద్రియేతరమని స్పష్టము. ఇట్లింద్రియములుగాక ‘నాత్మప్రతిపత్తిహేతూనాం మనసి సంభవాత్’ (న్యా. సూ. 3.1.16) ఆత్మప్రతిపాదన హేతువులన్నియు మనస్సున కన్వయించునుగాన ఆత్మ మనస్సు అనిన ‘జ్ఞాతుఃజ్ఞానసాధనోపపత్తేః సంజ్ఞాభేదమాత్రం’ (న్యా. సూ. 3.1.17) గృహీతకు గ్రహణోపకరణ మావశ్యమగుటచే మనస్సు ఆత్మయని సంజ్ఞారూపముగ నందును. నైజమున ఆయా యింద్రియ మెట్లు ఆత్మకు నుపకరణమో అట్లె మనన కార్యోపకరణముగ మనస్సుగూడ నాత్మకు ఉపయుక్తమగును. కావున మనస్సుగూడ ఆత్మ కానేరదు. ఈవిధముగ ఆత్మ దేహేంద్రియ మనముల కన్యమై అధిష్ఠానమై ‘తత్రాత్మా సర్వస్య ద్రష్టా సర్వస్యభోక్తా సర్వజ్ఞః సర్వానుభావీ’ (న్యా. భా. 1.1.9) ఆత్మ

సర్వద్రిష్టయును సర్వభోక్తయును, సర్వజ్ఞమును, సర్వానుభూతి గలదియును అగుచున్నదని న్యాయదర్శన తాత్పర్యము.

ప్రత్యక్షాదిప్రమాణగోచర శరీరేంద్రియము లాత్మ కానిచో ఆత్మయొక్క యునికి ఎట్లు గోచరించును? 'పూర్వాభ్యస్త స్మృత్యనుబంధాత్ జాతస్య హర్షభయశోకసంప్రతిపత్తేః' (న్యా. సూ.3 1.19) పుట్టినశిశువునకు హర్ష భయ శోకములు పూర్వాను భవ స్మృతిజనితముగాన స్మృతి కధిష్ఠానముగ ఆత్మ యుండ వలయునని అనుమానితము. స్మృతిజ్ఞానము అనునది 'తదాత్మ గుణసద్భావాత్' (న్యా. సూ. 3.1.14) ఆత్మ గుణమగుటచే స్మృతిద్వారా ఆత్మ అనుమానింప బడుచున్నది. స్మృతి జ్ఞానమునకు ఆత్మకారణమగు జ్ఞానముగూడ 'జ్ఞానలింగత్వా దాత్మనః' (న్యా. సూ. 2.1.23) ఆత్మకు జ్ఞానము గుణముగాన 'జ్ఞానమాత్మలింగం' (న్యా. భా. 2.1.23) జ్ఞానము ఆత్మలింగము అను సూత్రముల ప్రకారము ఆత్మకు గుణమే యగుచున్నది. మరియు 'పరిశేషాద్యథోక్త హేతూపపత్తేశ్చ' (న్యా. సూ. 3.2.39) పరిశేషన్యాయము ననుసరించి, పూర్వోక్తరీతి జ్ఞానా దులు ఆత్మలక్షణములే యగుచున్నవని సూత్ర తాత్పర్యము. అనగా శబ్దాదిగుణములు చక్షురాదీంద్రియములకు అనుసంధిం పగా మననాదిక్రియలు మనోబుద్ధుల కన్వయింప శేషించిన ఇచ్ఛాద్వేషాదులు ఆత్మలింగములని సూత్రార్థము. అందుచే 'ఇచ్ఛాద్వేషప్రయత్నసుఖదుఃఖజ్ఞానాని ఆత్మనో లింగం ఇతి' (న్యా. సూ. 1.1.10) ఇచ్ఛ ద్వేష యత్న సుఖదుఃఖ జ్ఞానములు ఆత్మధర్మములుగా పరిగణింపబడెను. దీనినిగూర్చియే 'యథా చక్షుషా గంధో న గృహ్యత ఇతి కరణాంతరం ఘ్రాణమేవ....

తథా చక్షురాదిభిః సుఖాదయో న గృహ్యాంత ఇతి కరణాంత రేణ భవితవ్యం' (న్యా. సూ. 3.1.18) ఎట్లు నేత్రముల గంధము గ్రహింపబడక ఘ్రాణమను కరణాంతరముగలదో అట్లే చక్షు రాది యింద్రియములచే సుఖాదులు గ్రహింపబడుట లేదు. కరణాంతరము వాని గ్రహించుట కుండవలెను. అదే ఆత్మయని భాష్యము వచించుచున్నది.

ఇచ్ఛాద్వేషాది ఆత్మగుణములలో నారవదియగు జ్ఞాన మొక్కటిగాక మిగిలిన గుణపంచకము సంసారహేతుకములు. 'పూర్వాభ్యస్తస్మృత్యనుబంధాత్ జాతస్య హర్షభయశోకసంప్రతి పత్తేః' (న్యా. సూ. 3.1.19) పూర్వాభ్యాసము వలన నేర్పడు స్మృతిసంబంధమున శిశువునకు హర్షాదులు గలుగుననియు, 'ప్రేత్యాహారాభ్యాసకృతాత్ స్తన్యాభిలాషాత్' (న్యా. సూ. 3.1.22) జన్మలననుసరించి అనుదెంచు ఆహారాభ్యాసమే శిశువు నకు స్తన్యాభిలాషకారణమనియు ననుసూత్రముల ననుసరించి యోచించుచో జన్మమునకు పూర్వము సంస్కారము గలదనుట తథ్యము. అందుచేతనే 'సోయమాత్మా పూర్వశరీరాను భూతాన్ విషయాన్ అనుస్మరన్ తేషు తేషు రజ్యతే, తథా చాయం ద్వయోర్జన్మనోః ప్రతిసంధిః, ఏవం పూర్వశరీరస్య పూర్వతరేణ, పూర్వతరస్య పూర్వతమేనేత్యాదినాఽనాదిశ్చేత నస్య శరీరయోగః అనాదిశ్చ రాగానుబంధ ఇతి సిద్ధం నిత్యత్వ మితి' (న్యా. భా. 3 1.25) ఆయాత్మ పూర్వశరీరానుభూత విషయసంస్మరణము గావించి వానిలో ఆనందించును. అట్లే అది రెండుజన్మలయొక్క సంధియగును. అదేవిధముగ పూర్వ పూర్వ శరీరానుభవములవలన నీశరీరయోగము అనాదియగు

చున్నది. రాగానుబద్ధముగు అనాదియగుచున్నదని తాత్పర్యము. అనగ పరంపరాగత పూర్వసంస్కారబద్ధుడై ఆత్మ శరీరసంబంధము నేర్పరచుకొనుచున్నాడు. కాననే 'వీతరాగజన్మాదర్శనాత్' (న్యా. సూ. 3.1.25) కోరికలేనివారికి జన్మ లేదు అని సూత్రము. కోరిక రాగానుబద్ధము కావున, రాగము పూర్వసంస్కారాపేక్షికము గావున 'పూర్వకృతఫలానుబంధాత్తదుత్పత్తిః' (న్యా.సూ.3.2.60) పూర్వజన్మకృత ఫలానుబంధము వలన శరీరోత్పత్తి యనియు 'శరీరోత్పత్తినిమిత్తవత్ ... కర్మ' (న్యా. సూ. 3.2.66) కర్మయే శరీరోత్పత్తికారణ మగుచుండుటయు విదితము. కర్మపరిపాకము కొరకు, ఆత్మగుణములగు ఇచ్ఛాదిషట్కము ననుభవించుటకై 'చేష్టేంద్రియార్థాశ్రయః శరీరం' (న్యా. సూ. 1.1.11) క్రియా యింద్రియార్థములకు శరీర మాశ్రయమగుటచే, 'సంయోగోత్పత్తినిమిత్తం కర్మ'(న్యా. సూ. 3.2.66) దేహాత్మసంయోగోత్పత్తికిగూడ గర్మయే కారణమై యొప్పుచున్నది. అంతట 'అంతః శరీరవృత్తిత్వాన్మనసః' (న్యా. సూ. 3.2.23) శరీరమునుండి ప్రవృత్తముకావలసిన మనస్సుతో 'నాత్మమనసోస్సన్నికర్షాభావే ప్రత్యక్షోత్పత్తిః' (న్యా. సూ. 2.1.21) ఆత్మమనముల సంయోగము లేకున్న ప్రత్యక్షానుభూతి కలుగదు గాన, ఆత్మ మనములు మిళితమగుచున్నవి. అంత ఆత్మగత ఇచ్ఛాదిగుణములకు ప్రకోపమేర్పడి 'ప్రవృత్తిః వాగ్బుద్ధిశరీరారంభః' (న్యా.సూ.1.1.17) వాగ్బుద్ధిశరీరాదుల క్రియల బ్రారంభింపజేయు బ్రవృత్తి జనిం

చును. 'ప్రవర్తనాలక్షణా దోషాః' (న్యా. సూ. 1.1.18) ప్రవృత్తిని గలుగజేయునవి దోషములు అను సూత్రప్రకారము 'తత్ త్రైరాశ్యం రాగద్వేషమోహార్థాంతర భావాత్' (న్యా. సూ. 4.1.3) దోషములు రాగద్వేషమోహరూపమున త్రివిధముగ నున్నవి. ఇతరదోషములన్నియు వీనియం దంతర్గతములగును. ఈదోషములు మూడుపక్షములుగ నున్నవి. అందు రాగ పక్షము 'కామో మత్సరః స్పృహా తృష్ణా లోభ ఇతి' (న్యా. భా. 4.1.3) అనునట్లు కామ మత్సర స్పృహా తృష్ణా లోభసంభరితమై యుండును. ద్వేషపక్షము 'క్రోధ ఈర్ష్యాసూయా ద్రోహామర్ష ఇతి' (న్యా భా. 4.1.3) క్రోధ ఈర్ష్య అసూయద్రోహ అమర్షలతో నిండియుండును. మోహపక్షము 'మిథ్యాజ్ఞానం విచికిత్సా మానః ప్రమాద ఇతి' మిథ్యాజ్ఞాన, సంశయ, అహంభావప్రమాదములతో గూడియుండును అనియు, 'ఆసక్తిలక్షణో రాగః, అమర్షలక్షణో ద్వేషః, మిథ్యాప్రతిపత్తిలక్షణో మోహః' (న్యా. భా. 4.1.3) రాగమునకు ఆసక్తి లక్షణమును, ద్వేషమునకు అమర్ష లక్షణమును, మోహమునకు మిథ్యాదృష్టి లక్షణము నుండునని వాత్స్యాయన భాష్యకార వివరణము. 'తేషాం మోహః పాపీయాన్నామూఢస్యేతరోత్పత్తేః' (న్యా. సూ. 4.1.6) మూఢుడు కానివానిలో రాగద్వేషములును ఇతరము గలుగదుగాన మోహము నికృష్టము. అనగ 'అమూఢస్య రాగద్వేషా నోత్పద్యంతే' (న్యా. భా. 4.1.6) మూఢేతరునిలో రాగద్వేషము లుత్పన్నములుకాక ఒక మోహము మాత్రమే యుండునని తాత్పర్యము. 'మోహః పాపః' (న్యా. భా. 4.1.6) అనునట్లు మోహమే పాపము. విషయములందు రంజింప సంక

ల్పము రాగహేతువనియు, కోపనీయసంకల్పము ద్వేషహేతు వగుచున్నదని భావము. అసలు యీదోషబుద్ధి కలుగుటకు 'దోషనిమిత్తం రూపాదయో విషయాః సంకల్పకృతాః' (న్యా. సూ. 4.2.2) పరిత్యక్తాదివిషయములు సుఖదములను సంకల్పమే దోషకారణ మగుచున్నది.

పైవిధాన సర్వదోషకారణముగ బరిణమించిన 'ఇచ్ఛా ద్వేష ప్రయత్న సుఖదుఃఖజ్ఞానాన్యాత్మనో లింగం' (న్యా.సూ. 1.1.10) అనునట్లు ఆత్మగుణములలో 'యజ్జాతీయస్యార్థస్య సన్నికర్షాత్ సుఖమాత్మోపలబ్ధవాన్' (న్యా. భా. 1.1 10) జాతీయ మగు పదార్థములతో సంబంధ మేర్పడిన ఆత్మసుఖము పొందిన వాడగును. అందుచేత 'తజ్జాతీయ మేవార్థం పశ్యన్నుపాదాతు మిచ్ఛతి' (న్యా.భా. 1.1.10) ఆజాతీయమగు అర్థమును గాంచు తోడ దాని బొంద నిచ్ఛ జనించును. ఈసుఖాపేక్షతో నుండు యిచ్ఛ అనేకవిషయములపై వర్తించుచుండును గాన ఆత్మలింగ మగును. ఆయిచ్ఛ కెప్పుడు సుఖసంపాదనకు దేనివలన ఆటంకము కలుగునో దానిపై ద్వేషము సుఖలేమిచే దుఃఖము జనించును. అట్లు జాతీయార్థములు సుఖహేతువులగుటచే దాని దిలకించి 'ఆదాతుం ప్రయతతే' (న్యా. భా. 1.1 4) పొందుటకై యత్నము జరుగును. ఇట్లు సుఖదుఃఖముల రెంటిని అనుభవించుచు, 'బుభుత్సమానః ఖల్వయం విమృశతి కిం స్విదితి విమృశంశ్చ జానీతే ఇదమితి' (న్యా. భా. 1.1 10) ఇది ఏమి అని సంశయించినవాడై, సంశయార్థమును గ్రహించుకొనును. ఇట్లు 'ఇదం జ్ఞానం బుభుత్సా విమర్శాభ్యామభిన్న కర్తృకం

గృహ్యామాణ మాత్మలింగం'(న్యా.భా.1.1.10) అనుభవవిషయ విమర్శాదులచే గలిగిన జ్ఞానమే ఆత్మగుణము, అని భాష్య కారుని వివరణము.

పైనారింటిలో ఆత్మగుణమగు జ్ఞానముమాత్రము ముక్తి హేతువగును. పూర్వోక్త మోహరూప మిథ్యాజ్ఞాన నివృత్తియే తత్త్వజ్ఞానమనునట్లు 'ఆత్మని తావద స్తీతి అనాత్మని అనాత్మేతి' (న్యా. భా. 1.1.2) ఆత్మను గలదిగను, అనాత్మను అనాత్మగను గ్రహించి, 'ఏవం దుఃఖే అనిత్యే అత్రాణే సభయే జుగుప్సితే హాతవ్యే చ యథా విషయం' (న్యా. భా. 1.1.2) అనాత్మ విషయము దుఃఖము, అనిత్యము, అత్రాణము, భయదము నింద్యమై, నశించునదని గ్రహించి, 'అపవర్గే శాంతః ఖల్వయం సర్వవిప్రయోగః సర్వోపరమోఽపవర్గః' (న్యా. భా. 1.1.2.) అపవర్గము శాంతమును, సర్వవిషయ భిన్నమును, సర్వోపరమముగను గ్రహించుటయే జ్ఞానమని యనందగును.

కాని 'అస్యాత్మా ఇత్యాప్తోపదేశాత్ ప్రతీయతే'(న్యా. భా. 1.1.3) ఆయాత్మ ఆప్తోపదేశమువలననే ప్రత్యక్షమగును. 'యుంజానస్య యోగసమాధిజ మాత్మమనసోః సంయోగవిశేషాదాత్మా ప్రత్యక్షం ఇతి' (న్యా భా.1.1.3) సాధకుని యోగ సమాధివలన ఆత్మమనోసంయోగమున ఆత్మ ప్రత్యక్షమగు ననియు భాష్యము. అనగా ఆప్తోపదేశమువలన ధర్మాధర్మ విచక్షణ నార్జించి యోగసాధకుడై యొప్పి ఆత్మమనోసంయోగమున సాధకుడు ఆత్మానుభూతిని ఆర్జించునని యిందలి తాత్పర్యము.

# సృష్టి

పూర్వము వచింపబడియున్న రాగద్వేష మోహరూప దోషత్రయము 'సంసారస్యానాదిత్వాత్ అనాదినా ప్రబంధేన ప్రవర్తంతే' (న్యా. భా. 4.1.2) సంసార మనాదియగుటచే అనాది నుండి ప్రవర్తించుచున్నదై 'మోహపక్షే మిథ్యాజ్ఞానం విచికిత్సా మానః ప్రమాదః ఇతి' (న్యా. భా. 4.1 3.) మోహపక్షము మిథ్యాజ్ఞాన విచికిత్సా మానప్రమాదములు గల్గుటచే అందు 'యత్ర మిథ్యాజ్ఞానం తత్ర రాగద్వేషావితి' (న్యా. భా. 1.1.18) ఎచ్చట మిథ్యాజ్ఞానముండునో అచ్చట రాగద్వేషములుండును గాన, ఆరాగద్వేషజన్యమగు ప్రవృత్తిమూలమున 'ప్రవృత్తి ర్వాగ్బుద్ధిశరీరారంభః' (న్యా. సూ. 1.1.17) అను సూత్ర విధాన వాక్ బుద్ధి శరీరాదు లారంభింపబడుచున్నవి. 'పునరుత్పత్తిః ప్రేత్యభావః' (న్యా. సూ. 1.1.9) అనురీతి పునరుత్పత్తి హేతువుచే బూర్వజన్మ గలదు గాన 'పూర్వకృతఫలాను బంధాత్త దుత్పత్తిః' (న్యా. సూ. 3.2.60) ఆపూర్వజన్మకృత కర్మఫలాను బంధముచే నుత్పత్తి శరీరమునకు గలుగును. ఆపూర్వజన్మగత మగు 'వివిధబాధనాయోగాత్ దుఃఖమేవ జన్మోత్పత్తిః' (న్యా. సూ. 4.1.55) వివిధ భాధనాసంబంధముచే దుఃఖమే జన్మ కారణమై శరీరేంద్రియ బుద్ధుల నుత్పత్తి గావించుచున్నది. బాధనారూపముగూడ 'వివిధా చ బాధనా, హీనా మధ్యమా ఉత్కృష్టా చేతి' (న్యా. భా. 4.1.55) వివిధమై హీన మధ్యమ ఉత్కృష్టరీతిగ నున్నది. అందు 'ఉత్కృష్టా నారకిణాం తిర శ్చాం తు మాధ్యమా, మనుష్యాణాం హీనా, దేవానాం హీన

తరా వీతరాగానాం చ' (న్యా. భా. 4.1.55) నరకజీవులకు అధికముగను, తిర్యగాది జంతువులకు మధ్యమముగను, మనుష్యులకు అల్పముగను, దేవ వీతరాగులకు అత్యల్పముగనుండుచు తత్త్సంబంధ శరీరాదుల నుద్భవింపజేయుచుండును. ఈశరీరోత్పత్తికి పైకారణములే ప్రధానముగాని 'నోత్పత్తినిమిత్తత్వాన్మాతాపిత్రోః' (న్యా. సూ. 3.2 63) 'తథాఽఽహారస్య' (న్యా. సూ. 3.2.64) మాతాపితృలును ఆహారమును నిమిత్తములు కావని సూత్రార్థము.

పైవిధానమున నుద్భవించిన శరీరమునకు 'పృథివ్యాపస్తేజో వాయురాకాశమితి భూతాని'(న్యా సూ. 1.1.13.) అనబడు పంచమహాభూతములుగూడ స్థూలముగ కారణమగును. 'గంధరసరూప స్పర్శశబ్దానాం స్పర్శపర్యంతాః పృథివ్యాః' (న్యా. సూ. 3.1.64) గంధరసరూపశబ్దము లనబడు భూతగుణములలో శబ్దముకాక స్పర్శమువరకు పృథ్వీలక్షణములు. అనగా నాకాశలక్షణమగు శబ్దము పృథ్వియందుండదని తాత్పర్యము. అట్లే 'అప్తేజోవాయూనాం పూర్వంపూర్వమపోహ్యాకాశస్యోత్తరః' (న్యా. సూ. 3.1.65) గుణముల నొక్కొక్కదాని బరిత్యజింపగా జలానలానిలాభూతగుణము లేర్పడుచున్నవి. పరిశేషన్యాయమున గడపటిదగు శబ్దము గగనమునకు మాత్రముండును. 'వాయుః స్పర్శవ్యంజికః ఆపో రసవ్యంజికాః తేజోరూప వ్యంజికం పార్థివం కించిద్ ద్రవ్యం కస్యచిత్ ద్రవ్యస్య గంధవ్యంజికం' (న్యా. భా. 3.1.63) అనురీతి వాయువు స్పర్శమును, ఉదకము రసమును, తేజస్సు రూపమును పృథ్వి గంధమును ప్రత్యేక,

లక్షణములుగ గలిగియున్నవి. ఈభూతగుణములే యింద్రియ ములకు లభించియున్నవనియు వాత్స్యాయన భాష్యము. కాని 'పార్థివం గుణాంతరోపలబ్ధేః' (న్యా. సూ. 3.1.28) పృథ్వీగుణ ప్రాబల్యమున శరీరము అధికముగ పార్థివముగనే తోచినను, 'గంధక్లేదపాకవ్యూహావకాశదానేభ్యః పాంచభౌతికం' (న్యా. సూ. 3.1.31) గంధ, స్నేహము, జీర్ణశక్తి, రక్తపరిసరణము, అవకాశములునుండుటని 'పంచానాం భూతానాం సంయోగే సతి శరీరం భవతి' (న్యా. భా. 3.1.28) పంచభూతసంయోగ ముండుటచేతనే శరీరము గలుగును.

'అస్తి చాయమింద్రియాణాం భూతగుణవిశేషోపలబ్ధి నియమః' (న్యా. భా. 3.1.63) అనురీతి ఇంద్రియములకు భూత గుణప్రాప్తి గలుగుటయే నియమమగుట 'ఇంద్రియార్థపంచ త్వాత్' (న్యా. సూ. 3.1.58) ఇంద్రియార్థములగు శబ్దాదులు అయిదగుటచే నింద్రియములు అయిదుగనున్నవి. 'సగుణానా మింద్రియాభావాత్' (న్యా. సూ. 3.1.72) గుణవిశిష్టత్వము చేతనే యవి యింద్రియములని యనబడుటచే 'భూతగుణవిశేషో పలబ్ధేస్తాదాత్మ్యం' (న్యా. సూ. 3.1.63) భూతగుణముల గలిగి యుండుటచే నింద్రియములు భూతపరములైయుండి, నాయా యింద్రియములకు గంధరసరూపస్పర్శశబ్దములలో 'పూర్వ పూర్వగుణోత్కర్షాత్తత్ప్రధానం' (న్యా. సూ. 3. 1. 70) ఒకొక్కభూతమున నొకొక్క గుణప్రాధాన్యతచే నాభూత సంబంధ గుణానుగుణముగ నాయాయింద్రియ మేర్పడుచున్నది. అనగా గంధప్రాధాన్యతగల పృథ్విని గంధలక్షణముగల నాసి

కేంద్రియము గ్రహించుచున్నది. అట్లే యితరేంద్రియముల ప్రవృత్తులును గ్రాహ్యము. అందుచేతనే 'ఘ్రాణరసనచక్షు స్త్వక్ శ్రోత్రాణి ఇంద్రియాణి భూతేభ్యః' (న్యా.భా. 1.1.12) ఘ్రాణాది యింద్రియములు ఒక్కొక్కటిగ భూతజన్యములుగా వచింపబడినవి. 'జిఘ్రత్యనేన ఘ్రాణం గంధం గృహ్ణాతీతి రసయత్యనేనేతి రసనం రసం గృహ్ణాతీతి। చేష్టేऽనేనేతి చక్షూ రూపం పశ్యతీతి। త్వక్ స్థాన మింద్రియం త్వక్। తదుపచారః స్థానాదితి। శృణోత్యనేనేతి శ్రోత్రం శబ్దం గృహ్ణాతీతి' (న్యా. భా. 1.1.12) గంధమును ఆఘ్రాణించుటచే ఘ్రాణమనియు, రసమున్గ్రహించునుగాన రసనమనియు, రూపగ్రహణముగావించు టచే చక్షువనియు ఉపచారస్థానము గలదగుటచే త్వక్కనియు, శబ్దమును శ్రవణము చేయునుగాన శ్రోత్రమనియు నామములని వాత్స్యాయన వివరణము తెలుపుచున్నది. ఆయాయింద్రియ ములు ఆయాగుణగ్రహణము గావించునేగాని 'స్పర్శనేనేంద్రి యేణ స్పర్శగ్రహణే సతి న తేనైవ రూపం గృహ్యత ఇతి' (న్యా. భా. 3.1.58) స్పర్శేంద్రియముచే స్పర్శగ్రహణమే గలు గునుగాని రూపగ్రహణము కానేరదు. అనగా నాయా యింద్రియము ఆయాగుణములమాత్రమే గ్రహించును గాని యితరభూతగుణముల గ్రహింపనేరదని భావము. ఇట్లు పంచేంద్రియములు 'భోగాయతనం శరీరం' (న్యా. భా. 1.1.9) భోగముల కాధారము శరీరమనియు, 'చేష్టేంద్రియార్థాశ్రయః శరీరం' (న్యా. భా. 1.1.11) ఇంద్రియార్థక్రియలకు ఆశ్రయ మైన శరీరమును ఆశ్రయించుకొనియుండును.

అయినను, పంచేంద్రియప్రవృత్తికి 'నాత్మమనసో స్సన్నికర్షాభావే ప్రత్యక్షోత్పత్తిః' (న్యా. సూ. 2.1.21) ఆత్మ మనో సంబంధము లేకున్న దర్శనాదిప్రవృత్తు లేర్పడవనురీతి ప్రత్యక్షజ్ఞానోత్పత్తికి ఆత్మమనముల సంబంధ మత్యంతావసరము. రెండింటి సంబంధమనుతోడనే వాని అన్యత్వము స్ఫురించురీతి నచ్చోట ఆత్మమనముల అన్యత్వము స్పష్టము. 'యుగపత్ జ్ఞానానుత్పత్తిః మనసో లింగం' (న్యా. సూ. 1.1.16) ఒక్కొక్క కాలమున ఒక్కొక్క జ్ఞానమునుమాత్రమే ఆత్మకొసంగుట మనస్సుయొక్క లక్షణముగాన 'జ్ఞానాయౌగపద్యాదేకం మనః' (న్యా. సూ. 3.2.56) ఏకజ్ఞానస్ఫురణముచే నేకమై 'యథోక్త హేతుత్వాచ్చాణు' (న్యా. సూ. 3 2.59) పూర్వోక్తకారణములవలన అణువై 'అంతః శరీరవృత్తిత్వాత్ మనసః' (న్యా. సూ. 3.2.26) అంతఃశరీరానువర్తియై మనస్సు ఆత్మ కుపయుక్తమగుచుండును. అనేకేంద్రియజన్యమగు వివిధజ్ఞానముల మనస్సు ఒకేకాలమున గ్రహించినట్లు తోచునుగాని 'అలాతచక్రదర్శనవత్తదుపలబ్ధిరాశుసంచారాత్' (న్యా. సూ. 3.2.58) అలాతచక్రమువలె మనస్సుగూడ త్వరితగతి సంచరించుటచే అట్లు తోచుచున్నది. కాని 'పారతంత్ర్యాత్ అకృతభాగ్యమాత్' (న్యా. సూ. 3 2.38) మనస్సు ఆత్మకుచెంది పరతంత్రమగుటచే ఫలభోక్తృత్వమును అది పొందజాలదు. అందుచే ఆత్మకు మనస్సు యింద్రియములమూలముగ జ్ఞానోపలబ్ధినికలుగజేయుచున్నది. 'ఆత్మా మనసా సంబధ్యతే, మన ఇంద్రియేణ'

ఇంద్రియం సర్వార్థైః సన్నికృష్టమితి ఆత్మేంద్రియమనోఽర్థ సన్నికర్షేభ్యో యుగపత్ గ్రహణాని స్యుః।'(న్యా. భా. 3.1.56) ఆత్మ మనస్సుచే సంబంధమునొందును. మనస్సు యింద్రియ ములచేతను,విషయార్థములచే నింద్రియములును సంబంధించునని అర్థము.అట్లు ఆత్మయే మనస్సుయింద్రియార్థముల కలియికచే ఒకే కాలమున గ్రహణము గావించును. 'నేంద్రియార్థయోస్తద్వినా శోపి జ్ఞానావస్థానాత్' (న్యా. సూ. 3.2.18) ఇంద్రియములు తదర్థములుగూడ నశించినను జ్ఞానముండుటచే నది ఇంద్రియాదు లకు జెందనిదై, 'న మనసః' (న్యా.సూ. 3.2.19) మనస్సునకు కూడ అన్వయింపక నిత్యస్వభావముగల్గియున్న ఆత్మకే చెంది యున్నది.

ఇంతవరకు వివరింపబడిన సృష్టికి భూతాదిమనోపర్యం తము నాధారముగ ఉపాదానముగ 'పరం వా త్రుటేః' (న్యా.సూ. 4.2.17) విభజనమున కతీతమగు అణుసముదాయ మున్నది. ఆయణువు 'అతీంద్రియత్వాదణూనాం' (న్యా.సూ. 2.1.36) ఇంద్రియగోచరముగాక యొప్పారుచున్నది. అట్లు గోచరింపనిది కాకపోయినను 'నాణు నిత్యత్వాత్' (న్యా.సూ. 2.2 24) అణువు నిత్యమైనదిగా నుండును. ఆయణుసముదా యము పరిమండలమనబడుచు సర్వసృష్టికి ఉపాదానకారణ మగుచున్నది.

ఇట్లు అణునిర్మితమైన సృష్టి ప్రత్యక్షాదిప్రమాణగోచ రముగాన నది శూన్యముకాదు. 'స్వప్నవిషయాభిమానవద యం ప్రమాణప్రమేయాభిమానః' (న్యా. సూ. 4. 2. 31)

పరిమాణపరిమేయాదులు స్వప్నతుల్యమనియు 'మాయాగంధర్వనగర మృగతృష్ణికావద్వా (న్యా.సూ. 4.2.32.) మాయయనియు, గంధర్వనగరము, మృగతృష్ణవంటిదని యనుటయు 'హేత్వభావాదసిద్ధిః' (న్యా. సూ. 4.2.33) సరియగు కారణము గానుపింపమిచే యథార్థముగాదు. అనగా సృష్టి సత్యమైనదేయని తాత్పర్యము.

---

## అపవర్గము

పూర్వోక్తచందము ఆత్మగుణషట్కములో జ్ఞానము రాజిల్లుచు, పరివృత్తికాలమున రాగాదికమున కుపయుక్తమై ప్రాపంచికానుభూతిని ఆత్మకు లభింపజేయును. మరల 'బాధనాలక్షణం దుఃఖం' (న్యా. సూ. 1.1.21) బాధించులక్షణమైన దుఃఖమేగాక, 'దుఃఖవికల్పే సుఖాభిమానాచ్చ' (న్యా. సూ. 4.1.58) దుఃఖమునకు నామాంతరమైన సుఖముగూడ దుఃఖమేయగుట గాంతుము. ఎట్లన యథార్థముగ సుఖమన పరమపురుషార్థమే యయినను, సుఖమే నిశ్శ్రేయసమై యుండినను, మిథ్యా సంకల్పవిశేషముచే సుఖముకొరకై విషయముల రక్తికముకాగా విషయసుఖము గలుగును. ఆసుఖముమూలమున జన్మజరా వ్యాధిమొదలగు అనేకవిధములగు దుఃఖము కలుగుటచే 'తం దుఃఖవికల్పం సుఖమిత్యభిమన్యంతే' (న్యా. భా. 4.1 58)ఆదుఃఖ రూపమును సుఖమని అభిమానించుచున్నారు. అనగా విషయ సుఖము దుఃఖరూపమేయగుటచే 'వివిధబాధనాయోగాత్ దుఃఖ

మేవ జన్మోత్పత్తిః' (న్యా. సూ. 4.1.55) వివిధబాధాయుతము గాన దుఃఖమే దుఃఖకారణమై జన్మనే బాధాయుత మొనర్చు చున్నది.

అందుచే 'దోషనిమిత్తానాం తత్త్వజ్ఞానాదహంకారనివృత్తిః' (న్యా సూ. 4.2.1.) దోషకారణముల యథార్థతత్త్వజ్ఞాన మువలన అహంకారము నివృత్తమగును. రాగద్వేష మోహములే దోషములని పూర్వమే గ్రహించియుంటిమి. అవి సంసారహేతుకములు. అందుచే వాని జ్ఞానమువలన వాని కాధారమైన అహంకారము అదృశ్యమగును. సర్వానర్థహేతు వగు మోహమే 'అహమస్మీతి మోహోఽహంకార ఇతి' (న్యా. భా. 4.2.1.) అనుసరించి అహంకార మనబడుచున్నది. అహంకారమనగ 'అనాత్మానం ఖల్వహమస్మీతి పశ్యతో దృష్టి రహంకారః' (న్యా. భా. 4.2.1) అనాత్మయగు శరీరేంద్రియా దుల తానుగా చూచుదృష్టియే యహంకారమని భాష్యనిర్వచ నము. 'కిం పునస్తన్మిథ్యాజ్ఞానం? అనాత్మన్యాత్మగ్రహః' (న్యా. భా. 4.2.1) మరల మిథ్యాజ్ఞానమేది? అనాత్మను ఆత్మగ గ్రహించుటయని వాత్స్యాయన వాక్యము. ఈమిథ్యాజ్ఞానమే సంసారబీజముగనున్నది. ఆమిథ్యాజ్ఞాననివారణమునకు 'తదిదం తత్త్వజ్ఞానం తద్విషయ ముత్పన్నమహంకారం నివర్తయతి' (న్యా.భా.4.2.1.) దేని కలిమివలన అహంకారము నివర్తించునో అది తత్త్వజ్ఞానమని నిర్వచనము. అట్టి తత్త్వజ్ఞానము వలన దుఃఖ జన్మప్రవృత్తిదోషమిథ్యాజ్ఞానరహితమగు అపవర్గము ప్రాప్తిం చునుగాన 'మిథ్యోపలబ్ధి వినాశః తత్త్వజ్ఞానాత్' (న్యా. సూ. 4.2.35) తత్త్వజ్ఞానముచే మిథ్యాజ్ఞానము నశించునని చెప్పబడి

యున్నది. 'యదా తు తత్త్వజ్ఞానాన్మిథ్యాజ్ఞానమపైతి, తదా మిథ్యాజ్ఞానాపాయే దోషా అపయంతి, దోషాపాయే ప్రవృత్తిరపైతి, ప్రవృత్త్యపాయే, జన్మాఽపైతి, జన్మాపాయే దుఃఖమపైతి, దుఃఖాపాయే చ ఆత్యంతికోపవర్గో నిఃశ్రేయసమితి' (న్యా.భా.1.1.2) తత్త్వజ్ఞానమువలన మిథ్యాజ్ఞానము నశించును. అంత దోషములు నశించును. అందుచే ప్రవృత్తి లోపించును, దాన జన్మ కలుగదు, జన్మ నశింపగా దుఃఖనిరాసము కలుగును, దుఃఖరాహిత్యము నిఃశ్రేయసమగు అపవర్గము ప్రాప్తించు నని భాష్యకారులు వివరించియున్నారు. 'తత్త్వజ్ఞానాచ్చ మోహనివృత్తౌ రాగద్వేషానుత్పత్తి రిత్యేకప్రత్యనీకభావోత్పత్తిః ఏవం చ కృత్వా తత్త్వజ్ఞానాత్ దుఃఖజన్మప్రవృత్తిదోష మిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనంతరం భావా దపవర్గ' (న్యా. భా. 4.1.6) తత్త్వజ్ఞానమువలన వరుసగా ఉత్తరోత్తరాపాయమువలన దుఃఖజన్మప్రవృత్తిదోష మిథ్యాజ్ఞానములు అంతర్హితములగును. అంత అపవర్గము చేకూరును అనియు భాష్యకార వివరణము.

'సమాధి విశేషాభ్యాసాత్' (న్యా సూ.4.3.38) ప్రత్యేక సమాధి అభ్యాసము వలన తత్త్వజ్ఞానము స్థిరపడును. 'నిద్రా విక్షేపాది దోషవినిర్ముక్తః సమాధిః' (న్యా. భా. ఖద్యోత- 4.2.38) నిద్రాది దోషరహితస్థితియే సమాధి యని నిర్వచింపబడుచున్నది. 'అయమాత్మా యస్మాదేకస్మిన్ శరీరే ధర్మం చరిత్వా...స్వర్గ దేవేషూపపద్యతే, అధర్మం చరిత్వా...నరకేషూపపద్యతే' (న్యా. భా. 3.2.39) ఆత్మ ధర్మమున బ్రవర్తించుచో స్వర్గమును అధర్మప్రవర్తనమున నరకమును బొందుటచే

దోషవివర్జితత్వమునొంద 'న ప్రవృత్తిః ప్రతిసంధానాయ హీన క్లేశస్య' (న్యా సూ. 4.1.64) క్లేశములు నశించినవాని ప్రవృత్తి నాశమునకు దారిదీయదు కాన ప్రథమతః క్లేశనాశము గావింప వలెను. అనగా రాగద్వేషాదుల నశింపజేయువలెనని తాత్పర్యము. దానికై 'జన్మన ఏవేదం స సుఖసాధనస్య దుఃఖానుషంగాత్ దుఃఖేనాఽవిప్రయోగాద్వివిధబాధనాయోగాత్ దుఃఖమితి సమాధిభావన ముపదిశ్యతే' (న్యా.భా. 1.1.9) జన్మమున సుఖసాధనమునకు దుఃఖము అంటియుండుటయు దానినుండి విడివడకుండుటయు నను ద్వివిధబాధలవలన దుఃఖమే జన్మమని సమాధిభావన జనించును. 'సమాహితో భావయతి,భావయన్నిర్విద్యతే,నిర్విణ్ణస్యవైరాగ్యం, విరక్తస్యాఽపవర్గ ఇతి'(న్యా.భా. 1.1.9)అట్లు సమాహితచిత్తమున భావింప భయ ముద్భవించును. దాన వైరాగ్యమును వైరాగ్యముచే అపవర్గమును గలుగునని భాష్యవచనము. 'మిథ్యాజ్ఞానాత్సంసార'మును'తత్త్వజ్ఞానాదపవర్గ'ము గలుగునని యర్థము. ఇట్టి సమాధిస్థితియైనను 'పూర్వకృతఫలానుబంధాత్ తదుత్పత్తిః' (న్యా. సూ. 4.2.41) అనురీతి పూర్వజన్మకృత ఫలానుబంధముచేతనే కలుగును. దాని నభ్యసించుటను 'అరణ్యగుహాపులినాదిషు యోగాభ్యాసోపదేశః' (న్యా. సూ. 4 2.42) అరణ్యము గుహ ఇసుకదిబ్బలపై యోగాభ్యాసము చేయవలెనని బోధించుచున్నది 'తదర్థం యమనియమాభ్యామాత్మసంస్కారో యోగాధ్యాత్మ విధ్యుపాయైః' (న్యా. సూ.4.2.46) యమనియమాభ్యాసములచే ఆత్మ సంస్కరణము గావించుచు విధికృత్యముల నవలంబింపవలయును.

అనగా 'త్రయో ధర్మస్కంధా యజ్ఞోఽధ్యయనం దానమితి, ప్రథమ స్తప ఏవ ద్వితీయో బ్రహ్మచర్యాచార్యకులవాసీతి, తృతీయోఽత్యంతమాత్మాన మాచార్యకులేఽవసాదయన్ సర్వే ఏతేనైతి పుణ్యాలోకా భవంతి బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి' (న్యా. భా. 4 1.60) ధర్మము త్రివిధము. యజ్ఞ అధ్యయన దానము లనబడును. మొదటిది తపము, రెండవది ఆచార్యకులవాస మగు బ్రహ్మచర్యము, తృతీయము ఆచార్యసన్నిధానమున సర్వ దోషముల నిర్మూలింపగ పుణ్యాలోకప్రాప్తి బ్రహ్మసంస్థితియగు అమృతత్వమును గలుగును. ఈ 'జ్ఞానగ్రహణాభ్యాస స్తద్విద్యైశ్చ సహ సంవాదః' (న్యా.సూ. 4.2.47) అపవర్గలాభము నకై న్యాయవిద్య నభ్యసించి అనుష్ఠించి, తద్విద్వాంసులతో జర్చించుచుండవలెను. అదియునుగూడ అనసూయాపరుల తోడనే పరిసంగింపవలయుననియు నాదేశింపబడియున్నది. ఈ విధముగా సమాధిసాధన సద్గురుసన్నిధానమున గావింప అప వర్గము గలుగును.

'తదత్యంతవిమోక్షోఽపవర్గః' (న్యా. సూ. 1.1.22) సర్వబాధా కారణమగు దుఃఖమునుండి విమోక్షమే అపవర్గమని తాత్పర్యము. దీననే 'దుఃఖాదీనామపవర్జన మపవర్గః' (అమర కోశ 1.145) దుఃఖాదులను నశింపజేయుటే అపవర్గమని అమర వాక్యము. అదియే మోక్షమనియు ననబడును. అనగా నిందు దుఃఖకారణములగు జన్మప్రవృత్తిదోష మిథ్యాజ్ఞానములు గూడ సమసిపోవును. 'సుషుప్తస్య స్వప్నాదర్శనే క్లేశభావ వదపవర్గః' (న్యా. సూ. 4.1.63) అచ్చట స్వప్నాదులులేక

సుషుప్తియందుండువాని కెట్టి క్లేశాదులులేవో అట్టులే అపవర్గమునందును క్లేశాదులు అభావమగును. క్లేశములు లేకపోగా 'న ప్రవృత్తిః ప్రతిసంధానాయ హీనక్లేశస్య' (న్యా. సూ. 4.1.64) హీనక్లేశునకు ప్రవృత్తియు గలుగదు. అట్టి పరమశ్రేయోప్రాప్తిరూప నిశ్శ్రేయసస్థితిని బొందుటయే అపవర్గము నాబడును. అందు ఋణత్రయము పూర్వమే 'బ్రహ్మచర్యేణ ఋషిభ్యో, యజ్ఞేన దేవేభ్య, ప్రజయా పితృభ్య' బ్రహ్మచర్యముచే ఋషులయొక్కయు, యజ్ఞాదులచే దేవతల యొక్క, సంతానముచే పితృదేవతలయొక్క ఋణములు నశించెను గాన అపవర్గమున నవియు అభావమే యగును. కాన పై ప్రవృత్తుల కన్నింటికి నాధారభూతమైన ఆశ్రయమై శరీర మనస్సులును వాని సంయోగములునుగూడ 'తదభావశ్చాపవర్గః' (న్యా. సూ. 3. 2. 25) అనురీతి అపవర్గమున లేకుండును. దీని నంతటిని వాత్స్యాయనుడు చక్కగ యిట్లు వివరించి యున్నాడు. 'కామవిషయా ఇంద్రియార్థా ఇతి రూపాదయ ఉచ్యంతే, తే మిథ్యాసంకల్ప్యమానా రాగద్వేషమోహాన్ ప్రవర్తయంతే' (న్యా. భా. 4.2.2) కామవిషయములగు ఇంద్రియార్థములే రూపాదులనబడును. అవి మిథ్యాసంకల్పములు కాగా రాగద్వేషమోహములను ప్రవర్తింపజేయును. 'తాన్ పూర్వం ప్రసంచక్షీత తాంశ్చ ప్రసంచక్షాణస్య రూపాదివిషయో మిథ్యాసంకల్పో నివర్తతే। తన్నివృత్తావధ్యాత్మం శరీరాది ప్రసంచక్షీత। తత్ప్రసంఖ్యానాదాధ్యాత్మవిషయోఽహంకారో

నివర్తతే। సోఽయ మధ్యాత్మం బహిశ్చ వివిక్తచిత్తో విహరన్ ముక్త ఇత్యుచ్యతే।' (న్యా. భా. 4.2.2) ముందు వానిని పరిశీలింపవలెను. వాని పరిశీలింపగా రూపాది విషయములతో గూడిన మిథ్యాసంకల్పము నివర్తించును. అది నివర్తింపగా తనవియగు శరీరాదుల ధ్యానింపవలెను. అట్లు ధ్యానింపగా వానికంటెయుండు అహంకారము నశించును. ఇట్లు బాహ్యాంతరముల బరిశీలించి విరక్తచిత్తుడై విహరింపగా వాని ముక్తుడందురు. అట్టి స్థితియే సర్వసంసార కారణరహితస్థితియే సంపూర్ణ శ్రేయో విభూతియగు నిశ్శ్రేయసస్థానము.

---

## ఈశ్వరుడు

మొత్తము న్యాయదర్శన పంచశతాధికసూత్రములలో నాలుగుసూత్రములలోమాత్రమే ఈశ్వరప్రస్తావన గలదు. అందు గూడ సూత్రత్రయము పూర్వపక్షపరము. కాన సిద్ధాంతము నకు ఈశ్వరపరసూత్రము ఒక్కటిమాత్రమే యగుచున్నది. అందుచే న్యాయదర్శనము ఈశ్వరప్రసక్తి కెట్టి ప్రాధాన్యతయు నివ్వక న్యాయాంతర్భాగములగు పదునారు తత్త్వముల బోధించుచు, న్యాయమందు అవర్ణితాంశములకై 'తత్ప్రామాణ్యా మాప్తప్రామాణ్యాత్' (న్యా.సూ. 2.1.68) ఋషుల ప్రామాణ్యతవలన వేదమే ప్రమాణముగాన అందు చూడదగునని యన్నటుల గౌతముడు సూత్రరచనము గావించి తృప్తి చెందెను.

అనగా ఈశ్వరాది ప్రతిపాదనవిషయము తన దర్శనవిషయము కాకుండుటచే అందరికి ప్రామాణ్యము నార్జించిన వేదమునే చూడు డని ఆతని సలహా. కాని ఉత్పత్తివిషయ చర్చాసందర్భమున నశించినవానినుండి ఉత్పత్తి అసంబద్ధమని వచించుచు, 'ఆత్మ నిత్యత్వే ప్రేత్యభావ సిద్ధిః' (న్యా. సూ. 4.1.10) ఆత్మ నిత్య మగుటచే పునర్జన్మ సాధ్యమని తెలుపగా, ఉత్పత్తి నశ్వరము నుండి కలుగునని పూర్వపక్షము వచ్చెను. 'న వినష్టేభ్యోఽ నిష్పత్తేః' (న్యా. సూ. 4.1.17) నశించువానినుండి పుట్టుక కలుగనేరదని సిద్ధాంతము చేయును. అట్లు ఉత్పత్తికారణము మాతాపితలును, ఆహారమునుగూడ కాదని తీర్మానించుచు సృష్టికి 'పూర్వకృతఫలానుబంధాత్తదుత్పత్తిః' (న్యా. సూ. 3.2.60) పూర్వజన్మకృత కర్మయే ఉత్పత్తికి కారణముగ దర్శ నము తీర్మానించును.

కాని యీకర్మమాత్రమే దేహోత్పత్తికి కారణముగాదని నిశ్చయించుటకై 'ఈశ్వరః కారణం పురుషకర్మాఫల్యదర్శనాత్' (న్యా. సూ. 4.1.19) మానవకర్మ ఫలవంతము కాకుండుటయు కలదుగాన ఈశ్వరుడే కర్మఫలప్రదాత యను సూత్రమును దర్శనకర్త ప్రవేశపరచెను. ఈయర్థమును 'తత్కారితత్వా దహేతుః' (న్యా. సూ. 4.1.21) కర్మఫలప్రదాత ఈశ్వరుడగు టచే ఉత్పత్తికి మానవకర్మమాత్రమే కారణము కాజాలదని సిద్ధాంతము చేసెను. పూర్వసూత్రమున దీని వివరించుచు 'పురుషోఽయం సమీహమానో నావశ్యం సమీహాఫలం ప్రాప్నోతి తేనానుమీయతే పరాధీనం పురుషస్య కర్మఫలారా

ధనమితి, యదధీనం స ఈశ్వరః। తస్మాదీశ్వరః కారణమితి' (న్యా. భా. 4. 1. 19) పురుషుడు వాంఛించియు కర్మఫలమును బొందుటలేదు. అందుచే పురుషకర్మఫలము పరాధీనమై యున్నదని అనుమానితము. ఎవరికది అధీనమో అతడే ఈశ్వరుడు. అందుచే ఈశ్వరుడు ఉత్పత్తికి పరమకారణమని సిద్ధాంతము అని భాష్యకారులైన వాత్స్యాయనుడు సూత్రమును వివరించిరి. 'గుణవిశిష్టమాత్మాంతర మీశ్వరః' (న్యా భా.4.1.21) గుణముల గల ఆత్మకంతరుడై ఈశ్వరు డుండుననియు, 'అధర్మమిథ్యాజ్ఞాన ప్రమాదహాన్యా ధర్మజ్ఞానసమాధిసంపదా చ విశిష్ట మాత్మాంతర మీశ్వరః' (న్యా.సూ.4.1.21.) అధర్మాదులు నశింపగా ధర్మజ్ఞానసమాధి సంపదలతో గూడి ఆత్మాంతరుడైనవాడు ఈశ్వరుడనియు, 'తస్య చ ధర్మసమాధిఫలమణిమాద్యష్టవిధమైశ్వరం' (న్యా. సూ. 4.1.21) ధర్మసమాధిఫలరూపమైన అష్టసిద్ధులను ఈశ్వరునకు గలవనియు, మరియు 'ప్రత్యాత్మవృత్తీన్ ధర్మాధర్మసంచయాన్ పృథివ్యాదీని చ భూతాని ప్రవర్తయతి' (న్యా. భా. 4.1.21) సర్వాత్మలవృత్తులను ధర్మాధర్మసంచయమును, పంచభూతముల నతడు ప్రవర్తింపజేయుననియు వాత్స్యాయనుడు వివరించెను. అంతియగాక 'యథాపితాఽపత్యానాం తథా పితృభూత ఈశ్వరో భూతానాం' (న్యా.భా. 4.1.21) శిశువులకు తండ్రి ఎట్లుకారణమో అట్లు భూతములకు ఈశ్వరుడు కారణమనియు 'ఆగమాచ్చ ద్రష్టా బోద్ధా సర్వజ్ఞతా ఈశ్వర ఇతి' (న్యా.భా. 4.1.21) ఆగమములకు ద్రష్టయు బోధకుడును సర్వజ్ఞుడును ఈశ్వరుడు అగుచున్నాడు. 'బుద్ధ్యాదిభి శ్చాత్మలింగైర్నిరుపాఖ్యమీశ్వరం ప్రత్య

త్యానుమానాగమ విషయాతీతం కః శక్త ఉపపాదయితుం'(న్యా. భా. 4 1.21) ఆత్మలింగములైన బుద్ధ్యాదులచే ఈశ్వరుని గ్రహింపజాలమనియు, ప్రత్యక్షానుమాన వేదముల కతీతమైన ఈశ్వరుని ఎవరు ఉపపాదించగలరు అని వాత్స్యాయనుడు భక్తిప్రేరితుడై పలికెను.

పై జర్చింపబడిన విషయముల ననుసరించి చూచినచో ఈశ్వరుడు భూతాధినాథుడై, స్రష్టయై, అంతరాత్మయై, నియంతయై, కర్మఫలప్రదాతయై సర్వప్రమాణముల కతీతుడై యొప్పారి, సర్వమునకు నిమిత్తకారణుడై యున్నాడని న్యాయ దర్శనమతము.



## న్యాయము

'జ్ఞానగ్రహణాభ్యాస స్తద్విద్యైశ్చ' (న్యా. సూ. 4.2.47) అపవర్గార్థము జ్ఞానబోధకమగు నీన్యాయదర్శనముయొక్క అవలంబనము అవసరమనియు, 'సహాసంవాదః' (న్యాసూ.4.2.47) తచ్ఛాస్త్రవిద్వాంసులతో పరిసంగముకూడ అవసరమనియు పూర్వగ్రంథమున వినియుంటిమి. అందుచే న్యాయదర్శన తాత్పర్యము నొకించుక నవలోకించెదముగాక!

గౌతమ తాపసచంద్రముడు ప్రథమసూత్రముననే న్యాయమున కంగములగు షోడశతత్త్వముల దెల్పి వానివలన మాత్రమే తత్త్వజ్ఞానమనియు, నిశ్శ్రేయసనసిద్ధియనియు ప్రారంభముననే

ఎరింగించి యున్నాడు. ఆపదునారు విషయములే గ్రంథాంతము వరకు వివరింపబడియున్నవి. అనగా ప్రథమసూత్రము ప్రమాణాది షోడశకమును ప్రతిపాదింప ద్వితీయము అపవర్గమును నిర్వచింప ప్రథమాధ్యాయ ప్రథమాహ్నిక తృతీయసూత్రము షోడశకమున కాదినగల ప్రమాణనిర్వచనముతో బ్రారంభించి, పంచమాధ్యాయ ద్వితీయాహ్నికమున నిరువదిరెండవసూత్రము కథకానొక్కనిరూప్యమనబడు నిగ్రహస్థానద్వయ వివరణముతో గ్రంథము సాంతము నొందుచున్నది. ప్రథమసూత్రి షోడశక మున నిగ్రహస్థానమే తుదిగా నున్నదని గ్రాహ్యము. అందుచే నీన్యాయదర్శనమున ప్రమాణాది షోడశక విచారమే ప్రధానాంశమని వ్యక్తము.

'ప్రమాణ ప్రమేయ సంశయ ప్రయోజన దృష్టాంత సిద్ధాంతావయవ తర్క నిర్ణయ జల్ప వితండ హేత్వాభాస ఛల జాతి నిగ్రహస్థాన' (న్యా. సూ. 1.1.1)ములే షోడశవిషయములు. వాని నొక్కొక్కదాని క్లుప్తముగ జూడ యత్నించెదముగాక!

'ప్రత్యక్షానుమానోపమానశబ్దాః ప్రమాణాని' (న్యా. సూ. 1.1.3) అనునట్లు ప్రమాణము చతుర్విధమై యున్నది. 'ఇంద్రియార్థసన్నికర్షోత్పన్నం జ్ఞానమవ్యపదేశ్య మవ్యభిచారి వ్యవసాయాత్మకం ప్రత్యక్షం' (నా. సూ. 1.1.4) ఇంద్రియవిషయ సంబంధమేర్పడి, స్పష్టమై నిర్దుష్టమై నిశ్చయమైనదై యుండు జ్ఞానము ప్రత్యక్షము నాబడును. అనగా 'అక్షస్యాఽక్షస్య ప్రతివిషయం వృత్తిః ప్రత్యక్షం' (న్యా. భా. 1.1.3) కంటికి గోచరించు ప్రతివిషయవృత్తియు ప్రత్యక్షము అని అర్థము.

'మితేన లింగేనార్థస్య పశ్చాన్మానమనుమానం' (న్యా. భా. 1.1.3) మితమైన గుణములద్వారా, అర్థమును తెలియుట అనుమానమగును. ఈయనుమానము 'అథ తత్పూర్వకం త్రివిధ మనుమానం పూర్వవచ్ఛేషవత్సామాన్యతోదృష్టం చ' (న్యా. సూ. 1.1.5) పూర్వవత్, శేషవత్, సామాన్యతోదృష్టము నారీతి అనుమానము త్రివిధము. అందు 'పూర్వవదతి-యత్ర కారణేన కార్యమనుమీయతే యథా మేఘోన్నత్యా భవిష్యతి వృష్టిరితి' (న్యా. భా. 1.1.5) పూర్వవత్తనగ - కారణముచే కార్యమును అనుమానించుట యగును. ఎట్లన మేఘము లెక్కువగ నుంటచే వర్షము రాగలదని యనునట్లు 'శేషవత్తత్-యత్ర కార్యేణ కారణ మనుమీయతే, పూర్వోదకవిపరీతముదకం నద్యాః పూర్ణత్వం శీఘ్రత్వం చ దృష్ట్వా స్రోతసోఽనుమీయతే భూతావృష్టిరితి' (న్యా. భా. 1.1.5) శేషవత్తన కార్యమూలమున కారణము ననుమానించుట యగును. నదిలో శీఘ్రగతి విపరీతముగ ప్రవహించు నీరమునుగాంచి వర్షము కురిసెనని స్రోతవలన గ్రహించుట యగును. 'సామాన్యతోదృష్టం-వ్రజ్యాపూర్వకమన్యత్ర దృష్టస్యాన్యత్ర దర్శనమితితథా చాఽదిత్యస్య తస్మాదస్య ప్రత్యక్షాఽప్యాదిత్యస్య వ్రజ్యేతి' (న్యా. భా. 1.1.5) సామాన్యతోదృష్టమన, తిరుగుటకుపూర్వము అన్యత్ర గోచరించి మరల అన్యత్ర గానుపించుట ఆదిత్యునివలె, అందుచే ఆదిత్యుడు తిరుగుచున్నాడని తీర్మానించుట.వీనినే మరల మరొక విధముగా వర్ణింపబడియున్నది. ధూమదర్శనమున అగ్ని ననుమానించుట పూర్వవత్తనియు, పరిశేషమువలెనే అనుమానించుట, అనగా శబ్దగుణ విభాగముచేసి దాని ద్రవ్యము కాదనియు,

కర్మకాదనియు, లేనిగుణముల తొలగదోసి, శబ్దగుణమును అనుమానించుట శేషవత్తని తాత్పర్యము. సామాన్యతో దృష్టమున, అప్రత్యక్షమైనను, లింగలింగులు సంబంధమును, లింగముయొక్క సామాన్యత్వమును గ్రహించి లింగిని అనుమానించుట, ఆత్మకు ఇచ్ఛాదులు గుణములుగా అనుమానించుట యగును. ఇచ్ఛాదులు గుణములు. అవి ద్రవ్యము నాశ్రయించియుండును అందుచే అవి ఆత్మసంబంధములు అని తీర్మానించుట సామాన్యతోదృష్ట మనబడుచున్నది. 'సద్విషయం చ ప్రత్యక్షం సదసద్విషయం చానుమానం' (నా. భా. 1.1.5) సద్విషయముల గ్రహించుట ప్రత్యక్షమనియు, సదసద్విషయముల గ్రహించుట అనుమానమనియు భాష్యకారుడు స్పష్ట బరచెను. ఉపమానము 'ప్రసిద్ధసాధర్మ్యాత్సాధ్యసాధనం' (న్యా. సూ. 1.1.6) ప్రస్ఫుటములగు సామాన్యలక్షణముల ద్వారా సాధ్యమును సాధించుటయనియు నిర్వచింపబడియున్నది. అనగా పూర్వానుభూత వస్తుసాదృశ్యమున అన్యవస్తుజ్ఞానమును గ్రహించుట యగును. 'ఆప్తోపదేశః శబ్దః' (న్యా. సూ. 1.1.7) శబ్దప్రమాణమనగా ఆప్తోపదేశమే యగును. 'శబ్దః–శబ్ద్యతేఽనేనార్థ ఇత్యభిధీయతే జ్ఞాప్యతే' (న్యా. భా. 1.1.3) శబ్ద మనగ, అర్థమును తెలియబరచునదియును, నామకరణము చేయునదియునై యుండును అని భాష్య నిర్వచనము. మరల నీశబ్దము 'దృష్టాదృష్టార్థత్వాత్' (న్యా. సూ. 1.1.8) దృష్ట అదృష్టరూపముల ద్వివిధముగ నుండును. దానిలో దృశ్యముయొక్క సంబంధము దృష్టశబ్దముగను 'యస్యాఽముత్ర ప్రతీయతే సోఽదృష్టార్థః' (న్యా. భా. 1. 1. 8) అముత్రవిషయము అదృష్ట

మనియు అర్థము. ఇట్లు ఋషి లౌకికవాక్యవిభాగము చేయ బడియున్నది. శబ్దము ప్రత్యక్షజ్ఞానముగాక ఆప్తవాక్యాధారమై యుండును గాన శబ్దము అనుమానమే అని సంశయించి, ఆ శబ్దము ఆప్తోపదేశసామర్థ్యమువలన శబ్దము అనుమానము కాద నియు చర్చించుచు 'మంత్రాయుర్వేదవాప్రామాణ్యవచ్చ తత్ప్రా మాణ్యమాప్తప్రామాణ్యాత్' (న్యా సూ. 2.1.68) మంత్రము ఆయుర్వేదములవలె ఆప్తుల ప్రామాణ్యమువలన శబ్దము ప్రామా ణిక మేయని శ్రుతినిగూడ శబ్దప్రమాణముగ కల్పించుచు దర్శ నము వివరించెను. అందుచేతనే 'శ్రుతిప్రామాణ్యాచ్చ' (న్యా. సూ. 3.1.32) శ్రుతిప్రమాణమువలనగూడ అని న్యాయదర్శన కారుడు శ్రుతిని ప్రమాణముగా గైకొనియున్నాడు.

పైన చర్చింపబడిన ప్రమాణములకు 'ఆత్మశరీరేంద్రి యార్థ బుద్ధి మనః ప్రవృత్తి దోష ప్రేత్యభావ ఫల దుఃఖాపవర్గాస్తు ప్రమేయం' (న్యా.సూ 1.1.9) ఆత్మ, శరీరము, యింద్రియములు, విషయములు, బుద్ధి, మనస్సు, ప్రవృత్తి, దోష, పునర్జన్మ, ఫల, దుఃఖము, అపవర్గములు ప్రమేయముగా నుండును. ప్రమా ణములచే గ్రహింపబడునదే ప్రమేయమని గ్రాహ్యము. 'సమా నా నేకధర్మోపపత్తేర్విప్రతిపత్తే రుపలబ్ధ్యనుపలబ్ధ్యవ్యవస్థాతశ్చ విశే షాపేక్షో విమర్శః సంశయః' (న్యా. సూ. 1.1.23) అనేకవస్తు వుల సామాన్యధర్మములచేతను, ఏవస్తువునకును సామాన్యము గాని ధర్మములచేతను, క్రమగ్రహణము లేకుండుటచే అగ్ర హణంబు కలుగగ,వస్తువుయొక్క నిజతత్త్వమును గ్రహింప సందే హించుటయే సంశయమగును. 'యమర్థమధికృత్య ప్రవర్తతే

తత్ ప్రయోజనం' (న్యా, సూ. 1.1.24) ప్రవర్తనాగమ్యముగ నేది యుండునో అది ప్రయోజనము. 'లౌకిక పరీక్షకాణాం యస్మిన్నర్థే బుద్ధిసామ్యం స దృష్టాంతః' (న్యా. సూ. 1.1.25) పండితపామరుల కేవస్తువు సామాన్యమో అది దృష్టాంతమగును. 'తంత్రాధికరణాభ్యుపగమసంస్థితిః సిద్ధాంతః' (న్యా. సూ. 1.1.26) ప్రత్యేక తంత్రవిధానముల అన్వయముల ననుసరించియుండునది సిద్ధాంతము. సర్వతంత్రసిద్ధాంత, ప్రతితంత్రసిద్ధాంత, అధికరణ సిద్ధాంత, అభ్యుపగమసిద్ధాంత రూపమున నది చతుర్విధము. అందు 'సర్వతంత్రావిరుద్ధస్తంత్రేఽధికృతోఽర్థః సర్వతంత్ర సిద్ధాంతః' (న్యా. సూ. 1.1.2 ) ఏతంత్రముచే వ్యతిరేకింప బడక కనీసము ఒకతంత్రముచే గ్రహింపబడినది సర్వతంత్ర సిద్ధాంతమగును. 'సమానతంత్రసిద్ధః పరతంత్రాసిద్ధః ప్రతి తంత్రసిద్ధాంతః' (న్యా. సూ. 1.1.29) సమానతంత్రసమ్మతమై పరతంత్రఖండితమైనది ప్రతితంత్రసిద్ధాంతము నాబడును. 'యత్సిద్ధావన్యప్రకరణసిద్ధిః సోఽధికరణసిద్ధాంతః' (న్యా. సూ. 1.1.30) ఏ సిద్ధాంతమును గ్రహించినచో మరొక సిద్ధాంతము గ్రాహ్యమగునో అది అధికరణసిద్ధాంతము. 'అపరీక్షితాభ్యుపగమాత్తద్విశేషపరీక్షణ మభ్యుపగమసిద్ధాంతః' (న్యా. సూ. 1.1.31) అవిస్పష్టమై పరీక్షానంతరము సిద్ధించునది అభ్యుపగమ సిద్ధాంతముగా నీ సిద్ధాంత చతుష్టయము వివరింపబడి యున్నది.

షోడశకమున 'అవయవ' అనునది సప్తమము. ఇది న్యాయశాస్త్రమునకు శిరస్సువంటిది. దీనికే న్యాయమనియు, దీనివలననే యీదర్శనమునకు న్యాయనామ మబ్బినదనియు కొందరి అభిప్రాయము. దీనిని ప్రత్యేకముగ గ్రహింప నత్యాంతావసరము. 'ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమానాన్యవయవాః' (న్యా సూ. 1.1 3) అని అవయవ నిర్వచనము. దానికి ప్రతిజ్ఞ, హేతు, ఉదాహరణ, ఉపనయ, నిగమనములు అయిదును అంగము లగుచున్నవి. 'సాధ్యనిర్దేశః ప్రతిజ్ఞా'(న్యా. సూ. 1.1.33) దేని నిర్ధారణము గావింపవలయునో దానిని నిర్దేశించుట ప్రతిజ్ఞ యనబడును. 'ప్రతిజ్ఞాపనీయేన ధర్మేణ ధర్మిణో విశిష్టస్య పరిగ్రహవచనం ప్రతిజ్ఞా' (న్యా. భా. 1.1.33) గ్రహింపబడు ధర్మములచే ధర్మియొక్క విశిష్టతను గ్రహించువచనమే ప్రతిజ్ఞ, అని భాష్యకార వచనము. 'ఉదాహరణసాధర్మ్యాత్సాధ్యసాధనం హేతుః' (న్యా. సూ. 1.1.34) సోదాహరణముగ సాధర్మ్యనిరూపణమున సాధ్యమును సాధింప యత్నమే హేతువు. ఉదాహరణములద్వారా సామాన్యముగ సాధ్యధర్మముల సాధనయు, గ్రహణమును హేతువని భాష్యము. అట్లే యుదాహరణమునగల 'వైధర్మ్యాత్' (న్యా. సూ. 1.1 35)విరుద్ధ ధర్మములద్వారా సాధ్యసాధనము గావించుటయుగూడ హేతువే యగును. హేతువునకు ఆధారమైనది ఉదాహరణము. అది 'సాధ్యసాధర్మ్యాత్తద్ధర్మాభావీ దృష్టాంత ఉదాహరణ' (న్యా. సూ. 1.1.36) సాధ్యముయొక్క సామాన్యధర్మమునుగలిగి నిర్ణయింపవలసిన ధర్మము అందుండిన దృష్టాంతమును ఉదాహరణమందురు. ఈ ఉదాహరణము సాధర్మ్యముననేగాక, 'తద్విపర్య

యాద్వా' (న్యా. సూ. 1.1.37) నిర్ణయింపనగు ధర్మము లేకుండుటనుగూర్చి యుదాహరణముగూడ నుండదగును. పైవిధముగ 'ఉదాహరణాపేక్షస్తథే త్యుపసంహారో న తథేతి వా సాధ్యస్యోపనయః' (న్యా. సూ. 1.1.38) ఉదాహరణము ననుసరించి సాధ్యమును అవును కాదనురీతి సమాప్తిచేయుట ఉపనయమందురు. ఇట్లుపనయింపబడిన దానిని 'హేత్వపదేశాత్ప్రతిజ్ఞాయాః పునర్వచనం నిగమనం' (న్యా. సూ. 1.1.39) సహేతుకముగ ప్రతిజ్ఞను పునరుక్తిచేయుట నిగమన మనబడును.

మరల షోడశకమున 'అవిజ్ఞాతతత్త్వేఽర్థే కారణోపపత్తితస్తత్త్వజ్ఞానార్థ మూహః తర్కః' (న్యా. సూ. 1.1.40) తెలియబడని యథార్థవస్తుధర్మమును గ్రహించుటకై నుపయోగించిన యూహ తర్కమని అన్వయము. 'విమృశ్య పక్షప్రతిపక్షాభ్యాం అర్థావధారణం నిర్ణయః' (న్యా. సూ. 1.1.41) ప్రతిపక్షపక్ష విమర్శ గావించి సమస్యను నిర్ణయించి, సందియనివారణ గావించుటయు నిర్ణయముగ నిర్వచించిరి. పక్షప్రతిపక్షములలో నేదేని నొకదాని నవలంబించి పూర్వవిధమున చర్చగావించుట వాదమనుటకు 'ప్రమాణతర్కసాధనోపాలంభః సిద్ధాంతావిరుద్ధః పంచావయవోపపన్నః పక్షప్రతిపక్షపరిగ్రహో వాదః' (న్యా సూ. 1.2.1.) అనుసూత్రము చెప్పబడియున్నది. 'యథోక్తోపపన్నశ్ఛలజాతినిగ్రహస్థానసాధనోపలంభో జల్పః' (న్యా సూ. 1.1.2) పూర్వోక్తమైన ప్రతిజ్ఞాదుల సమర్థించుచు జయించుటకై, ఛలజాతి నిగ్రహస్థానముల నుపయోగించి ఎదుర్కొనుటను జల్పమందురు. 'స ప్రతిపక్షస్థాపనహీనో వితండ' (న్యా. సూ. 1. 2. 3) ఆజల్పమే ప్రతిపక్షఖండన రూపముగనున్న వితండ

మగును. 'స్వవ్యభిచార, విరుద్ధ, ప్రకరణసమ, సాధ్యసమ, కాలాతీతా, హేత్వాభాసః' (న్యా.సూ.1.2.4) సవ్యభిచారము, విరుద్ధము, ప్రకరణసమ, సాధ్యసమ, కాలాతీతము, అనునట్లు హేత్వాభాస పంచవిధము. అందు 'అనైకాంతికః సవ్యభిచారః' (న్యా సూ. 1.2.5) అనేకనిర్ణయముల నందునది సవ్యభిచారము. 'సిద్ధాంతమభ్యుపేత్య తద్విరోధ విరుద్ధః' (న్యా. సూ. 1.2.6) సవ్యభిచారమునకు వ్యతిరేకమైనది విరుద్ధము. 'యస్మాత్ప్రకరణచింతా స నిర్ణయార్థమపదిష్టః ప్రకరణసమః' (న్యా. సూ 1.2.7) ప్రశ్నమునే అనువదించునది ప్రకరణసమ. 'సాధ్యావిశిష్టః సాధ్యత్వాత్సాధ్యసమః' (న్యా.సూ. 1.2.8.) సాధ్యము వలేనే అనిర్ధారితమగునది సాధ్యసమ. 'కాలాత్యయాపదిష్టః కాలాతీతః' (న్యా. సూ. 1.2.9) కాలాతీతమైనది కాలాతీతముగ చెప్పంబడియున్నది. ఈఅయిదును హేతువులు కాకుండుటచే, హేత్వాభాసము లనబడియున్నవి.

'వచనవిఘాతోఽర్థ వికల్పోపపత్త్యా ఛలం' (న్యా. సూ. 1.2.10) ప్రత్యర్థివచనమున కనర్థకల్పనము గావించుట ఛలమని నామము. ఇది 'వాక్ఛలం సామాన్యఛల ముపచారఛల' (న్యా. సూ. 1.2.11) రూపమున త్రివిధము. అందు 'అవిశేషాభిహితేఽర్థే వక్తురభిప్రాయాదర్థాంతరకల్పనా' (న్యా.సూ. 1.2.12) పదమున స్పష్టార్థము నుపయోగింప వక్తయొక్క అభిప్రాయమునకు భిన్నార్థకల్పనము గావించుట వాక్ఛలమందుము. 'సంభవతోఽర్థస్యాతిసామాన్యయోగా దసంభూతార్థకల్పనా' (న్యా. సూ. 1.2.13) అసామాన్యము నాధారముగా గొని సామాన్యమునకు అసంభవత్వకల్పనము సామాన్యఛల

మనబడును. 'ధర్మవికల్ప నిర్దేశేఽర్థసద్భావప్రతిషేధ' (న్యా. సూ. 1.2.14) ఆలంకారికముగ అన్వయార్థమున పదమునకు విరుద్ధముగ ముఖ్యార్థగ్రహణము గావించుట ఉపచారఛలమని నామము. ఇక 'సాధర్మ్యవైధర్మ్యాభ్యాం ప్రత్యవస్థానం' (న్యా. సూ. 1.2.18) సాధర్మ్యవైధర్మ్యముల నాధారముగ గైకొని ప్రతివాదము గావించుట జాతియని నిర్వచనము. షోడశకమున కడపటిదగు నిగ్రహస్థానము 'విప్రతిపత్తిరప్రతిపత్తిశ్చ' (న్యా. సూ. 1.2.19) అర్థగ్రహణాభావమున విరుద్ధార్థగ్రహణ కాలమున నుపయుక్తము. పూర్వోక్తమగు జాతి యిరువది నాలుగు విధములును, నిగ్రహస్థానము యిరువదిరెండు విధములును, అగుట ఈ రెండింటి వివరణమునకై పూర్తిగ అయిదవ యధ్యాయమంతయు వినియోగింపబడియున్నది.

న్యాయదర్శన తాత్పర్యమంతయు ప్రమాణాది నిగ్రహస్థానపర్యంత షోడశతత్త్వములు ప్రథమాధ్యాయమున ఆహ్నికద్వయముననే నిర్వచింపబడియుండుటచే గొందరు పండితులు ప్రథమాధ్యాయమే గౌతమప్రోక్త ఆన్వీక్షికీశాస్త్రమనియు, దానికి తర్వాతిగల అధ్యాయచతుష్టయము గౌతమేతరులు వ్యాఖ్యానించియుందురనియు అభిప్రాయమును వెలిబుచ్చియుండిరి. కాని ప్రథమాధ్యాయవిషయ మసంపూర్ణమై యొప్పుటచే, గౌతమమహర్షి సత్తముడే ప్రథమమున గ్రంథ విషయమును సూక్ష్మముగ సూచించి తర్వాత అధ్యాయములలో విస్తరముగ వివరించియుండెననుట సమంజసమేమో యని తోచును. అనగ అపవర్గప్రాప్త్యర్థమైన శాస్త్రముగాన పరమత

భావముల నీ విధానమున యిసుమంత పరీక్షించి గౌతముడు నిరూపించెననుటయు ఉచితము.

కాన న్యాయదర్శనము సాక్షాత్తు పరమార్థవిషయముల జర్చించి నిర్ణయింపకున్నను, తద్విషయ నిర్ధారణమునకువలయు మేధాశక్తిని, మీమాంసావిధానమును, ఆ మేధాతిథిగౌతముడు మానవలోకమునకు ప్రసాదించియుండుటచే నది అనవసర దర్శన మనిగాని, నిరీశ్వరమనికాని త్రోసిపుచ్చక దర్శనకర్త హృదయమున ప్రవేశించి, ఆతని రచనాలక్ష్యమును దిలకించి, గ్రహించి, తదనుగుణ వర్తనమున దర్శనము నుపయోగించుకొని సాధకలోకము ధన్యతగాంచెదరుగాక ! దర్శనగమ్యమగు అపవర్గ ప్రాప్తి నొందెదరుగాక !

హరిః ఓం తత్ సత్



ఓం

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## సాధన రహస్యము

### అభిప్రాయములు

1. శ్రీ పతంజలి ప్రోక్తాష్టాంగయోగము, వివేకవైరాగ్య శమాది ముముక్షుత్వా లనబడే సాధనచతుష్టయ రహస్యాలు యీగ్రంథంలో సర్వులకు బోధపడేరీతిని సులభవ్యావహారికభాషలో వివరింపబడినవి. ఆధ్యాత్మిక జ్ఞానాసక్తి అయిన పదమూడేళ్లవయస్సుగల బాలిక అభివృద్ధిని కాంక్షించి లేఖలరూపములో స్వామి రచించిన యీగ్రంథం కేవలము ముముక్షువులకే గాక ఆధ్యాత్మికజిజ్ఞాసాపరులైన వారందరికి ఉపయోగకరంగా ఉండవడంలో సందేహంలేదు.

సంతతాభ్యాసంద్వారా ఏకాగ్రిత వైరాగ్యాలను అలవరచుకొని ఆత్మతత్త్వానుభూతిని పొందటానికి భారతఋషులు ప్రతిపాదించిన సూత్రాలను అవగాహన చేసుకోడానికి యీగ్రంథం చాలసహాయం చేస్తున్నది.

శ్రుతిప్రోక్తమైన కర్మయోగానికి లోకమాన్యతిలక్ ప్రతిపాదించిన నిష్కామయోగం భిన్నమైనదని చెపుతూ, కాలానుగుణంగా కర్మభక్తిజ్ఞాన యోగాలకు రాజయోగాన్ని చేర్చుకున్నట్లే నిష్కామయోగాన్నికూడా పరిగ్రహించి ఆచరించదగుననీ, వర్తమానంలో ఆచరణీయమైనది యిదేనని కూడ స్వామి యీగ్రంథంలో పేర్కొని సమన్వయ దృక్పథాన్ని వెల్లడించారు.

పండితులకేకాకుండ పామరులకుకూడా ఆధ్యాత్మిక విషయపరిజ్ఞానం అందుబాటులో ఉండాలనే లక్ష్యంతో పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమత్ అనుభవానందస్వాములు చేస్తున్నకృషి ప్రస్తుతించతగినది. శ్రీరామకృష్ణపరమహంస శిష్యకోటి సాంప్రదాయానికి అనుగుణమైనది. స్వామి రచించిన గ్రంథాలన్నీ, ముఖ్యంగా భారతీయ మతాచార్య ప్రోక్తమైన సకల తత్త్వశాస్త్ర విషయాలను చర్చించిన 'సర్వ సిద్ధాంత సౌరభము' త్వరలో ప్రకటితముకాగలదని ఆశించుతాము.

ఆంధ్రప్రభ

2. ఈగ్రంథం 36 లేఖల సంపుటి. ఈలేఖలన్నీ గ్రంథకర్త శిష్యురాలి నుద్దేశించి వ్రాసినవి. ఈలేఖలలో సాధకుల కుపయోగించే విష యాలను గురించిన చర్చే ప్రధానవిషయం. వీటిలో బ్రహ్మచర్యం ఆసనా భ్యాసం మొదలైన విషయాలెన్నో ఉన్నాయి. మొత్తంమీద లేఖలన్నీ రాజయోగ, జ్ఞానయోగ, భక్తియోగాలకు సంబంధించినవి.

అయితే యివన్నియూ ఒకబాలిక నుద్దేశించి వ్రాయడంచేత రచయిత ఎక్కువ పాండిత్యధోరణి లేకుండా ఆయావిషయాలన్నీ అతిసులభమైన శైలిలో వివరించారు. వీరిలేఖల్లోవాడిన వ్యావహారికం అనర్గళప్రవాహం లాగా సాగిపోతూ పాఠకులలో బాగా అభిరుచి కలిగిస్తున్నది.

ఆంధ్రపత్రిక

3. భీమునిపట్నంలో శ్రీశారదా రామకృష్ణ సంఘము, బాపట్లలో శ్రీరామకృష్ణ భక్తసమాజమూ స్థాపించి, బాపట్లలోనే శ్రీబ్రహ్మానందా శ్రమం నిర్మించుకొని, శ్రీఅనుభవానంద గ్రంథమాలద్వారా తెలుగునాటికి అనుభవంతోగూడిన తత్త్వబోధలు నిత్యోత్సాహముతో చేస్తున్న మహా నీయులు శ్రీఅనుభవానంద స్వాములవారు. గొప్పపండితులేగాక గొప్ప కవులుగూడ. చక్కనిభాషలో పాటలూ, పద్యాలు, వ్రాయగలరు. వ్రాశారు. ఈగ్రంథమాలలో మొదటి నాలుగు కుసుములూ అవే. స్వాములవారు ముచ్చటైన వ్యావహారిక భాషకూడ వ్రాయగలరనడానికి 'ఈ సాధనరహస్యం' నిదర్శనం.

'సాధనరహస్యం' యిందులో లేఖలరూపంగా వివరించబడింది. పదమూడేండ్ల ఒక ఆడపిల్లకోసం వ్రాసినదైనందుకు ఎంతో సరళత్వం సాధించి కృతకృత్యులైనారు స్వాములవారు. ఈబాలిక పూర్వజన్మసంస్కారఫలితంగా చిన్ననాటినుంచి ఆధ్యాత్మికజిజ్ఞాసకలిగి సాంసారిక ప్రవృత్తిరహితమైన చిత్తంతో స్వాలములవారి నాశ్రయించిన ధన్యజీవి. ఆధ్యాత్మికవిజ్ఞయందు వయస్సుతోబాటు ఎదుగుతూ, ఈమెయే యిప్పుడు 'మాతాజీ' యనుపేర దివ్యమై వెలుగుతున్నది.

ఈగ్రంథంలో 26 లేఖలున్నాయి. మొదటి ఉత్తరంలోనే చిన్న పిల్లలకుసైతం బోధపడేటట్లు తత్త్వవిషయాలు చెప్పడంలో స్వాములవారికి చక్కని ప్రజ్ఞ ఉన్నదని స్పష్టపడిపోతుంది. యోగం - ఇంద్రియాలు -

ప్రత్యక్షం - భ్రమ - అనుమానం - శబ్దం - జగత్సృష్టి - నిమిత్తోపాదన కారణాలు - ప్రధానవాదం - పరిణామవాదం - వివర్తవాదం - యీవిషయాలను వీరు విప్పిచెప్పిన ధోరణిచూస్తే ముచ్చటవేస్తుంది. పెద్దల మనుకునే వారుకూడా పిన్నలై కూర్చుండి వినవచ్చు.

ఈధోరణిలోనే ఒక లేఖలో కర్మయోగం వివరించబడింది. పదమూడు లేఖలలో రాజయోగం విస్తరించబడింది. నాలుగు లేఖలలో భక్తియోగము, ఆరులేఖలలో జ్ఞానయోగము బోధించబడింది. సాధనచతుష్టయసంపద లేనిదే తత్త్వజ్ఞానం ఫలించదు కనుక చివరిలేఖలలో దానిని ప్రత్యేకంగా విశదీకరించారు. ప్రతివారూ చదువుకోవలసిన గ్రంథం. 1946లో ఒకమూడు నెలలకాలంలో వ్రాసి ముగించిన లేఖలివి. మంచి కాగితంమీద, గ్రంథం చక్కగా ముద్రించబడింది. ఉపనయనసంస్కారంతో పుట్టిన ఒకబాలిక నిమిత్తంగా పుట్టిన గ్రంథం కావడంతో దీని పవిత్రత ఇనుమడిస్తున్నది.

కృష్ణాపత్రిక

4 ఈగ్రంథంలో సిద్ధాంతమునకు సాధనమునకుగల అవినాభావసంబంధము, సాధనకు సంబంధించిన వివరములుకలవు. శ్రీస్వాములవారు అనేక వేదాంతవిషయముల సులభగ్రాహ్యంగా సరళమైనభాషలో మాతాజీకి వ్రాసిన ఉత్తరములు సేకరించబడి గ్రంథముగా రూపొందింది.

ఇందులో 36 ఉత్తరములలో పండితులకు పామరులకుకూడా వేదాంత సంబంధమైన విషయాలలో ప్రవేశము, ఆసక్తి కలిగించే అనేక విషయాలు కలవు. శీఘ్రగతిని ఆధ్యాత్మిక పారమార్థికచింతను వ్యాప్తిని చెయ్యడానికి యీ గ్రంథము విశేషముగా నుపకరించగలదు. పైగా సిద్ధాంత సాధనలు విశేషంగా ప్రజల కంఠుబాటులోనికి సయితం రాగలవు. ఈ గ్రంథ పఠనానంతరం ఏ వేదాంత గ్రంథమునైనను పఠించి అర్థముచేసుకొనుట సులభసాధ్యము కాగలదు.

ఈగ్రంథముగా రూపొందిన శ్రీస్వాములవారి ఉత్తరములు స్త్రీమూర్తి నుద్దేశించి వ్రాసినవైనను సర్వప్రజానీకానికి ఉపయుక్తమే కాన అమూల్యమైనవని గూడ చెప్పనగును.

గృహలక్ష్మి

5. ప్రస్తుతగ్రంథం ఉత్తరాల సంపుటిరూపంలో వ్రాయబడి ఆధ్యాత్మిక జిజ్ఞాసాపరులకు ఉద్దేశించబడింది. యోగార్థం, తత్త్వచింతనం,

స్త్రీఅర్హత, కర్మయోగం, రాజయోగం, భక్తియోగం, జ్ఞానయోగం, యోగాసనాలు, ప్రాణాయామం మున్నగు విభాగాలన్నీ యీగ్రంథములో వివరింపబడినవి. ఎక్కువగా సిద్ధాంత చర్చల్లోకి పోకుండా సాధనమీద నే దృష్టినుంచి వ్రాయుండటంవలనను చాల సులభశైలిలో వివరించుండటంవలనను యీగ్రంథ విషయాలను యీవిషయాలలో ఏమాత్రం ప్రవేశం లేనివారు కూడ అర్థంచేసుకోనగలరు.

తెలంగాణములో ఆధ్యాత్మిక విజ్ఞానం ప్రచారంచేస్తున్న డివైన్‌లైఫ్ సొసైటీ వారుగాని, యితరులుగాని యిలాంటి గ్రంథాలను ప్రచురించి యుండలేదు. ముముక్షువులైన తెలంగాణీయులు ఆధ్యాత్మికాభివృద్ధికి మూలాధారమైన అష్టాంగయోగము, సాధనచతుష్టయ సంపత్తి వివరములతో గల యీగ్రంథానికి తగు ప్రోత్సాహం యివ్వగలరని ఆశిస్తున్నాము.

గోలకొండ

6. తీవ్రముముక్షుత్వంతో తంటాలు పడుతుండే సర్వసాధక లోకానికి అవగాహతిసామాన్యులకునూ అర్థం అయ్యేలాగ ఆత్మతత్త్వవిషయాలను సిద్ధాంతము, సాధన అనే రెండువిషయాలను అందులోను రెండవవిషయమే ప్రధానంగా వ్యావహారికభాషలో శ్రీమాతాజీకి వ్రాసిన లేఖారూపములో అందిచ్చినారు. ఆత్మవిషయాలు గహనములు. సాధనవిషయములు మరింత కొంతఅయినా తత్త్వశాస్త్రపరిభాష అర్థమయి యుండాలి. వీటి నన్నిటిని ఆలోచించి సాధకుని కవసరమైన సర్వవిషయాలు పండొలచి చేతిలోపెట్టినట్లు స్వాములవారు మనకిచ్చియున్నారీగ్రంథములో. అన్ని యోగమార్గములు, సాధనచతుష్టయము యిందులో చాల వివరంగా ఉన్నవి కాబట్టి, సిద్ధాంతములు తర్కభూయిష్ఠములు కాబట్టి విసివిపోయేవారంతా యీ గ్రంథం చదివి సనాతనధర్మప్రకారం సాధనలో సోపాన పరంపరను తెలిసికోవచ్చును; యీగ్రంథంలో పరిభాషలో 'సుహృత్సమ్మతం'గా రచన ఉన్నది.

ఈ భూమిలో పుట్టి యింత మాత్రమన్నా తెలిసికొని కొంత అయినా ఆచరణ లోనికి తెచ్చుకోకపోతే మనజన్మెందుకు? శ్రీఅనుభవానంద స్వాముల వారికి భక్తిపూర్వకనమస్కృతిశతాలు.

ఆరాధన

7. 4 వ లేఖలోను, 5 వ లేఖ చివరను కర్మయోగ నూతన నిర్వచనము దాని సమర్థనము తృప్తిగా ఉన్నది. అహింసాప్రేమలకు చేసిన నిర్వచనము చాల రసవంతముగా ఉన్నది. 'అస్తేయ' నిర్వచనము చక్కగా ఉన్నది...బ్రహ్మచర్యాన్ని గురించిన వ్యాఖ్య నాకు చాలా నచ్చినది. అపరిగ్రహ మెంతశ్రేష్ఠమైనదో దాని వ్యాఖ్యయు అంత శ్రేష్ఠముగా ఉన్నది. యోగాసనములు, ధ్యానాసనములు వీని స్వరూపస్వభావములు చాల బాగుగా వివరింపబడినవి. మీసింహావలోకనపద్ధతి చాల బాగుగాఉన్నది. ధ్యానాన్ని గురించిన ప్రస్తావన, వ్యాఖ్యానము నాకు హర్షాన్ని కలిగించినది. ధారణా సమాధులవ్యాఖ్యానము బాగుగా ఉన్నది. భక్తియోగప్రస్తావన, భక్తిజ్ఞానముల సామ్యసూచన చాల నచ్చినవి. భక్తియోగ నిర్వచనము రసవంతముగాఉన్నది. జ్ఞానయోగ ప్రస్తావన, జ్ఞానయోగవ్యాఖ్యానము చాల బాగుగా వున్నవి. ఉపసంహారవిషయము చాల బాగున్నది. తితిక్ష, శ్రద్ధ వీని వ్యాఖ్యానము చాల బాగున్నది. ముముక్షుత్వ నిర్వచనము బాగున్నది.

ఈగ్రంథము 'వాఙ్మయగుచ్ఛ' అనవచ్చును. ఈ వాడుకభాష బోధకు చాల అనుకూలముగా ఉన్నది. అచ్చముగా సాధనకు సంబంధించిన విషయములు పుష్కలముగా యిందున్నందున అనేక ఉత్తమగ్రంథాల ప్రయోజన మీ ఒక్కదానిచే సిద్ధింపజేసుకొన వచ్చును.

(శ్రీ) శుద్ధచైతన్య స్వాములవారు.

8. సాధకులకు కల్పతరువు. బందరు.

9. సాధనరహస్యం చదివిన ప్రతివాడు చాల బాగుంటంటాడు. సాధనరహస్యములో ఉన్నవి ఉత్తరములు కావు, అవి ఉత్తమాధికారులకు యివ్వవలసిన ఉపదేశాలు అని నా నమ్మకం. ఈ సాధనరహస్యం తన నిత్య జీవితంలో సాధించి అనుభవానందాన్ని రుచి చూచినట్లయిన స్వామివారి ఋణము తీరుతుం దనుకుంటాను. బందరు.

10. మీ రిచ్చిన సాధనరహస్యము అను పుస్తకమును చదివితిని. ఇంతవరకు తెనుగున అంత విపులముగా వివరించిన గ్రంథమిదియే మొదటిది. ఇట్టి ఉత్తమోత్తమ గ్రంథము నిచ్చి అజ్ఞాననివృత్తికి తోడ్పరించు మీ కృపాపూరితహృదయమునకు వందన శతంబులు. ఏలూరు.

11. సాధకులకు అనగా నాలాంటివాళ్లకు అమూల్యమైన విషయాలు అందించినందుకు మీకు అనేక ధన్యవాదా లర్పిస్తున్నాను. గజపతినగరం.

**12.** చాల ప్రశంసనీయముగా సులభశైలిలో అర్థమిస్తూ బాగా ఉన్నది.
బరంపురం

**13.** ఇట్టి అమూల్య గ్రంథరాజమును విశేషశ్రమతో వ్రాసి తెనుగు ఆధ్యాత్మికలోకమునకు మహోపకృతిచేసిన పూజ్యపాద శ్రీ అనుభవానంద స్వామివారికి మా హృదయపూర్వక వందన సహస్రములు. ఏలూరు.

**14.** అందలి రచన బహుసులభశైలిలో నుండుటచే అనుభవానంద దాయిక మగుననుటకు సందేహము లేదు. అందరి చేతులలోను ఉండవలసిన గ్రంథము.
హైదరాబాదు.

**15.** సాధనరహస్యము అతి అమూల్యమైన గ్రంథము. విశాల దృక్పథమున మన సంప్రదాయములను లోకమునకు చాటుట, ఒక్క భారతీయులయొక్కయేగాక తదితర ప్రపంచవాసుల భాగ్యము. మద్రాసు

**16.** శ్రీ అనుభవానంద స్వామివారి 'సాధనరహస్యం' శ్రద్ధగా చదివాను. ఆ లేఖలసారాన్ని అనుభవించాలంటే నిరంతరమూ పఠించి ఆచరణలో పెట్టాలి.
దిమిలి

**17.** ముఖ్యముగా సాధనరహస్యము అమూల్యము. ఎన్నిమారులు చదివినను యింకను మరిమరి చదువవలయుననియే కోరికయుండును. ఆంధ్రమున, ఆంగ్లమున మన సంప్రదాయ రహస్యములను దెలుపు గ్రంథము లెన్నియో గలవు. కాని యింత సులభవాక్యములలో, స్వానుభవమున మన సాధనమార్గమును తెలిపినవారు బహుకొద్దిమందిగనై యున్నారు. ఇట్టి గ్రంథమును చదివినవారే ధన్యులు. అట్టివారే సాధనరహస్యములను గ్రహించి ఆచరణలో పెట్టగలిగినవారగుదురు. మద్రాసు

**18.** తాము బహుసామర్థ్యముతో సులభశైలిలో రచించగల్గిన గ్రంథము సాధనరహస్యమును పొందుటకు కృతజ్ఞుడను. విజయవాడ

**19.** I have closely gone through your Sadhana Rahasyam. When I read it, I will have to say that the musing words put there-in will be ringing in our ears ever and anon, being in simple and affectionate style. Thereby though we want to be aloof of sadhana those words, precious as they are, will not leave us.

Hyderabad.



# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## ప్రచురణములు

1. శ్రీరామకృష్ణ లీలాసంకీర్తనము :

(తృతీయముద్రణము)

శ్రీరామకృష్ణ, శారద, వివేకానందుల నిజస్వరూపమును వెలువరించుచు, భక్తితన్మయత్వమును, జ్ఞానప్రకాశమును, వైరాగ్యప్రబోధమును గావించు 122 కీర్తనలు.

1/16 డెమ్మీ. సుమారు 170 పుటలు. రు 0-10-0

2. శ్రీరామకృష్ణాంజలి : (తృతీయముద్రణము)

భగవాన్ శ్రీ రామకృష్ణ వివేకానందుల తత్త్వమును ప్రకటించు భక్తిరసభరితమగు 100 పద్యములు. రు. 0- 2-0

3. దక్షిణేశ్వరీస్తవము : (ద్వితీయముద్రణము)

భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధకమును తత్త్వవిషయపూర్ణమైన దక్షిణేశ్వరీ కాళికాస్తవరూప పద్యశతకము. రు. 0- 2-0

4. చిత్తప్రబోధ : (ద్వితీయముద్రణము)

సాధకుల కనేక అమూల్య రహస్యముల బోధించు భావపూరిత పద్యశతకము. రు. 0-2-0

సాధనరహస్యము :

ఆధ్యాత్మికాభివృద్ధికి మూలాధారమైన పతంజలి ప్రోక్త అష్టాంగయోగము, మరియు సాధన చతుష్టయ సంపత్తియు, అతిసులభమగు భాషలో సర్వోపయుక్తమగు వినూత్న వివరణములతో నొప్పారు గ్రంథరాజము.

1/8 క్రౌను. 300 పుటలు. రు. 2-0-0

6. అనుభవానందము :

అద్వైతానుభూత జీవేశ్వరైక్యభావ విభూషిత పద్య శతకము. రు. 0-2-0

7. సాధన సుధ :

సాధనకాలమున ఘటిల్లు అనేక విక్షేపములు, వాని నిరోధోపాయములు, సాధనా విధానములు, వేదాంత సమాధియగు అస్పర్శయోగాది రహస్యములు, అట్టి జ్ఞానసిద్ధునిస్థితి మొదలగు సాధకోపయుక్త విషయములతో గూడిన అమూల్య పద్యగ్రంథము

1/8 క్రౌను. 62 పుటలు. రు. 0-8-0

8. మన శారదామాయి :

శ్రీమాతాజీ త్యాగీశానంద రచితము. సులభమై ఉత్సాహపూరిత సర్వ జిజ్ఞాసాపరులకు ముఖ్యముగ స్త్రీలోకమునకు మహోపయుక్తమగు గ్రంథము. ఇందు శ్రీశారదామాయి జీవితోపదేశ విశిష్టతయు స్త్రీజనాదర్శమును చక్కగ వివరించబడియున్నది.

1/8 క్రౌను. 64 పుటలు. రు. 0-8-0

9. మన వివేకానందుడు :

శ్రీ మాతాజీ త్యాగీశానంద కృతము. భక్తి జ్ఞాన ప్రబోధకమై జ్ఞానవైరాగ్య జనకమై తీవ్ర జిజ్ఞాసువుల కాదర్శమై యిందలి రచన శ్రీ వివేకానందుని మూర్తిని ప్రస్ఫుటమొనరించును.

1/8 క్రౌను. 68 పుటలు. రు. 0-8-0

10. మన రామకృష్ణుడు :

శ్రీ మాతాజీ త్యాగీశానంద కృతము. భక్తిజ్ఞాన ప్రబోధకమై, సాధకుల కాదర్శకమై, మధురశైలి రచింపబడిన యీ గ్రంథము భగవాన్ శ్రీ రామకృష్ణదేవుని సర్వాదర్శమును పాఠకులకు పొడకట్టజేయును.

1/8 క్రౌను. 74 పుటలు. రు. 0-8-0

11. సర్వ సిద్ధాంత సౌరభము :

దర్శన ఖండము - ప్రథమ భాగము

దర్శన, అద్వైత, వైష్ణవ, శైవ సమన్వయాది ఖండములతో నున్న సర్వ సిద్ధాంత సౌరభమున, దర్శన ఖండమున ప్రథమ భాగమున శ్రీ కపిల పతంజలి మహర్షి పుంగవులచే నిర్మింపబడిన సాంఖ్యయోగములు, ఆయా కర్తల జీవిత విశేషములును ఆయా గ్రంథము అనేక పండితాభిప్రాయములతో చర్చించబడి యున్నవి.

1/8 క్రౌను. 350 పుటలు. రు. 3-4-0

12. శాంతి సామ్రాజ్యము :

శాంతి నాకాంక్షించు కల్లోలిత ఆధునిక ప్రపంచమునకు శాంతి సాధనోపాయముల చర్చించు అమూల్య భావగర్భితమగు గ్రంథము.

1/8 క్రౌను. 40 పుటలు. రు. 0-6-0

**13.** శ్రీ రామకృష్ణాదర్శము :

అర్థ రహిత సాధనలలో మునుంగు సాధకలోకమునకు శ్రీరామకృష్ణుడుపదేశించిన పరమ సాధన విధానము రు. 0–2–0

**14.** శ్రీ రామకృష్ణ పూజ :

శ్రీరామకృష్ణ సహస్రనామావళి, షోడశోపచార అష్టోత్తరశత నామములతో గూడిన పూజావిధానము.

1/16 డెమ్మీ. 71 పుటలు. రు. 0–8–0

**15.** సర్వ సిద్ధాంత సౌరభము :

దర్శన ఖండము – ద్వితీయ భాగము

ఈద్వితీయ భాగమున ప్రాక్పాశ్చాత్య పండితాభిప్రాయములతో శ్రీ కణాద గౌతమ ఋషివరేణ్యులచే ప్రతిపాదింపబడిన వైశేషిక న్యాయదర్శనములు వివరింపబడియున్నవి.

1/8 క్రౌను. 294 పుటలు. రు. 3–0–0

**16.** సర్వ సిద్ధాంత సౌరభము ;

దర్శన ఖండము – తృతీయ భాగము

ఇందు శ్రీ జైమిని బాదరాయణవ్యాసుల ప్రజ్ఞా విశేషములు, వారి మీమాంసా వేదాంతదర్శన వివరణములు సర్వోపయుక్తముగ ననేక విద్వాంసుల అభిప్రాయములతో రచితములైనవి.

1/8 క్రౌను. సుమారు 800 పుటలు. రు. 3-0 0

